# విషయసూచిక.



విషయసూచిక.

| గీతనామాని. | | పుటసంఖ్య. |
| --- | --- | --- |

## విషయసూచిక.





# గీతానుక్రమణిక.



# గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

## గీతానుక్రమణిక.

## గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

## గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

## గీతానుక్రమణిక.

## గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.



## యే

# గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

## గీతానుక్రమణిక.

# గీతానుక్రమణిక.

## గీతానుక్రమణిక.





## [ THE GENEALOGY OF THE TALLAPAKAM POETS. FLOURISHED IN THE 15th & 16th CENTURIES. A.D. ]




NOTE 1 :—The numbers marked in this pedigree indicate the various works written in Telugu and Sanskrit languages by these famous poets of Tāḷḷapākam family. [For further information, vide, next page.]

The under-mentioned scholars (noted in the pedigree) are the authors of the various works: thus—

1. Annamāchārya,* the author of—
   (1) Adhyātma-Saṅkīrtanalu,
   (2) Śṛiṅgāra-Saṅkīrtanalu,
   (3) Śṛiṅgāra-Mañjarī and
   [Published in Tirupati Dēvasthānam Tāḷḷapakkam series.]
   (4) Śṛiṅgāra-Lakshṇa in Sañkrit (not available.)

2. Peda Tirumalāchārya, the author of—
   (1) Śṛiṅgāra-Saṅkīrtanalu,
   (2) Vairāgyavachana-gītālu,
   (3) Śṛiṅgāra-Daṇḍakamu,
   (4) Chakravāḷa-Mañjarī,
   (5) Śṛiṅgāravṛitta-Śataka,
   (6) Udāharaṇamulu,
   (7) Nītisīsa-Śatakamu,
   (8) Sudarśana-Ragaḷa,
   (9) Rēpha-Rakāramulu and
   [Published in Tirupati Dēvasthānam Tāḷḷapākkam series.]
   (10) Āndhra-Vēdānta or Bhagavat Gītā. [In the press]

3. Chinna-Tirumalāchārya, the author of—
   (1) Adhyātma-Saṅkīrtanalu, [In the press]
   (2) Śṛiṅgāra-Saṅkīrtanalu, [In the press]
   (3) Ashṭabhāshā-Daṇḍaka (in Sanskrit) and [Published]
   (4) Saṅkīrtana-Lakshaṇa [Published]

4. Chinnanna (alias Tiruveṅgaḷanātha), the author of—
   (1) Paramayōgi-Vilāsamu [Published]
   (2) Ashṭa-Mahishī-Kaḷyāṇamu and [Published]
   (3) Ushāpariṇayamu [In the press.]

5. Tiruveṅgaḷappa, the author of—
   (1) Bālaprabōdhikā on Amara and
   (2) Sudhānidhi on Kāvyaprakāśikā of Mammaṭa.

---

* Various names are given for this Annamāchārya and his sons and grand-sons. [Vide List of various names of Tāḷḷapākkam poets in the next page and page 358 of the Tirupati Dēvasthānam Epigraphical Report.]

## LIST OF VARIOUS NAMES FOR TALLAPAKAM POETS.

(1) Tāḷḷapākam Annamāchārya (the earliest member of the Tāḷḷapākam family),
alias Annamayya,
Annamayyaṅgār,
Annayāchārya,
Annayaguru and
Annayārya.

(2) Tāḷḷapākam Narasiṁha (the first son of No. 1)
alias Narasayyaṅgār and
Narasingaṇṇa.

(3) Tāḷḷapākam Peda-Tirumalāchārya** (the second son of No. 1 and younger brother of No. 2.)
alias Peda Tirumalayya,
Peda-Tirumalayyaṅgār,
Annaya-Tirumalārya,
Annaya Timmaṇārya,
Periya-Tirumalayyaṅgār,
Timmayya,
Timmayārya,
Tirumala,
Tirumalāchārya,
Tirumalaguru,
Tirumalārya-Dēśika,
Tirumalayyaṅgār and
Tālavāka Tirumalayya.

(4) Tāḷḷapākam China-Tirumalayya,** (the first son of No. 3.)
alias China Timmayya,
China Timmā-Dīkshita,
China Tirumalāchārya,
China Tirumala Dīkshita,
China-Timma,

## LIST OF VARIOUS NAMES FOR TALLAPAKAM POETS.

Tāḷḷapākam China-Tirumalayya,
alias Chinna-Timmanna,
Chinna-Tirumalayyaṅgār,
Śiru-Tirumalai Iyaṅgār and
Tirumala.

(5) Tāḷḷapākam Annamayyaṅgāru, (the second son of No. 3.)
alias Annayya and
Annayāchārya.

(6) Tāḷḷapākam Peda Tiruvēṅgaḷa, (the third son of No 3.)
alias Tiruvēṅgaḷa,
Tiruvēṅgaḷanātha and
Tiruvēṅkaṭappan.

(7) Tāḷḷapākam Chinnanna,** (the fourth son of No. 3.)
alias Chinna Tiruvēṅgaḷa,
China Tiruvēṅgaḷanātha,
Tiruvēṇādhar,
Tiruvēṇādhayyar,
Tiruveṅgaḷanātha,
Tiruveṅgaḷanāthayyaṅgāru,
Tiruvēṅkaṭanāthar and
Vēṅgalārya.

(8) Tāḷḷapākam Kōnēṭi-Tiruveṅgaḷanātha, (the fifth son of No. 3.)
alias Kōnēṭi Vēṅgaḷanātha and
Kōnēṭi Tiruvēṅgaḷanāthayyaṅgāru.

(9) Tāḷḷapākam Tiruveṅgaḷappa (the son of No. 4.)
alias Tiruveṅgaḷappar,
Tiruveṅkaṭayyan,
Tiruvēṅgaḷa-Dīkshita.

---

** These two-star marks wherever they are found indicate that they are not only the authors of the above-works but also the donors to the temple of Śrī Vēṅkaṭēśa, Śrī Gōvindarāja and other minor Deities. [Vide respective numbers, registered in six volumes of Tirupati Dēvasthānam Epigraphical Series.]

శుభమస్తు.

శ్రీమతే రామానుజాయ నమః

# (THE WORKS OF TALLAPAKAM POETS)

# అధ్యాత్మసంకీర్తనలు.

(తాళ్ళపాక అన్నమాచార్యుల [1]విరచితము)

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేటి క్రోధి సంవత్సరమందు తాళపాక అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతే అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు ౧౪౨౪ అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౨ నిరుధానకు తిరువేంగళనాథదేవునిమీద అంకితముగాను తాళపాక అన్నమాచార్యులు విన్నపంచేసిన అధ్యాత్మసంకీర్తనలు.

---

NOTE:— The Tāḷḷapākam musician-poets were Nandavarīka Brāhmaṇas, like Allasāni Peddaṇāmātya, the poet-laureate of Kṛishṇadēvarāya of Vijayanagara, and belonged to the Bhāradvāja-gōtra, Āśvalāyana-sūtra and Ṛik-śākhā. This Annayārya or Annamaiyaṅgār was the earliest member of the family. Among the literary compositions of the family preserved on copper-plates three works are found written by him. They are—

1. Śṛiṅgāra-Mañjarī,
2. Adhyātma-Saṅkīrtanalu and
3. Śṛiṅgāra-Saṅkīrtanalu

of which the first work is already published in Tāḷḷapākam Telugu series of Tirupati Dēvasthānam publications Vol. I and the third composition will be published successively. The compilation of these three literary works falls within the period between 1424 & 1503 A.D. For the brief history of his family vide., Tirupati Dēvasthānam Epigraphical Report, page 280.

## తాళ్ళపాకం కవుల కృతులు

### సామంతం

పల్లవి

వలచి పైకొనఁగరాదు వలదనితొలఁగరాదు ।
కలికిమరుఁడు చేసినాజ్ఞ కడవఁగరాదురా ॥

(చరణము)

అంగడి కెత్తినట్టిదివ్వెలంగన ముఖాంబుజములు ।
ముంగిటపసిండికుంభములును ముద్దులకుచయుగములు ।
మొంగిలిఁ జేసినట్టి తేనె లితవులైన మెఱుంగుమోవులు ।
లింగము లేనిదేహములు లెక్కలేనిప్రియములు ॥

కంచములోనివేడికూరలు గరువంబుల బోలుయలుకలు ।
పెచ్చుంగ నెండలోనీడలు యెడ నెడకూటములు ।
తెంచగరానివల్లెత్రాళ్ళు తెలివిపడనిలేతనవ్వులు ।
మంచితనములోని నొప్పులు మాటలోనిమాటలు ॥

నిప్పులమీఁదజల్లిననూనెలు నిగిడితనివిలేనియాసలు ।
దప్పికి నెయ్యిద్రాగినట్లు తమకము తాలిమి ।
చెప్పంగరాని మేలుగనుట శ్రీవేంకటపతిఁగనుటలు ।
అప్పనికరుణగలిగి మనుట అబ్బురమైనసుఖములు ॥ ౧

### దేశాక్షి

పల్లవి

వేదవేద్యులు వెదకేటిమందు । ఆదినంత్యములేని ఆమందు ॥

(చరణము)

అడవిమందులుఁ గషాయములు నెల్లవారు । కడగానక కొనంగా ।
తోడఁబడ నొకమందు దొరకె మాకు భువి । నడియాలమైనట్టి ఆమందు ॥
లలితరసములుఁ దైలములు నెల్లవారు । కలకాలముగొనంగా ।
చెలువైనదొకమందు చేరె మాకు భువి । నలవిమీఱినయట్టియామందు ॥
కడిసినజన్మరోగముల నెల్లవారు । కదలలేక వుండఁగా ।
అడవ శ్రీవేంకటాద్రిమీఁదిమందు । అదిగో మాగురుఁడిచ్చినామందు ॥ ౨

## అధ్యాత్మ సంకీర్తనలు

### దేశాక్షి

పల్లవి

హీనదేసలఁ బొందియిట్లనుండుటకంటె ।
నానావిధులనున్న నాడె మేలు ॥

(చరణము)

అరుదైన క్రిమికీటకాదులందుఁ బుట్టి ।
పరిభవముల నెల్లఁ బడితిగాని ।
యిరవైనచింతనాడింతలేదు యీ ।
నరజన్మమునకంటె నాడె మేలు ॥
తొలంగక హేయజంతువులయందుఁ బుట్టి ।
పలువేదనల నెల్లఁ బడితిఁగాని ।
కలిమియు లేమియుఁ గననేడెఱింగి ।
నలగితిరుగుకంటె నాడె మేలు ॥
కూపనరకమునఁ గ్రుంగి వెసకతనే ।
బాపవీధుల నెల్లబడితిగాని ।
యేపునఁ దిరువేంకటేశ నాకిటువలె ।
నాపాలఁ గలిగిన నాఁడె మేలు ॥ 3

### సామంతం

పల్లవి

ఏవం శ్రుతిమతమిదమేవ త । ద్భావైతుమతః పరం నాస్తి ॥

(చరణము)

అతులజన్మభోగాసక్తానాం । హితవైభవసుఖమిదమేవ ।
సతతం శ్రీహరిసంకీర్తనంత । ద్వ్యతిరిక్తసుఖం వక్తుం నాస్తి ॥
బహుళమరణ పరిభవచిత్తానాం । ఇహపరసాధనమిదమేవ ।
అహిశయనమనోహర సేవాత । ద్వ్యాహరణం వినా విధిరపి నాస్తి ॥
సంసారదురితజాడ్యపరాణాం । హింసావిరహితమిదమేవ ।
కంసాంతకవేంకటగిరిపతేస్త్వ । ద్దాసైవపశ్చాదిహనాస్తి ॥ ౪

# తాళ్ళపాకం కవుల కృతులు

## పాడి

పల్లవి

వేదంబెవ్వని వెదకెడిని । ఆదేవునిఁగొనియాడుడీ ॥

(చరణము)

అలరినచైతన్యాత్మకుఁడెవ్వఁడు । కలఁడెవ్వండీచటంగలడనిన ।
తలంతురెవ్వనినిందను వియోగదేన । యిలనాతనిభజియించుడీ ॥
కడఁగి సకలరక్షకుఁడిందెవ్వండు । వడినింతయు నెవ్వనిమయము ।
పిడికిటతృప్తులుపికరులెవ్వనినిం । దడవిన ఘనుండాతనిగనుండీ ॥
కదిసి సకలలోకంబులవారలు । యిదిగోకొలిచెద రెవ్వనిని ।
త్రిదశవంద్యుండగు తిరువేంకటపతి । వెదకి వెదకిసేవించుడీ ॥ ౫

## గుండక్రియ

పల్లవి

మానుషముగాదు మఱిదైవికముగాని ।
రానున్నది రాకమానఁబోదు ॥

(చరణము)

అనుభవనకుఁబ్రాప్తమైనది । తనకు దాన వచ్చితగిలికానిపోదు ॥
తిరువేంకటగిరిదేవుని । కరుణచేతంగాని కలుషమింతయుబోదు ॥ ౬

## దేవగాంధారి

పల్లవి

అందులకుఁగాదునిన్నునడిగేది ।
ముందరిపనులకే మొక్కఁగాని ॥

(చరణము)

సకలలోకములకు స్వామివైననీవు ।
వాకనినన్నేలకేక వాల్లననవా ।
మోకతివై భూమెల్లమోదియుండిననీవు ।
అకట నా పరభారలంపననవా ॥

## అధ్యాత్మ సంకీర్తనలు

వలుజీవులకునెల్ల ప్రాణమవైననీవు ।
వలచినాలోనుండనొల్లననేవా ।
కలిగిబ్రహ్మాదులను కనిపించిననీవు ।
తెలుచనైన నన్నుఁబెంచననేవా ॥
వరుసనందరికిని వరదుండవైన నీవు ।
యిరవై వరము నాకునియ్యననేవా ।
తొరవులేక శ్రీవేంకటేశ నాథ నిహమెల్ల
కరుణతోనిచ్చితివి కడమలుగలవా ॥

గుండక్రియ

పల్లవి

నీవే ఘనుఁడవు నేనొక దేహిని ।
యీవలంగాచుట యెన్నిక నీకు ॥

(చరణము)

మొక్కినందేరును మోచినతప్పులు ।
అని మొక్కెదనీపాదములకునిదె ।
చిక్కినవారిపై చేరి దయగలుగు ।
అని చిక్కితినిటు నీ చేతికినేను ॥
చెప్పినఁబాయును సేసినపాపము ।
అని చెప్పెదనాదుష్టచేతలివె ।
యొప్పుడుచనవరి యొంగిలిదిన్నను ।
చిప్పిలుఁ బ్రసాద జీవిని నేను ॥
కొలిచినపతి చేకొని రక్షించును ।
అని కొలిచితినిడాగులుమోచి ।
యెలమి శ్రీవేంకటేశ్వర నే నీకు ।
బలిమగు సూత్రపుప్రతిమను నేను ॥

బౌళి

పల్లవి

కరుణించి నీవుగాక గాచితివిగాక ।
శరణని విన్నవించసంగతులా నాకు ॥

(చరణము)

దిట్టనై నేఁ జేసినదిమ్మరిచేతలకును ।
జట్టిగా నీనరకాలు చాలునా నాకు ।
పుట్టిన నాజన్మములు పొసగంగ వ్రాయఁబోతె ।
అట్టె వనముల తాటాకులెల్లఁ జాలునా ॥
కదిసి నేనాఁడేటి కల్లలెంచిచూచితే ।
మొదల నీ భూమియైన మోచునా నన్ను ।
అదన నేనాచరించె అనాచారపుటెంగిలి ।
నదులజలాలు పావనము సేయఁగలవా ॥
తొలుత నేదలచిన ద్రోహాలకు మాఁకులెల్ల ।
యిలఁ గొఱ్ఱులుఁ జేసినా యిందు బాయునా ।
అలరి మరిదిక్కు లేరని శ్రీవేంకటేశ్వర ।
తెలిసి నీనే నాకు దిక్కై కాచితివి ॥ ౯

మంగళకౌశిక

పల్లవి

మా దేహికి నింకను । సాధించినసకలము జయము ॥

(చరణము)

యేదితుద యెన్నఁడు ముగుసును । ఆదికి ననాది హరిమాయ ।
సాదించి సుజ్ఞానినైతే । యీదెస వెదకిన యిహమే పరము ॥
బలిమే దిభవములఁ బాయంగ । కలిగిన బెల్లంగ మణాంబు ।
నిలుకడతో నిర్మలుండైతే । వలసినచోటనె వాడికె సుఖము ॥
తనివేదితగుభోగములకు । తనలోపలనె దైవికము ।
చనవున నను శరణుచొచ్చితే । వెనకొని నిదె శ్రీవేంకటవిభుండు ॥ ౧౦

గుజ్జరి

పల్లవి

బలవంతుడవు నీవుపట్టినది యీడేరును ।
యిలమీదాసుండనైతి యిక బోదుసుమ్మీ ॥

(చరణము)

స్వామీ నాలోనిచంచలగుణములివి ।
యేమిమానవు యెంతైనను ।
నీమాయమహిమో నీకుబరాకైనదో ।
నామనసులోగొంత నలుసున్నదో ॥

దేవా పంచేంద్రియాలుఁ లీదీపులనుఁ బెట్టి ।
నీవేనాయెదలోను నిండుకుండగా ।
యీవేళఁ దరిగాదో యిది నీ వినోదమో ।
నావొల్లి మందబుద్ధినయూమియ్యేదో ॥

అప్పానేఁదొల్లి అజ్ఞానినైనది ।
తప్పానేడు గావతగదా నన్ను ।
చెప్పినామాటవిను శ్రీవేంకటేశ్వరా నీకు ।
వొప్పినదియాత్మ వొల్లననరాదు ॥ ౧౧

భౌళి

పల్లవి

అయ్యో యేమరి నేనాడప్పుడేమైవుంటినో ।
అయ్యెడనీదాసినైతె ఆదరింతుగా ।

(చరణము)

అలనాడు బాలుండవై అవులంగాచువేళ ।
చిల్లరదూడనైతె చేరికాతువుగా ।

వల్లెగావిటుండవై రేపల్లెలోనుండేనాడు ।
గొల్లెతనయినా నన్ను కూడుకొండుగా ॥
మేలిమి రామావతారవేళ రాయిరప్పలైన ।
కాలు మోపి బ్రదికించి కాతువుగా ।
వాలిసుగ్రీవులవద్ద వానరమైవుండినాను ।
యేలినన్నుఁ బనిఁగొని యీడేర్తువుగా ॥
వారిధిలో మశ్చకూర్మావతారములైననాడు ।
నీరులోజంతువునైన నీవుగాతువుగా ।
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె ।
ఘోరతోపున నిన్నాళ్ళు మోసపోతిగా ౧౨

సాళంగనాట

పల్లవి

యెక్కడి పురాకృతము యేమిచేసిని ।
యెక్కడ బలు నీ జంట్లటుండినాఁ జెల్లును ॥

(చరణము)

నీవల్లఁ బుట్టెను బ్రహ్మ నీవుచేసినది మాయ ।
భావించి నీకుక్షిలోనె బ్రహ్మాండాలు ।
కావింప నీవేలికవుకమ్మని నట్టెఁ బనులు ।
దైవమాయిది యెరింగి నీదాసుండ నేనైతిని ॥
భూమిని దేవులు నీవుపుట్టించిన దమృతము ।
శ్రీమంతుఁడవిన్నిట నీచేసినట్టవును ।
యేమిటివాడు యముడు యెక్కడి మృత్యువుమరి ।
సామజవరద మీశరణుజొచ్చితిని ॥
యేడఁజూచిన నీదాసులెక్కడఁ జెడుట లేదు ।
యీడు లేదు శ్రీవేంకటేశ నీకును ।
యేడవిధి యేడస్వర్గ మెక్కడిదినరకము ।
జాడతో నీముద్ర నాభుజములధరించితి ॥ ౧౩

### మాళవిగౌళ

పల్లవి

కర్మమంటామాకు మాయగట్టెవుగాక ।
కర్మముధర్మము నీకల్పితమేకదా ॥

(చరణము)

బ్రతుకమంటే జచ్చినపరీక్షిత్తుబ్రదుకఁడా ।
మతి నారాయణాస్త్రము మానుమంటే మానదా ।
కతలుగా జలధులుకమ్మంటే రాళ్ళుగావా ।
హితవు నీకునైతే యేపనియైననౌను ॥

తులసిబ్రహ్మమాయకు మారుమాయఁజేయవా ।
అలద్రౌపతికిఁ జీరలక్షయమంటేఁ గావా ।
కలగిదులు నేలతో క్రుంగమంటెక్రుంగవా ।
యిలనీకువలసితే యేపనియైననౌను ॥

యిట్టిది విధియనరాదిదియోఁగాదనరాదు ।
పట్టి నీవుదలంచినయట్టాగాన ।
యిట్లె శ్రీవేంకటేశ యిందరిలో ననుఁగావు ।
కొట్టునీకువలసిన యేపనియైననౌను ॥ ౧౪

### సాళంగనాట

పల్లవి

అట్టివాడంగనుక నే హరి నీదాసుండనైతి ।
వొట్టినయపరాధము లొడ్డించుకోవళవూ ॥

(చరణము)

యెన్నినేరాలైనఁజేసి యేమిటాఁదీరనితప్పు ।
వున్నతి నీ లెంకనైతె వూరకేపోవు ।

పన్ని పగసేసివచ్చి బలవంతునిమరుంగు ।
దన్నుఁదా నెచొచ్చితే దక్కిపోవుఁబనులు ॥
వొడ్డినసామ్మొల్లాదినివ్వానిన ఋణమునకు ।
బిడ్డ పేరు పెట్టితేనుబి తేవాసును ।
అడ్డమొజగడగాని ఆదరానిమాటలాడి ।
మొడ్డిమీఁదికెత్తుకొని మొక్కితేనపోవును ॥
పాపమేకూడుగనుండి పట్టినారాయంటే ।
చేపట్టి వైకుంఠమిచ్చి చేరికాచితివి ।
యేపున శ్రీవేంకటేశ యిదివినేపో నేను ।
మాపున నీయచ్చు మోది ముందరనిలిచితి ॥ ౧౫

గుజ్జరి

పల్లవి

ఇన్నియు పాయము లింక నేడకెక్కు శ్రీహరి ।
పన్ని నీ మఱుఁగుజొచ్చి పాయకుండేఁగాక ॥

(చరణము)

అనంతకోటిజన్మములందుఁ జేసినపాపములు ।
మొనసి నేనొకజన్మమునవిందగన ।
ననిచి కర్మానుష్ఠానము నేఁడుఁ జేయంబోతె ।
పనివడినంత నిటబడబాగ్ని యౌరునా ॥
పెక్కు కవిశేలవ్రాత కుంభీపాకకారవాలు ।
వొక్క దేహాన నేపాంచేవునంతరించెనా ।
తక్క నేడీ ఘోరతపములుఁ జేయఁబోతే ।
గ్రక్కనజలధి బుఱ్ఱకాయనిండెనా ॥
బలువై యనాది వేళ్ళువారినసంసారము ।
తలమోది నేడింతలో త్రవ్వివేసెనా ।
నేలవే శ్రీవేంకటేశ నే నేఁకుపుణ్యామంటితె ।
తెలంగి పెనుగాలికి చింపిచాటలడ్డమా ॥ ౧౬

## అధ్యాత్మ సంకీర్తనలు

### గుజ్జరి

పల్లవి

ఎటువలెసిద్ధించు నీపనులు యెవ్వరు విన్న నవ్వుదురు ।
తటుక్కననుండుట చాలిగుంటయుట తలంపులు మేడమడుగులు ॥

(చరణము)

నీవే బ్రహ్మాండనాథుండవు నేనొక మశకమును ।
యీవల ప్రత్యక్షముఁ గోరెద నెక్కడి కెక్కడసంగతం ।
ఆవటించి నేఁ జేసినవైతే నపరాధంబులు వేవేలు ।
కావవనుచు నే నిన్నుంబలికెదను కడుసాహసుండగా నేను ॥

నిక్కము నీవు స్వతంత్రుడవు నే మాయాపరతంత్రుడను ।
ఇక్కువ నీపై భక్తిఁ జేసెదను యెక్కడి కెక్కడసంగతం ।
ఇక్కడ నే మోచినది కన్గొనంగ నేడుజూసలది శరీరము ।
తక్కసించినను ధ్యానముఁ జేసెద కడుసాహసుండగా నేను ॥

హెచ్చిన నీచిత్తముగాన యేచిన నాభాగ్యము దెలియ ।
ఇచ్చల నే బయలుకు మొరవెట్టెద యెక్కడి కెక్కడసంగతం ।
కచ్చుపెట్టి శ్రీవేంకటనాయక కరుణించితి విటు నను నీవే ।
గచ్చుల వూరకె నిన్నుఁ బొగడెదను కడుసాహసుండఁగాను ॥ ౧౨

### మంగళకౌశిక

పల్లవి

దేవనావలన గుణము తెలిసి కాచెన నేటి ।
యీ వెట్టితనము మాని యిట్టె నన్నుంగావవే ॥

(చరణము)

నేరుపె నాకుఁ గల్గితే నట్టువ నింద్రియముల ।
బారింబడి బంటనై పంపుసేతునా ।
ఆరీతి నేనే వివేకినైతే హేయపుమేను ।
కోరి బ్రహ్మమని నమ్మి కొంకక గవిసెంతునా ॥

నాలో బుద్ధిగలిగితే నలింగామక్రోధములు ।
యీలీల నాసామ్ములని యెన్నుకొందునా ।
తాలిమి నాయందు మంచితనములుగలిగితే ।
మూలనున్న నాకర్మముల కట్టివేసునా ॥

చిత్తమేకై వశమైతే చేరిసుఖదుఃఖముల ।
మత్తుండనై మరచి యేమరివుందునా ।
అత్తిన శ్రీవేంకటేశ అంతర్యామివి నీవు ।
తత్తరవు నాపస తగ నీ వెఱుంగవా ॥ ౧౮

బౌళి

పల్లవి

చదివేదివేదము లాచారము మదింబట్టదు ।
మదనాతురుండ నాకుమంచితనమేది ॥

(చరణము)

ముట్టరౌభాగ్యముగానివి హూచితిఁదోలు నెమ్ములు ।
అట్టబదికిన నే ఆసలు బెట్టు ।
గట్టిగాఁబ్రాణములీవు చావంటె వెరతునేను ।
యిట్టియజ్ఞానికి జ్ఞానమెట్టుగలుగును ॥

కావలెననుచుంగోరి కదుభ్రునించినరుచి ।
యీవలహేయమై వెళ్లి యేఁజూడఁగా ।
దావమిమనసందుకే తగిలిఁగానిరోయదు ।
భావించి నన్నెఱుంగ నీభావమెరింగెనా ॥

యోనిగతుండనై పుట్టి యోనిమగ్నుండనైతి ।
పూనిలోకబండత నేబుద్ధెరింగెనా ।
నేనాసిగ్గరంగ నీవే విచారించికావు ।
శ్రీనిధి శ్రీవేంకటేశ చేతిలోని వాఁడను ॥ ౧౯

## అధ్యాత్మ సంకీర్తనలు

దేసాళం

పల్లవి

నన్ను నింతగాగడించి న్యాయమాదిగవిడువ ।
అన్నిటరక్షించుకోవే అంతర్యామి ॥

(చరణము)

సొమ్ము వేసినవాఁడు చుట్టిచుట్టివీధులెల్ల ।
కమ్మర వెదకినట కన్న దాఁకను ॥
నమ్మి నజ్ఞానములో నన్నుఁబడవేసుకొని ।
అమ్మరో వూరకుందురా అంతర్యామి ॥

వోడ చేరమాడేవాఁడు వొక్కడరిచేరిచి ।
కూడినయర్థము గాచికొనెనట ।
యీడనే ప్రపంచములో యిట్టినన్ను దరిచేర్చి ।
వోడక కావంగరాద వోయంతర్యామి ॥

చేరివుప్పమ్మువాఁడు చిట్లువేఁగనండట ।
వూరకె శ్రీవేంకటేశ వోపిక తోడ ।
అరయ నన్ను బుట్టించినట్టివాఁడవు నాభార ।
మేగతినైన మోపుమింక నంతర్యామి ౨౦

లలిత

పల్లవి

ఇచ్చితివి తొల్లె నాకు యియ్యంగలవన్నియును ।
మచ్చిక నీశరణన్న మాత్రమే చాలు ॥

(చరణము)

సామీప్యమునడుగ సారూప్యమునడుగ ।
కామించి సాయుజ్యసాలోక్యములడుగ ।
భూమిఁగాని పాతాళంబునఁగాని దివింగాని ।
సమాన నీదాసులలో సహవాసమియ్యవే ॥

కాయసిద్ధినడుగ కర్మఫలమడుగ ।
ఆయెడ దేవపట్టములవి యడుగ ।
యీయెడ నేఁడేకాని యింకొక్కనాఁడైనఁగానీ ।
చేయార నీదాసులసేవ నాకునియ్యవే ॥
దేవుండవు నీవె మాకుం దెలిపె యాచార్యులు ।
శ్రీవైష్ణవులేగతిచిక్కిన వేళ ।
శ్రీవేంకటేశ్వర జీవము భారమునీది ।
పావనమైతిమింక పలుచింతలేల ॥ ౨౧

భౌళి

పల్లవి

నాగుణాలుదలంచక నీగుణాలె తలంచుకో ।
యేగతినిమానరాదు యింకనైనను ॥

(చరణము)

తెచ్చినాగురుఁడునిన్ను తిరువారాధనసేయ ।
నిచ్చినాడు తలంచుకో యిఁకనైనను ।
అచ్చుమోపి దాసునిఁగానఁగవించిరి నీదాసు ।
లిచ్చల నన్నుం జేపట్టు మిందులకునైనను ॥

శరణాగతరక్షణశాంతి నీభక్తులకుగా ।
యిరువుగాఁదలంచుకో యిదియైనను ।
తిరుమంత్రమే నన్నుందెచ్చి నీసొమ్ముగఁజేసె ।
మొరవులేక కాచుకో యిందులకైనను ॥

యిట్టి అభయహస్తము త్తితివెక్వారికిఁగా ।
మొట్టనదుటందలంచు మిదియైనను ।
గట్టిగా శ్రీవేంకటేశ కడునీనాసంబంధమే ।
మొట్టయినఁదలంచుకో యింకనైనను

## అధ్యాత్మ సంకీర్తనలు

### బౌళి

పల్లవి

హరినీవు నాకు లంచమిచ్చేవు అన్నిమర్మములుచెప్పుమనా ।
దొరవంట మొక్కినీదాసులతోడ తుచ్ఛపు నీచేతచెప్పుదునా ।

(చరణము)

అలనాఁడునీవు మైలన్నచొక్కయ నంటుకొన్నసుద్దిచెప్పుదునా ।
గొల్లెతలవాడ చీకటిని తప్పుకోరి చేసినదిచెప్పుమనా ।
వెల్లివిరిగ రేపల్లెలోపలి వెన్నముచ్చిములుచెప్పుమనా ।
తల్లిబిడ్డనొక్కవావిగఁజేసినధర్మపు తగవుచెప్పుమనా ॥

మేఁటిమీనవై ఆఁకటికిఁజిన్నమీలందిన్నసుద్దిచెప్పుదునా ।
పాటించి నీసరిబావమఱఁదికి బండి రొప్పినదిచెప్పుదునా ।
గాఁటపుట సురకామినులతోడ కల్లలాడినదిచెప్పుదునా ।
యీడుపెట్టుకొని నీవు బోయదానియెంగిలిదిన్నదిచెప్పుమనా ॥

దీనవృత్తింబోయి బలిచక్రవర్తిఁదిరుసుకొన్నదిచెప్పుదునా ।
ఆనిఁచి శ్రీసతిపాదాలు నీమెడనంటఁగట్టుకొంట చెప్పుదునా ।
దానవాంతక శ్రీవేంకటేశ్వరదైవమని నిన్నుంజెప్పుదునా ।
పనిపట్టిశరణాంటేఁగాచేటి పరమేకాంతముచెప్పుమనా ॥ ౨౩

### శుద్ధవసంతం

పల్లవి

మఱందియనుచు ధర్మజుండుభ్రమసునట ।
మొఱకతోడి వివేకమెవ్వరియందున్నది ॥

(చరణము)

గరుడవాహనమెక్కి ఘనబాణునిసరకి ।
తిరిగిన నమ్మురారి దేవుండవని ।
నరకాసురునిఁజంపి నాతులం బదారువేల ।
పెరసిపెండ్లాడినది వివేకించరైరి ॥

బలు శంఖచక్రములుపట్టి బాలకులందెచ్చి ।
తెలిపిన నమ్మాళ్వారి దేవుండవని ।
సొలసివిశ్వరూపముజూపి అగ్రపూజగొని ।
తెలయ నీమహిమలు వివేకించరైరి ॥

వక్కనద్రౌపదింగాచి బ్రహ్మచేమ్రొక్కించుకొని ।
దిక్కైన నమ్మాళ్వారి దేవుండవని ।
దక్క శ్రీవేంకటేశ యిందరికి వరములిచ్చి ।
వెక్కసమైతివి నాఁడు వివేకించరైరి ॥ ౨౪

## శుద్ధవసంతం

నేమునికన్యలమూ నీవుమాలోకేవా ।
యీమేరలనే మమ్మునేలుకొందుగాక ॥

(చరణము)

ధరవిభీషణుండు మీతల్లికడవాఁడా ।
నిరతిఘుంట కర్ణుండు నీతండ్రివాఁడా ।
యిరవై ధృవుండు మీయిల్లాలికడవాఁడా ।
శరణన్నమాఁటలోన సరిగఁగాచితివి ॥

మున్నిటశబరి నీకు ముమ్మనుమరాలా ।
మిన్నక వృద్ధవుఁడు మీమేనమామా ।
పన్నిన పురుత నీకు పాయరానిచుట్టమూ ।
మొన్నంగపీరలనెల్ల నింతలోమెచ్చితివి ॥

అహల్య నీకూతుశా అక్రూరుండు గొడుకా ।
విహరించ నీకు శ్రీవేంకటేశుండా ।
వహి ముత్తాతలా నీచే వరములుగొన్నవారు ।
మహినిందుల కేలో నీమహిమఁగాచ్చితివి ॥ ౨౫

భౌళి

పల్లవి

వెన్నలుఁదొంగిలినాటి వెట్టివానీవు ।
విన్నకన్నజాడగాను వెట్టివానీవు ॥

(చరణము)

మాఁటియజ్ఞానంబున మిఁమ్మెల్ల నీజవుల ।
విటిడివై మోఁచేవు వెట్టివానీవు ।
వేతే నారపేరనుడివితే నీపేరసేవు ।
వేఱులేనిచుట్టమవై వెట్టివానీవు ॥
బంటులైనవారికెల్లఁబరతంత్రుండవై ।
వెంట వెంటఁదిరిగేవు వెట్టివానీవు ।
అట్టిరెంకు కుచేలుని యటుకులకేమెచ్చేవు ।
వింటిమాఁటనప్పువచ్చే వెట్టివానీవు ॥
పావనమైలోకులెల్లఁ బ్రదుకుండటంబేరులు।
వేవేలువెట్టుకొంటివి వెట్టివానీవు ।
శ్రీవేంకటేశుండవై చేరి వరములిచ్చేవు ।
వేవేగనెవ్వరికైన వెట్టివానీవు ॥

లలిత

పల్లవి

సర్వేశ్వరుండవు స్వతంత్రుడవునీవు ।
సర్వోత్తముండ నన్నిచ్చటంగావవే ॥

(చరణము)

శక్తికలిగితే నీసరుసదేవుఁడఁగానా ।
యుక్తికలిగితే నేనోడలుమోతునా ।

యుక్తియుశక్తియునొకటిలేక నీ ।
భక్తుండనైతి నన్నుం బాలించవే ॥
బహుపుణ్యుండనైతె బ్రహ్మపట్టమేలనా ।
సహజ విజ్ఞానినైతె సంసారినౌదునా ।
విహితపుణ్యజ్ఞానవిముఖుండ గనక నే ।
నహికయముండ శరణంటిఁగావవే ॥

శ్రీవేంకటేశ నీవుచేసిన ప్రతిమనింతే ।
నీ వెఱుఁగనిదిలేదు నేరుపునాయందునేది ।
భావములోపల నీవేపైకొని బుద్ధియయ్యంగా ।
నీవాఁడననుకొంటినేఁడుగావవే ॥

హుజిజి

పల్లవి

నేనై తెలిసేదేరుదు నీకులీలామాత్రమింతే ।
మానక నన్నేలుకొమ్మ మాధవగోవిందా ॥

(చరణము)

నీవునన్ను మన్నించితే నీమహిమలోఁగొంత ।
యీవలవెలితియౌన యీలోభమేల ।
కావించిపాలజలధికడ నొక్కతుంపరు ।
వేవేగవిదలించితె వొందులకు ॥

వేడ కర్మినైన నన్ను వెనక వేసుకొంటేను ।
గాడవనీకువచ్చినా కొంకనేఁటికి ।
గడుసుదొంగైనవాఁడొక్కండు కొండలోఁదాఁగితే
వొడమిచ్చినకొండకు హీనమయ్యేనా ॥

కందువ శ్రీవేంకటేశ కరుణారసమునాపై ।
చిందరాదా అనుమానచింత లేటికి ।
యిందరిపై సూర్యుండు యెండలుగాసితేను ।
అందుకొన్ని కిరణాలు అరగిపోయినా ॥ ౨౮

పాడి

పల్లవి

రామచంద్రా రామభద్రా రఘువీరా ।
నీమహిమ దెలిసెరా నేఁటివారు ॥

(చరణము)

అరయ జటాయువునకల్లే మోక్షమిచ్చితివి ।
హరునివిల్లువిఱిచి అలరితివి ।
యిరవై రాతికిఁబ్రాణమిచ్చితివింతేనిన్ను ।
సరుడంటనుండిరిగా నాటివారు ॥

నెమ్మదిసరయువులోనిచ్చితి వైకుంఠము ।
నెమ్మిమారుతికి బ్రహ్మపట్టమిచ్చితి ।
దుమ్ములుగ రాక్షసులఁదుత్తుమురుసేసితివి ।
నమ్మిరిగా రాజవంటానంటేవారు ॥

యెంచనుఁజెడని పట్టమిచ్చితి విభీషణుని ।
కందీపరశురామునినంగవించితి ।
యిందునే శ్రీవేంకటేశ యెఱుంగక దశరథ ।
నందనుఁడేయనిరిగా నాఁటివారు ॥ ౨౯

శుద్ధవసంతం

పల్లవి

యేమియునుఁగనొల్ల యెచ్చుకొందులననొల్ల ।
కామించినీవిచ్చితి కైవల్యపదము ॥

(చరణము)

పుట్టుగులకు నెరవధాయిలోన హానికి ।
అట్టె నీదాసుడ నైనతేజాలు ।
వెట్టికి నేజాతినైన నెరవ నీనామములు ।
వొట్టినా నాలిక మీదనుండి తేజాలు ॥

వెఱవం బాపములకు వేరైన హరిని ।
యెఱలేని కైంకర్యమిచ్చి తేజాలు ।
వెఱవనింద్రియముల వెతలకు నీ వాత్మ ।
నెఱుక బోధనుండవై వుండి తేజాలు ॥

యేలోకమైన వెఱవ మెక్కువ శ్రీవేంకటేశ ।
పాలించి నీకృప నాపై బారి తేజాలు ।
కాలమెట్టైన వెఱవ కర్మమెట్టైన వెఱవ ।
యేలిన నీదాసులు నన్నియ్యకొంటే తేజాలు ॥ 30

భూపాళం

పల్లవి

భారము నీపై వేసి బ్రదికియుండుటె మేలు ।
నారాయణుండ నీవే నాకుంగలవనుచు ॥

(చరణము)

శరణన్న వెఱపయ్యి సామజముం గాచినట్టు ।
వరుసదావతిపడి వచ్చేవంట ।
హరికృష్ణయన వెఱపయ్యి ద్రౌపదివర ।
మిరవుగ నిచ్చినట్టు యిచ్చేవోయనుచు ॥

చేతమొక్క వెఱపయ్యి చీరలిచ్చి యింతులకు ।
భ్రాంతిపడ్డట్టే నన్నుం గైకొనేవంట ।
అతులవమ్మంగ వెఱపయ్యి పాండవులవలె ।
గాతరాన వెంట వెంటం గాచి యుండేవనుచు ॥

ఆరగించుమనవెఱపయ్యె శబరివలె ।
అరయ నెంగిలియనక యొసఁగెవంట ।
యేరీతినన వెఱతు యిచ్చెనట్లాఁగావు ।
కూరిమి శ్రీవేంకటేశ గోవులఁగాచినట్లు ॥ 30

బౌళి

పల్లవి

రామ రామ రామ కృష్ణ రాజీవ లోచన నీకు ।
దీమువంటి బంటననే తేజమేనాది ॥

(చరణము)

వారిధిదాటి మెప్పించ వాయుజుడనేఁగాను ।
సారెఁజవుల మెప్పించ శబరిఁగాను ।
బిరాన సీతనిచ్చి మెప్పించ జనకుండఁగాను ।
యేరీతి మెప్పింతు నన్ను యెట్లుఁగాచేవో ॥
ఘనమైన మోచి మెప్పించ గరుడుండనేఁగాను ।
కొనఁగామ సుఖమియ్య గోపికఁగాను ।
వినుతించి మెప్పించ వేయినోళ్ల భోగిఁగాను ।
నినునెట్లు మెప్పింతు ననుఁగాచేదెట్లో ॥
నవ్వుచుఁ బాడి మెప్పించ నారదుఁడనేఁగాను ।
అవ్వలఁ బ్రాణమియ్య జటాయువుఁగాను ।
యివ్వల శ్రీవేంకటేశ నీకే యిటు శరణంటి ।
అవ్వల నాతెరువేదో రక్షించేదెట్లో ॥ 31

లలిత

పల్లవి

వున్న మాట లింక నేలవా దేహా ।
యెన్నటికిదే మాట యింకా నింకను

## తాళ్ళపాకం కవుల కృతులు

(చరణము)

కొంత నాకర్మ ఫలము కొంత నీ రక్షకత్వము ।
యింతలో రెండు గలవా యేమో దేవా ।
అంతర్యామివి నీవు ఆడేటి బొమ్మను నేను ।
చెంతఁగాచుట నీపని సేవ జేయుట నాపని ॥

నే నపరాధి నయ్యేది నీవు వహించుకొనేది ।
యీ నెపాలు రెండు నేల వేమో దేవా ।
మానక యిట్లయితే నీ మహిమకు గురుతేది ।
అని చింతించె నందుల కపకీర్తి యనుచు ॥

మేధలే నా యధమము మీ ఘనత యెంచికావు ।
యిదియె నా విన్నపము యేమో దేవా ।
యెదుట శ్రీ వేంకటేశ యిన్నిట నీ బంటుబంట ।
పదివేలు నా నేరాలుపట్టకుమీ యింకను ॥ 33

### సాళంగనాట

పల్లవి

నీవాఁడనై నేను నిచ్చలు సంసారము ।
యేవిధినుండిన నీకె యింత శెలవు ॥

(చరణము)

కొమ్మ రాణివాసమై కోరి మూలల నుండినను ।
నమ్మది దినాలు మగనికే శెలవు ।
కమ్మవడ్డించినయట్టి కంచములోని కూరలెల్ల ।
దొమ్మి విందారగించేటి దొరకే శెలవు ॥

పంట కొలుచు కొటారున పాఁతరలోఁ బెట్టినాను ।
అంటక రాచముద్రకు అదే సెలవు ।
యింటిపాడి జన్నవట్టి యెంతవుట్టిఁ బెట్టినాను ।
వెంట వెంటఁ దన యిల వేల్పులకే శెలవు ॥

పెక్కువ సొమ్ములుదాఁచి పెట్టెలోన నుంచినాను ।
నిక్కము సొమ్ము గలవానికే సెలవు ।
అక్కజపు శ్రీ వేంకటాధిపుని శరణంటి ।
మిక్కుటపు నాజన్మము మీకే సెలవు ॥ ౩౦

### శుద్ధవసంతం

పల్లవి

యెంత పరమబంధుండవు యేమని నుతింతుమిమ్ము ।
అంతనిన్ను మరచి నే నపరాధి నైతిని ॥

(చరణము)

దురితములే నేఁజేసి దుఃఖముఁ బొందేనాఁడు ।
తొరలి నన్ను రోసి తొలంగవైతి ।
నరకము చొచ్చేనాఁడు నాకు నంతర్యామివై ।
పరుండు వీఁడేల యనపాయనై తివిగా ॥

జనని గర్భమునందు చేరి బడివుండేనాడు ।
పెను బలమవై నన్ను విడువవైతి ।
పెనంగి పంచేంద్రియాల పేరు వికులయ్యేనాఁడు ।
అనుభవింపగఁ జేసి అందుకు లోనైతివి ॥

యెటు నేఁగోరిన అదే యిచ్చి పరతంత్రుడవై ।
మెట్టుకొని నా యిచ్చలో మెలంగితివి ।
యిట్టే యీ జన్మమున నన్నేలి శ్రీవేంకటేశ ।
పట్టి నీ దాసులలో దప్పక మన్నించితివి ॥ ౩౧

### దేసాళం

పల్లవి

యేయాజ్ఞ అయినఁబెట్టు యిదివో నా దుర్జనము ।
యేయపరాధమో కాని యింతేసి చేసితిని ॥

(చరణము)

అమ్ముకొని నీ దాసుండననేటి సలిగెలను ।
వేమారుఁ బాపములకు వెరవనైతిని ।

నీ మెరుంగు చొచ్చినట్టి నిజగర్వమే నమ్మి ।
నేమపు పుణ్యములు మానితి నేను ॥
తగిలి నీముద్ర మేన ధరించిన చనవున ।
పగటున దేవతలు పంపుసేయను ।

నగుతా నీ నామము నాలికనున్న బిరాన ।
జగతి నిత్య కర్మము జోదోసితిని ॥
హత్తి నాకుఁగలవు నీ వంతర్యామివనుచు ।
వుత్తమోపాయము లెల్ల నొల్లనైతిని ।
యిత్తల శ్రీవేంకటేశ యేలికవు నీవని ।
మత్తుండనై అన్య చింత మరచితిని ॥ 3౬

దేవగాంధారి

పల్లవి

శరణాగతే నే యెంచంగ నిత్యవైరిగాక ।
పరమ పురుష నీ పరికర మెల్లను ॥

(చరణము)

కర్మ చరణాంగాని కలుగవు నీవంటి ।
కర్మమేమి సేయఁగను కరిఁగాచితి ।
ధర్మతపమునఁగాని తగులవు నీవంటి ।
ధర్మమే మెరుంగనయ్య తగనహీ మూఢుండు ॥

వేదము చదివి నిన్ను వెతకిన నేమంటే ।
వేదమే మెరుంగు నీచవిధి గుహుండు ।
ఆది మతమునఁ గాని అటు నిన్నుంగానమంటే ।
యేదెస ఘంటకర్ణుం డేమతమువాఁడు ॥

వర్ణాశ్రమమునఁ గాని వడినిన్ను గనమంటే ।
వర్ణాశ్రమములేవి వాల్మీకికి ।
పూర్ణ శ్రీ వేంకట పురుషోత్తమ నిన్ను ।
వర్ణించి ఘనులైరి వరనారదాదులు ॥ 3౭

# అధ్యాత్మ సంకీర్తనలు

## గుజ్జరి.

**పల్లవి**

ఇదినీకునుపకారమింతగా నే జేసితి ।
కదిసి మేలెంచికావుమీ నన్నును ॥

**(చరణము)**

భూమి నేనొక్కసిచందంబుట్టగాగదా మీదయ ।
వేమారు నామీఁదఁ భారిపెలవెట్టెను ।
నేమపుఁబుణ్యుండనైతే నీదయకుఁబాత్రమేది ।
యేమిటికిరాక మూల నిట వృథావుండఁగా ॥

చిక్కి నేదోషాలుగనుఁజేయంగా నీనామము ।
రొక్కముగా నన్నుఁగాచిరూఢికెక్కెను ।
దిక్కులు మావంటివారి తెగునసేయకుండితే ।
యెక్కడనుండు నీనామమేమందుసకునచ్చు ॥

పుట్టుదరిద్రఘునాకు పెంచిసంపదలియ్యఁగా ।
యిట్టె నీలక్ష్మిపతిత్వమెన్నికకెక్కె ।
నెట్టన శ్రీవేంకటేశ నీదాసులకతననే ।
రట్టుకెక్కెపంతముమీరంగ రాజువైతివి ॥ ౩౮

## సౌరాష్ట్రం.

**పల్లవి**

యేలినవారికిఁబోదు యీడేరించండమసొమ్ము ।
కొలకాసుసేయకున్న ఘనముగాఁజేతురు ॥

**(చరణము)**

పసులేమెరంగగా పట్టి కట్టిమేపుమేపి ।
దెసలఁబనులుసేయ దిద్దుకొందురు ।
వసుధ నన్నటువంటి వానిఁదెచ్చిమీసేవకు ।
నెసంగమెదిపి కావు యేమినేనెరుంగ ॥

బిడ్డలేమియియ్యఁగాను ప్రేమముతోఁగన్నతల్లి ।
వెడ్డువెట్టిచన్నిచ్చి వెసంబెంచును ।
యెడ్డనైన నే నీకు యెందునుఁగొరగాకున్న ।
వొడ్డినజ్ఞానమొసంగి వ్గారడించికావవే ॥
బానిసలేదొడ్డుగాన పరులుదడవితేను ।
దానికై నహించుకొని తామునత్తురు ।
నేను నీదాసుండ నింతేనెమ్మది శ్రీవేంకటేశ ।
పూనుకొనివచ్చిన నన్నుపాముగావవే ॥ ౩౯

సాళంగనాట.

పల్లవి

మీరుచేసేపనులకు మేము గొనేపనులేమి ।
నేరుపు నీదై వికమే నేరుపుదుగాక ॥

(చరణము)

యెవ్వరు నీకుఁజెప్పంగా నిలన పాండవముంటె ।
అవ్వలంగాకుండుగాక అనియుంటివి ।
నెవ్వగ విభీషణుండు నిన్నేమి వేడుకొనఁగా ।
రవ్వగానట్టి లంకరాజ్యమొసగితివి ॥
రమ్మని యెవ్వరనఁగా రాముండవై విచ్చేసి ।
యిమ్ముల నహల్యశాపమిటుదీర్చితివి ।
దొమ్ములోనేమిచెప్పంగ దూరె విజయునికై ।
కమ్మర భీష్మునిపై జక్రమేలయెత్తితివి ॥
చెలంగి ధృవునికేలచెక్కుల నీశంఖమూది ।
పలునుతులు చేకొని పట్టమిచ్చితి ।
యెలమి శ్రీవేంకటేశయేమి నెరుంగము ।
యిల నిరుహేతుకముగా యెట్లయినంగావవే ॥ ౪౦

## అధ్యాత్మ సంకీర్తనలు

### దేసాళం.

**పల్లవి**

యిదిగో మాయజ్ఞానమెప్పుడూను సహజమే ।
కదిసి నీవెనన్ను గరుణించవయ్యా ॥

**(చరణము)**

తల్లి చంకనున్నబిడ్డ తమితో జన్నుదాగుతా ।
వొల్లండు తండ్రియెత్తుకొనబోతేను ।
మల్లడి నీమాయలో మరిగినజీవములు ।
మెల్లనె మీసేవఁజేసి మిమ్ముఁజేరఁజాలము ॥

రెక్కలమరుంగు పక్షి రెక్కలక్రిందనే కాని ।
యెక్కుడువద్దనే మెడయుంతెవున్నను ।
ప్రక్కనజన్మమెత్తిన ప్రపంచపుజీవులము ।
యెక్కుడైన వైకుంఠమిది గోరంజాలము ॥

నీరులోనుండేటికప్ప నీటిలోవుండుంగాని ।
వూరకె కరపుమీదనుండదెంతైనను ।
అరయ సంసారములో అజ్ఞానపుజీవులము ।
బోరన శ్రీవేంకటేశ బుద్ధిచెప్పికావవే ॥ ౪౧

### శంకరాభరణం.

**పల్లవి**

అందుకే వెరగయ్యీని ఆహా నాకు ।
విందుల నీచేతలివె విచారించవయ్యా ॥

**(చరణము)**

నిగమాంతవీధులెల్ల నీవు పసులగావంగా ।
వెగటుగ నాడెందు వెదకిరో ।
జగతి యోగీశ్వరులు సరి నీవు గొల్లెతల ।
తగిలినవేళ నెట్టు ధ్యానముచేసిరో ॥

పరమగురువులెల్ల పాలు నీవుదొంగిలగ ।
అరసి నీమహిమ లేమనిచెప్పిరో ।
సురులునీవు రేపల్లెజొచ్చి పారియాడఁగను ।
ఇరవై నీవెంటవెంట నెట్లదిరిగిరో ॥
కోరి మునులెల్ల నీవుగోపాలురతోనాడంగ ।
సారెఁబొగడి యేమని చదువుదురో ।
యీరీతి శ్రీవేంకటేశ యెదుటనీవుండఁగాను ।
నేరిచి నీదాసులెల్ల నిన్నెట్లమెచ్చిరో ॥ ౪౨

రామక్రియ.

పల్లవి

పురుషోత్తమ నీవె బుద్ధిచ్చికాచుటగాక ।
శిరసెత్తుకొని నవ్వసిగ్గుగాదానాకు ॥

(చరణము)

పొసగ పంచేంద్రియాలు పుట్టిన దేహమేమోచి ।
యెసంగ జితేంద్రియుఁడనెట్టయ్యే నేను ।
వసగాని కోరికలవలలోనఁ జిక్కుకొని ।
యిసుమంతలో ముక్తుండనెట్టయ్యేనేను ॥
తొల్లిటికర్మముచేత దొడ్డయైనపుట్టుపుట్టి ।
యెల్లవారిలో జ్ఞానినెట్టయ్యేనేను ।
మల్లడిసంసారము మరుగువాడనై యుండి ।
యిల్లదిగో విరక్తుండనెట్టయ్యేనేను ॥
పాపపుణ్యాపు లోకులపంక్తిలోననేవుండి ।
యేపున నీభక్తివాఁడనెట్టయ్యేనేను ।
రాపుల శ్రీవేంకటేశ రక్షించి కీర్తిఁబొందు ।
యీపాటివాఁడ ధీరుండనెట్టయ్యేనేను ॥ ౪౩

## అధ్యాత్మ సంకీర్తనలు

బౌళి.

పల్లవి

యెక్కడి మానుషజన్మంబెత్తిన ఫలమేమున్నది ॥
నిక్కము నిన్నేనమ్మితి నీచిత్తంబింకను ॥

(చరణము)

మరవను ఆహారంబును మరవను సంసారసుఖము ।
మరవను యింద్రియభోగము మాధవనీమాయ ।
మరచెద సుజ్ఞానంబును మరచెద తత్త్వరహస్యము ।
మరచెద గురువుదైవము మాధవనీమాయ ॥
విడువను పాపముపుణ్యము విడువను నా దుర్గుణములు ।
విడువను మిక్కిలియాసలు విష్ణుండ నీమాయ ।
విడిచెద షట్కర్మంబులు విడిచెద వైరాగ్యంబును ।
విడిచెద నాచారంబును విష్ణుండ నీమాయ ॥
తగిలెద బహులంపటముల తగిలెద బహుబంధముల ।
తగులను మోక్షపుమార్గము తలంపున యెంతైన ।
అగపడి శ్రీవేంకటేశ్వర అంతర్యామివై ।
నగినగి నీవేలితి నాకాయీమాయ ॥ ౨౨

బౌళి.

పల్లవి

కొత్తబంటు పాతబంటుకోరి నాఁడు నేఁడు నీకు ।
యిత్తలజీతముచేసి యేలుకోవె శ్రీహరి ॥

(చరణము)

యిరువదినలుగురికిటు నేగమికాండ ।
అరిదిదేహపుటూరి అమరగాడ ।
నరయక నరసేది నల్లతెల్లజల్లివాడ ।
యిరవై జీతముచేసి యేలుకోవే శ్రీహరి ॥

కామునిగరడిలోని కట్లాశిపామువాడ ।
తేమజూపులపగలు దివ్వెలవాడ ।
గోముననేకాంగి నాకుగురిలో నొరటువాడ ।
యీమేటినైన నన్నేలుకొనే శ్రీహరి ॥
యేడునేడులోకములతొక్కి దిగినట్టివాడ ।
మేడెపుసంసారమున మించినవాడ ।
వోడక వెదకితిని వొక్కండవే రాజవింక ।
యీడనే శ్రీవేంకటేశ యేలుకోవే శ్రీహరి ॥ ౪౨

ధన్యాసి.

పల్లవి

హరి నీదాస్యమునకు నదిలేమిసరిగాదు ।
అరయ శుకుండు నిన్నునంటి నీయంతాడాయను ॥

(చరణములు)

వగలందపముసేసి వసిష్ఠనయ్యేదనంటే ।
వొగి వసిష్ఠుండు మింటనొక్కచుక్క ।
మొగువ యజ్ఞాలుజేసి యింద్రుండనయ్యేదనంటె ।
దిగువనాయింద్రుండొక్క దిక్పాలుఁడే ॥
ఘనమైనయీవులిచ్చి కర్ణుండనయ్యేదనంటె ।
వొనరనాతండు భువినొక్కరాజె ।
అనువై ధానాలుచేసి అమరత్వముందెవంటె ।
కొననది మేరువుకొండమీఁదిబ్రదుకె ॥
అదిగాన యేయుపాయములు సేనొల్లక ।
కదిసి నీశరణనేగతిగంటిని ।
యెదుట శ్రీవేంకటేశ యిట్టినాదెనబాఁడి ।
సదయుండవై మమ్ముఁజక్కంగ నేలితివి ॥ ౪౩

## అధ్యాత్మ సంకీర్తనలు

### సాళంగనాట.

పల్లవి

శునకశుకరాదులు సుకమంది పొందినట్టు ।
ఘనముగానక మసి కస్తూరాయెనాకు ॥

(చరణము)

యేపున బ్రహ్మానందమెరంగనివాడంగనక ।
పాపపు హేయసుఖమె భ్రాంతి నాకును ।
చూపుల నైశ్చంతముచూడని వాఁడంగన ।
తీపులు ప్రపంచమందు స్థిరమాయెనాకు ॥

చాయల శ్రీహరిభక్తిచాలనివాఁడంగనక ।
తోయరాని కర్మములు దొడ్డాయెనాకు ।
నాయెంత నాజ్ఞానము నమ్మనివాఁడంగనక ।
మాయపుసంసారమే మనసాయెనాకు ॥

శ్రీవేంకటేశుధ్యానముఁ జేయనివాఁడంగనక ।
ఆవలంబరదేవత లరుదునాకు ।
ఈవల యితఁడే నన్ను యింతగా మన్నించె గన ।
పావనమై జన్మమిది పచ్చిదోచెనాకు ॥ ౮౭

### ధన్యాసి.

పల్లవి

పరమువేరొకచోట భ్రాంతియున్నదా ।
స్థిరమైనయీమాయ తెలియరుగాని ॥

(చరణము)

యెప్పుడు దేహాత్మ లెరవులుగాజూచు ।
యెప్పుడహంకార మిటుకుటూనును ।
అప్పుడు దైవము అఱచేతిలోనివాఁడు ।
కప్పినదిక్కులు గానరుగాని ॥

యెన్నఁడుసమబుద్ధి నిందరిఁదాఁజూచు ।
నెన్నఁడాసలమీఁద నిటురోసును ।
అన్నిఁబుణ్యములు అండనేసమకూడు ।
యిన్నిట నిది విచారించరుగాని ॥
యెవ్వోచోట హరిభక్తి యిరవుగా మతికబ్బు ।
యెవ్వోచోట సంశయ మిటుమాను ।
అవ్వోచోట శ్రీవేంకటాద్రీశు కృపయుండు ।
మచ్చికేనిదిగంటి మానరుగాని ॥ ౪౮

సాళంగనాట.

**పల్లవి**

జపియించరే సర్వజనులు యీనామము ।
తమరపము వోపుణ్యులకు రామనామము ॥

(చరణము)

శాంతికరము రామచంద్రనామము ।
భ్రాంతులణంచు రామభద్రనామము ।
వింతసుఖమిచ్చు రఘువీరనామము భూమి ।
వింతఁదీర్చునదిగో శ్రీరామనామము ॥
కలిదోషహరము రాఘవనామము సర్వ ।
ఫలదము సీతాపతినామము ।
కులకశోభనము కాకుత్థ్సనామము అవి ।
రళమైన దిదిగో రామనామము ॥
గుమితమైనది రఘుకులనామము ।
అతిసుముఖము దశరథసుతనామము ।
అమితమై శ్రీవేంకటాద్రి నాయకుఁడై ।
రమియించె యీతని రామనామము ॥ ౪౯

# అధ్యాత్మ సంకీర్తనలు

బౌళి

**పల్లవి**

దైవమా నన్నిందులో తగుమానిసింగాఁజేసి ।
యీవల రక్షించేమేలు యిదిచాలదా ॥

(చరణము)

అవ్వలఁదిరిపెముల్తై అంగలచే జీవులలో ।
యెవ్వరింబోలుదు నే నెంచిచూచితే
రవ్వగాఁగ్రిమికీటలై రమియించె జంతువులలో ।
యెవ్విధినేసరిగాక యెంతవాడనేను ॥
పాపముఁజేసి నరకబాధలంబడి వారిలో ।
యేపున నన్నుంజూచితే యే నేమిభ్రాంతి ।
పైపైన జ్ఞానపు పశుపక్షిమృగాలలో ।
తోపు నూకడేకాక దొరనానేను ॥
యేమిటివాఁడనై నిన్ను ఇంకానేఁగొసరుదు ।
పామరుని నన్నింత పాలించితి ।
యేమనికొనియాడుదు యే నిన్ను శ్రీవేంకటేశ ।
ఆమంచినీదాసులలో అర్హమానేను ॥ ౫౦

సాళంగనాట.

**పల్లవి**

యిదియే కామనిదానమిది యేమూలధనము ।
యిదియె నమ్మ్మటగాక యితరములేల ॥

(చరణము)

నమేభక్తఃప్రణస్యతియనుమాట ।
అమోఘమ్మై నీవానతియ్యఁగా ।
రమారమణుఁడరతి నీదాసులకెల్ల ।
సమోహినితరవిచారములేల ॥

నాఁడు మామేకం శరణం వ్రజ యనుమాట ।
పోఁడిమి దిక్కుల నీవెప్పుడుచాటఁగా ।
నేఁడు నీదాసులమై నెరవేరితిమిగాక ।
వెండివెండి కర్మపువిధులింక నేల ॥
అలయోగక్షేమం వహామ్యహమనుమాట ।
అలరుచు తుదిపదమైవుండగా ।
నెలవై శ్రీవేంకటేశ నిన్నుఁగొల్చినమాకుఁ ।
గలిగె నీకరుణయే కథలునేల ॥ ౪౧

బౌళి.

పల్లవి

పరమసుజ్ఞానులకు ప్రపన్నులకు ।
మరుగురు నీమీఁదట మనసుండవలదా ॥

(చరణము)

ఆకలిగొన్నవానికి నన్నముపై నుండినట్లు ।
వేంకటవుండవలదా యీశ్వరునిపై ।
కాకలవిటులచూపు కాంతలపై నుండినట్లు ।
తేకువనుండవలదా దేవునిమీఁదటను ॥
పసిబిడ్డలకు నాస పాలచంటిపై నున్నట్లు ।
కొసరి భక్తివలదా గోవిందునిపై ।
వెసఁ దెరువరి తమి విడి వలసినున్నట్లు ।
వసియించవలదా శ్రీవల్లభుమీఁదను ॥
నెప్పున ధనవంతుఁడు నిధిగాచియుండినట్లు ।
తప్పక శ్రీవేంకటేశుఁ దగులవద్దా ।
అప్పసమైన భ్రమ అలజాలాలకున్నట్లు ।
యిప్పుడేవుండవలదా యీతనిమీఁదను ॥ ౪౨

# అధ్యాత్మ సంకీర్తనలు

## సాళంగనాట.

**పల్లవి**

యెట్టుగడించె దైవము యిందరికినిసుఖము ।
పట్టినభ్రమవంటిది పంచేంద్రియసుఖము ॥

(చరణము)

పచ్చివలెనె తోఁచు పండ్లముక్కలువోవు ।
మచ్చికం గాంతలతోడి మదసుఖము ।
వచ్చినట్టనెవుండు వండవండనల్లాను ।
పచ్చి తా తొల్లి జేసినదానఫలసుఖము ॥
మోవనియట్లవుండుము లిగెపాటిభారము ।
భావించి యెత్తుకొన్న సంపదసుఖము ।
కైవశమైనట్లుండు కడదంకావళిసులే ।
తేవల ననుభవించే దేహభోగసుఖము ॥
మిక్కిలితీపై వుండు మీసాలమీఁదటితేనె ।
చక్కటినానాటి సంసారసుఖము ।
తక్కక శ్రీవేంకటేశు దాసులకు చిక్కివుండు ।
అక్కడ నిక్కడను బ్రంహ్మానందసుఖము ॥ ౨౩

## కొండమలహరి.

**పల్లవి**

యెన్నండుదేవునిం గనేమెన్నండు బుద్ధెరింగేము ।
తన్నుందానే హరి మమ్ము దయఁజూచెగాక ॥

(చరణము)

మాటాడుటొక్కటేకాని మాకునుఁబసులకు ।
చాటువఁ బంచేంద్రియాలు సర్వసమమే ।
గాటానఁజెరియుంచుటేకాని రాళ్లకునుమాకును ।
యీటులేని భవబంధాలిన్నియును సమమే ॥

దొడ్డదేహమింతేకాని దోమలకును మాకును ।
జడ్డులేని జీవాత్మ సర్వసమమే ।
ఒండినరుచులెఱుంగుటొక్క విశేషమేకాని ।
యెడ్డతనము మాకే లేని జంతుసమమే ॥
చేరిచదువులేకాని చిలుకలకు మాకును ।
సారెకు నక్షరములు సర్వసమమే ।
యీరీతి శ్రీవేంకటేశుండిటు నన్నుగాచెంగాక ।
నేరమి యిన్నాళ్ళు నాదే నేనిందరిసమమే ॥ ౫౪

గుండక్రియ.

పల్లవి

వివరించిచూడఁబోతె వెరగయ్యేనాకునేడు ।
తవిలిపుట్టిననాడు తనువులెందుండెనో ॥

(చరణము)

జనని గర్భములోన సరినేనుండేనాఁడు ।
యెనసియేడనుండెనో యీయాస ।
మునుపనంతకు తొల్లి మునింగి పరలోకము ।
కొనలనుండెడినాడు కోపములెందుండెనో ॥
పొత్తుల లోపల నేను పొడలువెట్టేనాడు ।
యిత్తల జవ్వనమద మెందుండెనో ।
నిత్యము నిదురలోననే గలలాగనై నాడు ।
యెత్తి యీకాపురము లివి యెందునుండెనో ॥
మానక పంచేంద్రియమత్తుండనై వున్ననాడు ।
యీ నేటి బ్రహ్మానంద మెందుండెనో ।
తానే శ్రీవేంకటేశుండు దయఁజూచెగాకనన్ను ।
ఆనుకొన్న కర్మము యేమిటతానుండెనో ॥ ౫౫

## అధ్యాత్మ సంకీర్తనలు

### గుజ్జరి.

పల్లవి

పాపముచేరువ ప్రాణునికి ।
యేపునపుణ్యంబెదోకాని ॥

(చరణము)

ముక్కననున్నది ముంగోపంబిది
యెక్కువశాంతంబెందున్నదో ।
చిక్కనియాసలు చేతిలోనున్నది ।
గక్కనవిరతేకానముగాని ॥
కన్నులనున్నది కామాంధకారము ।
యెన్నిక విజ్ఞానమెందున్నదో ।
వున్నదినాలుకి నూరకదైన్యము ।
యిన్నిట ధైర్యంబెఱుగముగాని ॥
అవిగో తనువున ననాచారములు ।
యీవల సద్ధర్మంబెందున్నదో ।
వివరమొసంగి శ్రీవేంకటేశనా ।
భవమీడేచంగ బ్రదికితింగాని ॥ ౫౨

### శుద్ధవసంతం.

పల్లవి

కలకాలమెవ్వరికిగా బాటువడదేహి ।
వలలంబడి తుదనొకరివాడుంగాడాయె ॥

(చరణము)

పాపకర్మపుమనసు పంచేంద్రియములకే ।
చూపించెగాని దయంజూడడాయె ।
దీపనపుటన్యాయదేహంబు రుచులకే ।
వాపించె నను మొకము వడిందనుపదాయె ॥

సిగ్గుమాలినవయసు చెలుల యెంగిలిమోవి ।
కొగ్గించి దొరతనంబాసగదాయె ।
నుగ్గయినయీయాస నూరుగురిఁగొలిపించి ।
తగ్గించిగర్వంబు దరిచేర్పదాయె ॥
మాలుగలసినబ్రదుకు మాయలోనేకలిపి ।
యేలకో ఘనసుఖంబియ్యదాయె ।
యీలోన శ్రీవేంకటేశ్వరుండు ననుఁగాచె ।
నాలోనిపొందికలు నాకునరుచాయె ॥ ౫౭

గుజ్జరి.

పల్లవి

తెలిసిబ్రదుకరో దేహులాల ।
వలెననితలంచిన వారివాఁడేదేవుండు ॥

(చరణము)

తనుఁగొలువకుండితే తారముపెట్టఁడేలిక ।
పెనంగి కొలువకున్నఁబెట్టుదేవుండు ।
జననీజనకుడు విడుతురు చుట్టాలు దరిద్రులైతే ।
వెనువెంటనెంతయిన విడువఁడుదేవుండు ॥

అంతట ముదిసితేను అంగలు రోతురు ।
అంతరాత్మ యెన్నండు రోయఁడుదేవుండు ।
వింతగా నన్నదమ్ములు విసానకలుగుదురు ।
బాఁతనే తానలుగఁడు పుట్టించినదేవుండు ॥

వొదిగిమూలనుండితే వ్రారివారుమరతురు ।
వదలకెందున్నా మరువఁడుదేవుండు ।
తుదిముట్ట రక్షించు దుఃఖములెల్లనణంచు ।
యెదుట శ్రీవేంకటేశుఁ డితండెపో దేవుండు ॥ ౫౮

గుజ్జరి.

పల్లవి

సిగ్గుమాలినజీవుండు దా ।
మొగ్గినచోటనే మొలుగుగాక ॥

(చరణము)

ఆలుబిడ్డలకునై యెల్లకాలము ।
పాలుమాలక పాటువడి ।
తీలుగావచ్చితే దేవునిదూరును ।
వేలనాడే యిదియెఱుంగఁడా ॥

కిమ్ముల విషయకింకరుండై తా ।
నమ్ముడువోయె నందులకే ।
కమ్మకోవచ్చిన కర్మముదూరును ।
యిమ్ములనాడిదియెరుంగఁడా ॥

బ్రతికెనన్నాళ్లు భ్రమసి దేహమే ।
మితిలేక వొమిమీఁదట ।
గతియని శ్రీవేంకటపతిఁ జేరు ।
హితవసి నాఁడెయెరుంగఁడా ॥ ౫౯

గౌళ.

పల్లవి

అప్పుడే కృతార్థుఁడు అప్పుడేలోకపూజ్యుండు ।
తప్పులేదు ముప్పులేదు దైవమేగురుతు ॥

(చరణము)

యెవ్వఁడు పుణ్యుండుగాఁడు యెవ్వఁడు పాతకిగాఁడు ।
యివ్వలఁ దొంటిజన్మము లెంచిచూచితే ।
నెవ్వగని జీవునికి నేరుపేది నేరమేది ।
అవ్వల శ్రీహరిశరణన్నదే గురుతు ॥

పుట్టని కులములే విభజించని వస్తువేది ।
యిట్టియీజీవుల నెల్ల యెంచిచూచితే ।
గుట్టు తెలిసితిమిందు కొంచెమేది దొడ్డయేది ।
అట్టునిట్టు హరిదాసుడైనదే గురుతు ॥
యెఱింగి జేయులేది యెఱుంగక మానులేది ।
తఱి బ్రపంచమునందు దలపోసితే ।
మెఱయ పరుసమంటే మఱిపైండేమినుమేమి ।
గుఱిగా శ్రీవేంకటేశు గొలుచుటే గురుతు ॥ ౭౦

శుద్ధవసంతం.

పల్లవి

యేది యిందులో సుఖ మెవ్వరుమంచివారలు ।
పాదు దెలియని ప్రాణి భ్రమయింతేగాక ॥

(చరణము)

భోగింపుచు పిండిపిండిపూచి రక్తమాంసము ।
లాగతిం బుత్రదారాదులలయింతురు ।
చేగదేరవెట్టిగొనేచేతుల యిడుమలెల్ల ।
సాగిన సభలలోన సంసారము ॥
పులక మేనిలోజొచ్చి వొగి నింద్రియాలకిచి ।
అలమలపించజొచ్చె నన్న పానములు ।
యెఱింగెఱింగియుండగా నేలినవానికమ్మించె ।
తఱిం దన జన్మమెల్ల ధనధాన్యములు ॥
వొప్పి గురిగాక పూరకున్న నతిథుల ।
కప్పన మప్పించెను గృహారామములు ।
యిప్పుడే శ్రీవేంకటేశుండేలి మమ్ముంగాచెగాక ।
పుప్పిగాదినే నిన్నాళ్లు పుణ్యపాపములు ॥ ౭౧

## శుద్ధవసంతం.

పల్లవి

హరిభక్తిగలిగితే అన్నియు ముఖ్యముగాక ।
విరహాచారములెల్ల వృథావృథా ॥

(చరణము)

మిక్కిలి సీటమునింగేమీనుకదిస్నానమా ।
కొక్కెరధ్యానముచేసుకొరె ఆదియోగమా ।
నిక్కి మేకఆకు మేయు నిండనదితపమా ।
చింతలకిందువేలే జిబ్బటము సిద్ధుండా ॥

పులులు గుహలనుంటే పొల్లింపఋషులా ।
యెలుగు గడ్డమువంచు నింతలోనేయోగ్యుండా ।
యిలం బక్షులాకాశాన కేగితే దేవతలా ।
వాలసి కోతి యడవినుంటే వనవాసమా ॥

మూకలు మాటలాడవు మౌనవ్రతములా ।
కోకగట్టరు బాలులు కోరెదిగంబరులా ।
కైకొని శ్రీవేంకటేశు భక్తుండేమిచేసినను ।
చేకొని లోకములోన చెల్లుబడులే ॥ ౬౧

## గుజ్జరి.

పల్లవి

చెప్పంబోతే బసలేదు శ్రీపతిదాసులునన్ను ।
తప్పకచేపట్టితేనే ధన్యుండనైతిసి ॥

(చరణము)

భ్రమసి పారల తోలు పై వేసుకొన్నవాడ ।
యెముకలఇంటిలో ఇరవైనాడ ।
తమ్మితోడమల మూత్రతతులం బాయనివాడ ।
అమర మా కులగోత్రమడుగనేమిటికి ॥

పుట్టినచోటడిగితే పూచిచెప్పరానివాడ ।
ముట్టరాని చోటనే మునింగేవాడ ।
చుట్టుకొన్న వెంట్రుకల జూబులకొప్పువాడ ।
వెట్టిమాయిల్లువరుస వెదకనేమిటికి ॥
నానుచున్న నోరులోని నరాలనాలికవాడ ।
యేనిజమునెరంగ యెడ్డెవాడను ।
లోనుండి శ్రీవేంకటాద్రి లోకేశుండునన్ను నేలె ।
తానకపుమాగుట్టు తలంచనేమిటికి ॥ ఇ.౩

### బౌళి

**పల్లవి**

యెవ్వరునన్నుద్ధరించేరింతట వెఱవకుమని ।
అవ్వలనివ్వల శ్రీహరియేకాకి ।

**(చరణము)**

రాపులం బంచేంద్రియపు రాచపై రుమేయగాను ।
పాపపుణ్యమనేటి బందెంజిక్కితి ।
వోట్టిసంసారమునే వొందముపై నడవగాను ।
కూపపుజన్మముపాలై కూయుచునున్నాడను ॥
ఆసలనేటి పెద్ద అంగిటగాలాలుమింగి ।
కోపేటిమాయ వంటింటి కుందేలినైతి ।
బాసదప్పి చిత్తమనేబండారము గొల్లలాడి ।
లాసికామాదులనే తలారులచేబడితి ॥
కాంతలమోహమనేటి కారడవిలోంజిక్కి ।
అంతట విజ్ఞానమార్గమటుదప్పితి ।
యింతలో శ్రీవేంకటేశునెరింగించే మాగురుండు ।
మతికెక్కించంగ నేను మంచి మేలుగంటి ॥ ఇ.౪

# అధ్యాత్మ సంకీర్తనలు

సాళంగనాట.

పల్లవి

నేడే హరిసేవలయితే నిత్యభోగములు ।
పోడిమి దెలుసుకోవే బుద్ధెరింగి జీవుడా ॥

(చరణము)

ప్రక్కనమనసులోన పాలుద్రాగినట్లనే ।
చక్కని మాయలలో సంసారభోగములు ।
నిక్కినిక్కి నీళ్లలో నీడచూచినట్లనే ।
దిక్కుల కర్మఫలము దివ్యభోగములు ।

కన్నులుమూసి మదిలో గలలుగనినట్లనే ।
పన్ని లోకముల ప్రపంచభోగములు ।
అన్నిట తెరలో బొమ్మలాటలాడినట్లనే ।
సన్నలంబుట్టి పెరిగే జన్మభోగములు ॥

కడుంజందమామగుట కలుమ్రింగినట్లనే ।
తడవి మోహించు చిత్తజభోగములు ।
యెడయక శ్రీవేంకటేశుండు గరుణించితే ।
అడియాలపు టీవులు ఆత్మభోగములు ॥ ౬౫

బౌళి.

పల్లవి

తెలిసినవారికి తెరువిదే మరిలేదు ।
నళినాక్షుంబొగడెడి నామములోనున్నది ॥

(చరణము)

ఆకాసానలేదు మోక్షమటుపాతాళమున లే ।
దికడ భూలోకమందు యెందులేదు ।
పైకొని ఆసలెల్ల పారఁదోలి వెదకితే ।
శ్రీకాంతుఁబొగడేటి చిత్తములోనున్నది ॥

సురులవద్దలేదు సాధించనమృతము ।
సరిదిక్కులందు లేదు జలధిలో లేదు ।
శరణాగతుల పాదజలములుచేర్చికొనే ।
హరిదాసులంబూజించే అరచేతనున్నది ॥

రాజసాన సుఖమేది రాసికర్మమందునేది ।
వజతోడనియుతుండై వుండినానేది ।
సాజాన శ్రీవేంకటేశు సరెముద్రలుధరించే ।
తేజముతో విజ్ఞానదేహములో వున్నది ॥ ౭౭

## భైరవి.

**పల్లవి**

హరిశరణాగతి యందుల కౌషధ ।
మిరవుగ నెఱింగిన నెక్కుడువిషము ।

(చరణము)

చంచున నొడిసేటి సర్పమువంటిది ।
కంచములో తనకర్మము ।
అంచేజననమరణాదులే కోరలు ।
పంచలనాడును పట్టంగరాదు ।

బలుసంసారము పడిగదినిళిని ।
పొలసిదేహమను పుట్టంబడే ।
నలి నహోరాత్రపు నాలికలు గొడయు ।
బలిమినూక పట్టంగరాదు ।

మహాసుఖదుఃఖములు మలకలుమూలకలు ।
సహజపుంబొరలే సంపదలు ।
యిహమున శ్రీవేంకటేశుండాడించి ।
బహుగతిసేమిటుం బట్టంగరాదు ॥ ౭౮

* ఆహిరి.

పల్లవి

అలరఁ జంచలమైన ఆత్మలందుండని యలవాటు సేసె నీ వుయ్యాలా ।
పలుమారు నుచ్ఛ్వాసపవనమందుండని భావంబు దెలిపె నీ వుయ్యాలా ॥

(చరణము)

ఉదయాస్తశైలంబు లొనరఁ గంభములైన వుడుమండలము మోఁచె నుయ్యాలా ।
అదన నాకాశపద మడ్డదూలంబైన అఖిలంబు నిండె నీ వుయ్యాలా ।
పదిలముగ వేదములు బంగారు చేరులై పట్టవెరపై తోఁచె నుయ్యాలా ।
వదలకిటు ధర్మదేవతపీఠమై మిగుల వర్ణింప నరుదాయె నుయ్యాలా ॥

మేలుకట్లయి మీకు మేఘమండలమెల్ల మెఱుఁగునకు మెఱుఁగాయె నుయ్యాలా ।
నీలశైలమువంటి నీమేనికాంతికిని నిజమైన తొడవాయె నుయ్యాలా ।
పాలిండ్లు గదలంగఁ బయ్యెదలు గాపాడ భామినులు వడినూఁచ నుయ్యాలా ।
వొలి బ్రహ్మాండములు వొరగునోయని బతినొయ్యనొయ్యన వూఁచిరుయ్యాలా ॥

కమలకును భూసతికి కదలు కదలుకు మిమ్ము గౌగిలింపఁగఁ జేసె నుయ్యాలా ।
అమరాంగనలకు నీ హావభావవిలాస మందంద చూపె నీ వుయ్యాలా ।
కమలాసనాదులకు కన్నులపండుగై గణుతింప నరుదాయె నుయ్యాలా ।
కమనీయమూర్తి వేంకటశైలపతి నీకు కడువేడ్కయై వుండె నుయ్యాలా ॥ ౭౮

నాట.

పల్లవి

ఘోరవిదారణ నారసింహాని ।
విరూపముతో నెట్లుండితివో ॥

(చరణము)

ఉడికెడి కోపపుటూర్పులఁ గొండలు ।
పొడిపొడియై నేలఁ బడగ ।
బెడిదపురవమున పిడుగులు వొరుగంగ ।
యెడనెడ నీ వపుడెట్లుండితివో ॥

గుటగుటరవములు కుత్తికంగొలుకుచు ।
గిటగిటం బండ్లు గింటుచును ।
తటతటం బెదవులు దవడలువణంకగ ।
ఇటువలె నీ వపుడెట్లుండితివో ॥

కాలానలములుగ్రక్కుచు నయన ।
జ్వాలల నిప్పులుచల్లుచును ।
బాలాక్షముతో బ్రహ్మాండకోట్ల ।
కేలికవై నీ వెట్లుండితివో ॥

గోళ్ళమొలుంగుల పెద్దపెద్ద ।
వేళ్ళదిక్కులు వెదకుచును ।
నీళ్ళతీగెలు నిగుడంగ నోరను ।
చిళ్ళుగమ్మంగ నెట్లుండితివో ॥

హిరణ్యకశిపు నేపడంచి భయం ।
కరరూపముతోఁ గడు మెరసి ।
తిరువేంకటగిరిదేవుండ నీ వింక ।
యిరవుకొన్న నాడెట్లుండితివో ॥ ౬౯

గౌళ.

పల్లవి

నేలమిన్నునొక్కటైన నీబంటువొక్క ।
వేలనే యక్షునిం దెగవేసెఁగా నీబంటు ॥

(చరణము)

ఉంగరమొగరవేశియు దధిలోబడకుండ ।
నింగికిం జేయిచాచె నీ బంటు ।
చంగన జలధిదాటి జంబుమాలి నిలమీఁద ।
క్రుంగదొక్కి పదములంగుమ్మెగా నీ బంటు ॥

వెట్టగా రావణు రొమ్మువిరుగంజేతనే గ్రుద్దె ।
నిట్టతాడువంటివాడు నీ బంటు ।
దిట్టయై మందులకొండ తేజమున నడురేయి।
పట్టపగలుగ దెచ్చె బాపురేనీబంటు ॥
అలరసన్నియుంజేసి అజునిపట్టానకు।
నిలుచున్నాఁ డదిగోని బంటు ।
బలువేంకటేశ ఈపవననందనుడు।
కలిగిలోకము వెల్లగాచెఁగానీబంటు ॥ ౭౧

దేవగాంధారి.

పల్లవి

తలంచినవన్నియుం దనకొరకే వెలిం ।
తెలియుట దనలోఁ దెలియుటకొరకే ॥

(చరణము)

ఉదయమందుట భవముడుగుటకొరకే ।
చదువుట మేలువిచారించుటకొరకే ।
బ్రదుకుట పురుషార్థపరుండౌటకొరకే ।
మొదిరింగనుట తన్నెరుంగుటకొరకే ॥
తగులుట విడివడఁదలంచుటకొరకే ।
నొగులుట కర్మమనుభవించుటకొరకే ।
చిగురౌట కొమ్మయిచెలంగుటకొరకే ।
వెగడుట దురితంబెడబాయుటకొరకే ॥
యీవలంజేయుట ఆవలికొరకే।
ఆవలినుండుట యీవలికొరకే ।
యీవలనావల నెనయందిరుగుటెల్ల ।
శ్రీవేంకటేశ్వరుం జేరుటకొరకే ॥ ౭౨

### కన్నడగౌళ.

పల్లవి

ఎంతచేసినా నెడయకపోయె ।
ముంతలోని నీటముణింగిలేచుట ॥

(చరణము)

ఉట్టిపై చెరలాట మూరంబోత్తులకూడు ।
పట్టుచాలనికొమ్ము బహునాయకము ।
నెట్టిమోపరిలాగు వెట్టివోయినపోక ।
నట్టింటవైరంబు నగుబాటుబ్రదుకు ॥
రాకపోకలచేత రాజల్లు పెనుబుద్ధి ।
వాకులేనివరము వలవనివలపు ।
యేకాలము వేంకటేశుని కృపలేక ।
ఆకడీకడ నడయాడెడి నడపు ॥ ౭౨

### బౌళి.

పల్లవి

పరదేశిపట్టణమున పదుగురు నేగురుగూడక ।
పరగంగ వరివేడనూదర బలిసినట్లాయె ॥

(చరణము)

ఊరేలెడియతం డలసతనూరకయుండంగ నడుముల ।
వారలు నిక్కపుంగతకాలవలె నుండినగతిని ।
ధీరతచెడి తన జీవుండు తెలియంగనేరకయుండిన ।
ధారుణిలోపల దొంగలధర్మాసనమాయె ॥
వాడలంతంతకుంజిక్కంగ నుబ్బినరోగము సుఖమున ।
కెడమియ్యక నానాటికి నేచినచందమున ।
తడంబడు విజ్ఞానము గతిదప్పంగ బలుపగుపట్టుచు ।
కడుంజెడంగా మాలవాడ ఘనమైనట్లాయె ॥
పాసగంగ నిదిగని యధికుండు పుక్కటకాండ్లనందరిం ।
బరిమార్చి మొదలికతంబాలించినగతి నీ ।
పసగలతిరువేంకటగిరిపతి నాదేహపుంబురి ని ।
వసమై వెన్నకుంబంట్లువచ్చినయట్లాయె ॥ ౭౩

బౌళి.

**పల్లవి**

పోనీపోనీయమ్మలార బొమ్మలాటవారము ।
యీరసాన మమ్మునిట్టె యేమిచేసేరు ॥

**(చరణము)**

ఊరులేనిపొలమేర వొడలుమోచుకొనేము ।
తీరని దేహమెక్కుకొని తిరిగేము ।
వారువీరనుచు నట్టివావులుచేసుకొని లేని ।
పేరువెట్టుకొని కోకోంబిరుదుప్రకలగ్యాము ॥
బుద్ధిలేనిబుద్ధితోడ పొందుచేసుకొని వట్టి ।
యెద్దుబండికంటిసందినీగేము ।
నిద్దురతో నెలవంట నీడలోనియుండంట ।
వృద్ధువృద్ధులై లేని పొద్దికనున్నారము ॥
మాటలేనిమాటదెచ్చి మరంగువెట్టుక నట్టి ।
నేటానమేట్లవలె మెరసేము ।
గాటమైన తిరువేంకటగిరినిలయుని ।
నాటకమే నిజమని నమ్మికనున్నారము ॥ ౨౮

రామక్రియ.

**పల్లవి**

యెవ్వడోకాని యెఱుంగరాదు కడు ।
దవ్వులనేవుండు తలంపులోనుండు ॥

**(చరణము)**

ఎడయవు తనరెక్క లెగరెపోలేదు ।
కడుదాగుంగాని దొంగయుంగాదు ।
వెడగుగోళ్లుపెంచు విటుండానుంగాదు ॥

మిగుల బొట్టివాడు మింటికినింబోడవు ।
జగడాలు తపసివేషములును ।
మగువకై పోరాడు మరి విరక్తుండును ।
తగుంగాపురంబనులు నెంతయుఁ దెల్లందనము ॥

తరుణులవలపించు తగిలిపై కొనడు ।
తురగముందోలు రౌతునుంగాడు ।
తిరువేంకటాద్రిపై దిరుగునెప్పుడును ।
పరమమూర్తియై పరగు నీ ఘనుండు ॥ 2x

శ్రీరాగం.

పల్లవి

నిత్యాత్ముండై యుండి నిత్యుండై వెలుగొందు ।
సత్యాత్ముండై యుండి సత్యమై తానుండు ।
ప్రత్యక్షమైయుండి బ్రహ్మమైయుండు సం ।
స్తుత్యుండీ తిరువేంకటాద్రివిభుండు ॥

(చరణము)

ఏమూర్తిలోకంబులెల్ల నేలెడు నాతండే మూర్తి బ్రహ్మాదులెల్ల వెదకెడు నాతం ।
డే మూర్తి నిజమోక్షమియ్యంజాలెడు నాతండేమూర్తి లోకైకహితుండు ।
యేమూర్తి నిజమూర్తి యేమూర్తియునుంగాడు యేమూర్తి త్రిమూర్తు
లేకమైన యాతం ।
డేమూర్తి సర్వాత్ముండేమూర్తి పరమాత్ముండామూర్తి తిరువేంకటాద్రి
విభుండు ॥

యేదేవుదేహమున నిన్నియునుజన్మించె నేదేవుదేహమున నిన్నియును నణంగె మరి ।
యేదేవువిగ్రహం బీసకలమింతయును యేదేవునేత్రంబులినచంద్రులు ।
యేదేవుండీజీవులిన్నింటిలోనుండు నేదేవుచై తన్యమిన్నిటికి నాధార ।
మే దేవుండవ్యక్తుండే దేవుండద్వంద్వుండా దేవుండీ వేంకటాద్రివిభుండు ॥

యేవేల్పుపాదయుగ మిలయు నాకాశంబు యేవేల్పుపాదకేశాంతంబనంతంబు ।
యేవేల్పు నిశ్వాసమీ మహామారుతము యేవేల్పునిజదాసులీపుణ్యులు ।
యేవేల్పుసర్వేశుం డేవేల్పుపరమేశుం డేవేల్పుభువనైకహిత మనోభావకుండు ।
యేవేల్పుకడుసూక్ష్మ మేవేల్పుకడుఘనము ఆవేల్పుతిరువేంకటాద్రివిభుండు ॥ ౭౬

## దేసాక్షి.

**పల్లవి**

యెంతైనందొలంగనై తేదైననామతికి ।
వింతచవిసేతుగా విషయబుద్ధి ॥

**(చరణము)**

ఎనసిజన్మముల నేనెట్లనుండినంబోక ।
వెనుకందిరుగుదువుగా విషయబుద్ధి ।
అనువైన యనుభవము లనుభవించగజేసి ।
వెనుకమఱపింతుగా విషయబుద్ధి ॥

కెఱలికాంతలునేను గినిసి సనుంబొలయలుక ।
విఱిచి కలుపుదువుగా విషయబుద్ధి ।
తఱితోడ వావివర్తనదలంచిన నన్ను ।
వెఱపుదెలుపుదువుగా విషయబుద్ధి ॥

మొడలేని యాపదలనెట్లు వొరలినన్ను ।
విడిచిపోవైతిగా విషయబుద్ధి ।
సడిఁబెట్టివేంకటస్వామి కృపచేనిన్ను ।
విడిపించవలసెగా విషయబుద్ధి ॥ ౭౭

## గుండక్రియ.

**పల్లవి**

యేటివిజ్ఞాన మేటిచదువు ।
గుంటబడి వెడలుగతి గురుతుగనలేదు

(చరణము)

ఏడుమడుగులచర్మ మింతయునుండుట యీ ।
గాదంబెట్టుచుం జీముగారంగాను ।
పాడై నయిందులో బ్రదుకంగోరి ప్రాణి ।
విడదన్నుక చనడి వెరవుగనలేదు ॥

కడుపునిండిన మహాకష్టంబు నలుగడల ।
వెడలుచును బెనుముదికివేయగాను ।
యిడుమం బొందుచు సుఖము యిందు కేవెదకనీ ।
వాడలువోవంగ జీవుండోపనలేదు ॥

పుదకమయుమగు కన్నులురికి యేమైనంగని ।
మదవికారము మతికి మరుపంగాను ।
యిదియెరింగి తిరువేంకటేశుంగని జీవుండా ।
సదమలానందంబు చవిగానలేదు ॥ ౭౮

ఆహిరి.

పల్లవి

అటిదుష్టుండనలసుండను ।
యితరవివేకంబింకనేది ॥

(చరణము)

ఎక్కడనిన్నిట యేమిసేసితినో ।
నిక్కపుందప్పులు నేరములు ।
గ్రక్కున నిన్నిటకలిగిన నీవే ।
దిక్కుగాక మరి దిక్కేది ॥

ఘోరపుంబాపముకోట్లసంఖ్యలు ।
చేరువ నీవేనా సేసినవి ।
నిరసునకు నీటు నీకృపనాకింక ।
కూరిమి నాతోడ గుణమేది ॥

మెఱింగిసేసినది మెఱుంగకసేసిన ।
కొఱతలునాయెడంగొట్టులివే ।
వెఱపుదీర్చిన శ్రీవేంకటేశకాపు ।
మఱపక నాగతిమఱియేది ॥ ౭౯

కన్నడగౌళ.

**పల్లవి**

దైవకృతంబటుచేత తనకర్మాధీనంబటు ।
కావలసిన సౌఖ్యంబులు గలుగక మానీనా ।

**(చరణము)**

ఎక్కడిదుఃఖపరంపర లెక్కడిసంసారంబులు ।
యెక్కడిజన్మము ప్రాణులకేలకలిగినది ।
యెక్కడిమోహవిడంబన మెక్కడియాశాబద్ధము ।
యెక్కడికెక్కడనిజమై యీవిధానుండీనా ॥
యీకాంతలు స్త్రీద్రవ్యము లీకన్నుల వెడయాసలు ।
యీకోరికేలితలంపులు యిట్టివుండీనా ।
యీకాయంబస్థిర మనకేదుర్దశకులోనై ।
యీకల్మషములంబొరలంగ నివి గడతేరీనా ॥
దైవశిఖామణి తిరుమలదేవుని కృపగలచిత్తము ।
పావనమైదురితంబులం బాయకమానీన ।
ఆవిభు కరుణారసమున నతండేతనుమన్నించిన ।
ఆవేడుక లీవేడుకలాసలుచేసీనా ॥ ౮౦

శంకరాభరణం.

**పల్లవి**

ఆదిపురుషుండు అచ్యుతుండచలుండనంతుడమలుండు ।
ఆదేవుండితండేపో హరివేంకటవిభుండు ॥

**(చరణము)**

ఏకార్ణవమై ఉదకములేచిన బ్రహ్మాండములోఁ ।
పైకొనియుండంగ నొకవటపత్రములోపలను ।
చేకొనిపవళింపుచు నొకశిశువై వడిందేలాడిన ।
శ్రీకాంతుండితండేపో శ్రీవేంకటవిభుండు ॥

అరుదుగ బలి మదమడపంగ నాకశమంటినరూపము ।
సరగునభూమంతయు నొకచరణంబునంగొలచి ।
పరగినపాదాంగుటమున బ్రంహాండమువగిలించిన ।
పరమాత్ముండితండెపో పతివేంకటవిభుండు ॥
క్షీరపయోనిధిలోపల శేషుండు పర్యంకముగా ।
ధారుణియును శిరియునుంబాదములొత్తంగను ।
చేరువండను బ్రంహాదులు సేవింపంగఁ జెలువొందెడి ।
నారాయణుండితండే వున్నతవేంకటవిభుండు ॥ ౮౧

దేసాళం.

పల్లవి

అప్పులవారే అందరును ।
కప్పంగందిప్పంగంగర్తలువరి ॥

(చరణము)

ఎక్కడచూచిన నీప్రపంచమునఁ ।
చిక్కులు శిలుగులు చింతలునే ।
దిక్కెవ్వరియాత్రిదిపులలోఁ ।
దిక్కుముక్కు లక్ష్మిదేవుండేకాక ॥

యేదివలంచిన నేకాలంబును ।
సూదులమూటల సుఖములివి ।
కాదననోపనంగడగనిపించంగ ।
పోదికాఁడుతలంపునంగలండొకండే ॥

యెన్నండువిడి నెప్పుడువాశిం ।
బన్నిన తమతమబంధములు ।
వున్నతిసేయంగ వొప్పులునేరుపంగ ।
వెన్నుండువేంకటవిభుండేకలండు ॥ ౮౨

## అధ్యాత్మ సంకీర్తనలు

### శంకరాభరణం.

**పల్లవి**

పాపములే సంబళమెప్పుడు యీ ।
యాపదంబడి నే నలసేనా ॥

**(చరణము)**

ఎన్ని పురాణము లెటువలెవిన్నా ।
మన్న మనువుదిమ్మరితనమే ।
నన్ను నేనేకానంగలేనటనా ।
విన్న వీనుసులకు వెలిచేనా ।
యెందరు పెద్దలనెట్లంగొలిచినా ।
నిందలు నామతినిలిచినా ।
కందువెత్తెంగి చీకటికిందోలంగపట ।
అద్దపుటంబరమింకనదేనా ॥
తిరువేంకటగిరి దేవుండే పరమని ।
వరిగని తేలి యింకదాగినా ।
తిరముగనిను జింతించినచింతే ।
నిరతము ముక్తికినిదిగాదా ॥ ౮3

### ముఖారి.

**పల్లవి**

యెందుంబుడితిమో యెఱుంగము మా ।
కందువ శ్రీహరికరుణేకాక ॥

**(చరణము)**

ఏటిజన్మమో యెఱుంగము పర ।
మేటిదో మే మెఱుంగము ।
గాంటపుకమలజుఁగాచినయీ ।
నాటకుండే మా నమ్మినవిభుండు ॥

యెవ్వారువేల్పులో యెఱుంగము సుర ।
లెవ్వారో మేమెఱుంగము ।
గవ్వగు శ్రీసతిరమణుండు మా ।
కవ్వనజోదరుఁడంతర్యామి ॥
యింకానేటిదో యెఱుంగము యీ ।
యంకెల భావములనలయము ।
జంకెలదనుజాలం జిదిపిన తిరు ।
వేంకటేశుండు మా విభుండు ॥ ౮౩

రామక్రియ.

**పల్లవి**

నేలయునిన్నియును వృథా వృథా ।
తెలంపున శ్రీహరిందలసినను ॥

**(చరణము)**

ఎడయనిపుణ్యము లెన్నియైనా ।
విడువక సేయుట వృథా వృథా ।
బడిబడి నే శ్రీపతినాత్మలో ।
దడవక యితరముదడవినను ॥
యెరవులతపముల నెంతైనా ।
విరవిర వీగుట వృథా వృథా ।
హరి నచ్యుతుం బరమాత్ముని ।
మరిగితలంచక మఱచినను ॥
దైవమునెఱుంగక తమకమునా ।
నేనేటైన వృథా వృథా ।
శ్రీవేంకటగిరి చెలువుని ।
సేవించక మతిఁ జెదరినను ॥ ౮౪

## అధ్యాత్మ సంకీర్తనలు

### నాట.

పల్లవి

ఇలయును నభమును నేకరూపమై ।
జలజలగోళ్లు జళిపించితివి ॥

(చరణము)

ఎడసినలుపక హిరణ్యాకశిపునిం ।
దొడికిపట్టి చేతులఁబిగిసి ।
కెడపితొడలపై గిరిగొన నదుముక ।
కడుపుచించి కహకహ నవ్వితివి ॥

రొప్పులనూర్పుల రొచ్చులకసరులు ।
గుప్పుచులాలలుగురియును ।
కప్పినబెబ్బులి కసరుహుంకృతుల ।
దెప్పరపసురల ధృతియణంచితివి ॥

వెళవెళనార్చుచుం బెడబొబ్బలిడుచు ।
థళథళ మెఱువంగ దంతములు ।
ఫళఫళవిరవిభ వరసరుధిరము ।
గుళగుళదిక్కులంగురియించితివి ॥

చాతినస్రేవుల జన్నిదములతో ।
వాతెరసింహపువదనముతో ।
చేతులువేయిటంజెలంగిట సుతుని ।
పోతరమణంచుచు భువిమెరసితివి ॥

అహోబలమున నతి రౌద్రముతో ।
మహామహిమల మలయుచును ।
తహతహ మెదుపుచుందగు వేంకటపతి ।
యిహముంబరము మాకిపుడొసగితివి ॥

## తాళ్ళపాకం కవుల కృతులు

### సామంతం.

పల్లవి

యితరములిన్నియు నేమిటికి ।
మతిచంచలమే మానుటపరము ॥

(చరణము)

ఎక్కడిసురపుర మెక్కడివైభవ ।
మెక్కడివిన్నియు నేమిటికి ।
యిక్కడనే పరహితమును బుణ్యము ।
గ్రక్కునఁజేయఁగలదిహపరము ॥

యెవ్వరుచుట్టము లెవ్వరుబంధువు ।
లెవ్వరిందరును నేమిటికి ।
రవ్వగు లక్ష్మీరమణునిఁ దలంచుచు ।
యివ్వలఁదాసుఖయించుటపరము ॥

యెందరుదైవము లెందరువేల్పులు ।
యెందరిందరును నేమిటికి ।
కందువెఱింగి వేంకటగిరిరమణుని ।
చిందులేకకొలిచిన దిహపరము ॥

### భూపాళ.

పల్లవి

పారితెచ్చిమెత్తివేసి పారవెళ్లితిని ।
నీరసపుటెద్దువై ననీకు నేముద్దా ॥

(చరణము)

ఎద్దువై నన్నేలతొక్కి యేమిగట్టుకొంటివి ।
వద్దనై నవచ్చివూరకుండవై తివి ।
వొద్దికభూమెత్తిన యీయెద్దుకునేముద్దుగాక ।
నిద్దురచిత్తములోడి నీకునేముద్దా ॥

కాపురపుం బాపపునాకమర్మము నుధరించి ।
వీపువగులంగ దాకి విట్టవీగితి ।
ఆపగనెద్దే మెఱుంగు నడుగులచవిమాట ।
మోపరివి నీకునాముదము ముద్దా ॥

మచ్చరించి అలనాడు మాలవాండుకాలందన్ని ।
తెచ్చినయప్పటి ధర్మదేవతవు ।
యెచ్చరించి తిరువేంకటేశుదాసుండని నన్ను ।
మెచ్చితాకితివి నామేను నీకుముద్దా ॥ ౮౭

శ్రీరాగం

పల్లవి

యెందాకనేచిత్తమేతలంపో ।
ముందుముందువేసరితి ములిగివేసరితి ॥

(చరణము)

ఏమిసేతునేడజొత్తునేమని బోధింతును ।
నామాటవిన దిదేనావిహారము ।
యేమరి నందలపించి నేమైనగడించి ।
సాముసేసితే సారితిజడిసివేసరితి ॥

యేడచుట్టాలేడ బంధులేడ పొందులెవ్వరు ।
తోడైనవారుంగారు దొంగలుగారు ।
కూడు చీరగాని చోట్లు కోరగానిపాట్లు ।
వాడివాడివేసరితి వదలివేసరితి ॥

యెందునున్నా డెక్కడనేమిసేసినెక్కడభోగించి నీ ।
విందులకువిందయిన వేంకటేశుండు ।
యిందరిహృదయములో నిరవై యున్నాడతండు ।
చెందినన్నుంగాచుంగాక చెనకివేసరితి ॥ ౮౮

## తాళ్ళపాకం కవుల కృతులు

### ఆహిరి.

పల్లవి

వూరికిం బోయెడి వొకండొకఁడు ।
చేరువ తెరువేగి చెలంగుమీ ॥

(చరణము)

ఎడమ తెరువువంక కేగిన దొంగలు ।
తోడింబడఁ గోకలు దోచేరు ।
కుడి తెరువున కేగి కొట్టువడక మంచి ।
నడిమి తెరువుననే నడవుమీ ॥

అడ్డపుం దెరువుల నటునిటుం జుట్ట్రాలు ।
వెడ్డు వెట్టుచు నిన్ను వేచేరు ।
గొడ్డేరే చిన్న దిడ్డి తెరువువొక ।
దొడ్డ తెరువువంక తొలంగుమీ ॥
కొండ తెరువు కేగి కొంచెపు సుఖముల ।
బండై తిరుగుచు బడలేవు ।
అండనుండెడి పరమాత్ముని తిరుమల ।
కొండ తెరువు తేకువ నేగుమీ ॥

### ఆహిరి.

పల్లవి

అక్కడ నా పాట్లువడి యిక్కడ నీ పాటువడి ।
కుక్కనోరి కళాసమై కొల్లఁబోయె బ్రతుకు ॥

(చరణము)

ఎండచేత నీడచేత నెల్లనాఁడు నిట్లనే ।
బండుబండై యెందుం గడపలగానక ।
వుండగిలి నరకాలనుడుకం బోయెదమింక ।
వండఁదరగిన కూనవలెనాయె బ్రతుకు ॥

పంచమహాపాతకాలబారింబడి భవములం।
దెచ్చి తెచ్చిముడివేయందిదీపులై ।
పొంచినయాసలవెంటం బొరలంబోయెదమింక ।
దంచనున్న రోలిపిండితలంపాయెఁబతుకు ॥

యీదచేత వానచేత నెల్ల నాడుంబాయని ।
బాధచేత మేలెల్లబట్టబయలై ।
గాదిలివేంకటపతిం గానంగంబోయెదమింక ।
బీదగరచినబూరె ప్రియమాయెఁబదుకు ॥ ౯౧

సామంతం.

పల్లవి

నాటికినాడేనాచదువు ।
మాటలాడుచును మఱచేటిచదువు

(చరణము)

ఎనయునీతనినెఱుంగుట కేపో ।
వెనకవారు చదివినచదువు ।
మనసున నీతనిమఱచుట కేపో ।
పనివడి యిప్పటిప్రౌఢలచదువు ॥

తెలిసియితనినే తెలియుట కేపో ।
తొలుత కృతయుగాదులచదువు,
కలిగినయీతనిగాదననేపో ।
కలియుగంబులోఁగలిగినచదువు ।

పరమని వేంకటపతిఁగనుట కేపో ।
దొరలగుబ్రహ్మాదులచదువు ।
సిరులనీతనిమఱచెడికొఱకేపో ।
విరసపుజీవులవిద్యలచదువు ॥

నాట.

పల్లవి

యిటుగరుడుని నీవెక్కినను ।
పటపటదిక్కులుబగ్గనఁబగిలె ॥

(చరణము)

ఎగసినగరుడుని యేపునధాయని ।
జిగిదొలంగ చబుకుచేసినను ।
నిగమాంతంబులు నిగమసంఘములు ।
గగనముజగములు గడగడవడకె ॥

బిరుసుగగరుడునిపేరెముదోలుచు ।
బెరసి నీవు కోపించినను ।
సరసనఖిలములు జర్జరితములై ।
తిరుపున నలుగడదిరందిరందిరిగె ॥

పల్లించిన నీపసిండిగరుడని నీ ।
కెల్లునసీవెక్కినయపుడు ।
ఝల్ల నేరాక్షససమితిని మహిమ ।
వెల్లిమునుంగుదురు వేంకటరమణా ॥

నాదనామక్రియ.

పల్లవి

యీసుర లీమును లీచరాచరములు ।
యీ సకలమంతయునిదియెవ్వరు ॥

(చరణము)

ఎన్నికనామములిటు నీవై యుండగ ।
యిన్నినామములవా రిదియెవ్వరు ।
వున్నచోటనే నీవు వుండుచుండగ మరి ।
యిన్నిటందిరుగువా రిదియెవ్వరు ॥

వొక్కరుపై నీవు వుండుచుండగ మరి।
తక్కిన యీరూపములు తామెవ్వరు।
యిక్కడనక్కడ నీవు ఆత్మలలోనుండ।
మక్కువనుండువారు మరియెవ్వరు॥

శ్రీవేంకటాద్రిపై చెలంగినీవుండగా।
దైవంబులనువారు తామెవ్వరు।
కావలసినచోట కలిగినీవుండంగ।
యీవిశ్వపరిపూర్ణులిదియెవ్వరు। 3

## లలిత.

### పల్లవి

తాపలేక మేడలెక్కఁదలంచేము।
యేపులేనిచిత్తముతో యీహిహినేము॥

### (చరణము)

ఎఱుకమాలినబుద్ధి యెవ్వరై నంబతులంట।
తెలుఁగెఱుఁగక విధిందిరిగేము।
పఱచై నజవరాలు పరులెల్ల మగలంట।
వొఱపునిలిపినట్లోహూహూనేము॥

యిందరును హితులంట యెందైన సుఖమంట।
పొందలేనిబాధవోర్వలేము।
మందమతివాఁడు యెండమావులు చెరువులంట।
అందునిందుదిరిగినట్లాహాహానేము॥

మేటివేంకటేశుంబాసి మీఁదమీఁదంజవులంట।
నాటకపుతెరువుల నడచేము।
గూటిలో దవ్వులవాడు కొండలెల్లా నునుపంట।
యేటవెట్టి యేగినట్లిహిహినేము॥

## శ్రీరాగం.

### పల్లవి

యేదిచూచినం దమకు యిన్నియునునిటువలెనే
వేడి విడిచినకూడు వెదకినను లేదు॥

(చరణము)

ఏకాంతసౌఖ్యంబు లెక్కడివిప్రాణులకు ।
పైకొన్న దుఃఖముల పాలుపడెగాక ।
యేకమగుపుణ్యంబులేదం గలవిందరికి ।
కైకొన్న దురితములు కలపాటిగాక ॥

హితవైన నమస్కార మెందుగలదిందరికి ।
పతిలేని విరహతాపము కొలదిగాక ।
మతిలేనివేడుకలు మరియేవి మనుజులకు ।
చితమైన దైవమిచ్చినపాటిగాక ॥

యిరవైన దైవకృప యేలదొరకును దమకు ।
పరమైనకర్మంబు పరిపాటిగాక ।
యెరవైన పెనుబంధ మేలవిడెడునాత్మం ।
దిరువేంకటేశుకృప తిరమైనగాక ॥ ౯౫

బౌళి.

పల్లవి

చూడరెవ్వరుదీని చోద్యంబుపరికించి ।
చూడఁజూడంగ గాని సుఖమెఱుంగరాదు ॥

(చరణము)

ఎడతెగనిమమత వేయంగరాని పెనుమోపు ।
కడలేనియాస చీకటిదవ్వుకొనుట ।
నిడివైన కనుచూపు నీడనిండినయెండ ।
వడిచెడనితమకంబు వట్టితాపంబు ॥

బుద్ధిమానినచింత పోనియూరికిందెరువు ।
పొద్దువోవనివలపు పొట్టపొంకంబు ।
యెద్దుఁబట్టినసివం బెఱుకమాలినప్రియము ।
లొద్దికవిహారంబు లుబ్బుగవనంబు ॥

తీపులోపలితీపు తిరువేంకటేశ్వరుని ।
చూపు దనుం బొడగనని చూపులోచూపు ।
ఆపదలువాయు నెయ్యపుదలంపు లీతలంపు ।
రూపైన రుచిలోని రుచివివేకంబు ॥ ౯౬

నాట.

పల్లవి

యెవ్వరెవ్వరివాడో యీజీవుండుచూడ।
నెవ్వరికినేమౌనో యీజీవుండు॥

(చరణము)

ఎందరికిం గొడుకుగాదీజీవుండు వెను।
కెందరికిం దోబుట్టండీజీవుండు।
యెందరిని భ్రమయించండీజీవుండు దుఃఖ।
మెందరికింగావింపం డీజీవుండు॥

యెక్కడెక్కడ దిరుగండీజీవుండు వెను।
కెక్కడో తనజన్మమీజీవుండు।
యెక్కడిచుట్టము దనకు నీజీవుండు యెప్పు।
డెక్కడికినేఁగునో యీ జీవుండు॥

యెన్నడునుం జేటులేనిజీవుండు వెను।
కెన్నిదనువులు మోవండీజీవుండు।
యెన్నంగల తిరువేంకటేశు మాయలందగిలి।
యెన్నిపదవులంబొందండీజీవుండు॥ ౯౭

సామంతం.

పల్లవి

యెంతచేసిన తనకేది తుద
చింత శ్రీహరిపైం జిక్కుటేచాలు॥

(చరణము)

ఎడపక పుణ్యాలెన్నిచేసినా।
గడమేకాకింకఁగడయేది।
తడంబడహరియే దైవమనుచు మది।
విడువక వుండిన వెరపేచాలు॥

యెన్ని తపములివి యెట్లఁ జేసినా ।
అన్నువ కధికముకల నేవ ।
పన్ని లంకలగల పనజాక్షునిపై ।
వున్న చిత్తమది వొక్కటేచాలు ॥

యిందరివాదములెట్లు గెలిచినా ।
కందేకాకింక గరిమేది ।
యిందరినేలిన యీవేంకటపతి ।
పొందగుమహిమలపొడవేచాలు ॥ ౬౫

నారణి.

పల్లవి

ఏణినయనలచూపు లెంతసొబగైయ్యుండు ।
ప్రాణసంకటములగు పనులునట్లుండు ॥

(చరణము)

ఎదతేనిఫలిలాప మేటిదానుండు ।
అడియాసకోరికెల్ల నటువలెవెయ్యుండు ।
కడలేనిదుఃఖసంగతి యెట్లుదానుండు ।
అడరుసంసారంబు నట్లనేవుండు ॥

చింతాపరంపరల చిత్తమదియెట్లుండు ।
వంతదొలగని మోహపాశము నట్లుండు ।
మంతనపుఁబనులపై మనసుమరిగియెట్లుండు ।
కంతుశరమార్గణ మార్గణముల గతియెట్లుండు ॥

దేవుడొక్కడె యనెడి తెలివి దనకెట్లుండు ।
శ్రీవేంకటేశు కృపచేతలట్లుండు ।
భావగోచరమైన పరిణతదియెట్లుండు ।
కైవల్యసంగతులు నట్లుండు ॥ ౬౬

# అధ్యాత్మ సంకీర్తనలు

## గీతం - నాట.

ఏదైవము శ్రీపాదనఖమునం బుట్టినగంగ ।
త్రిలోకపావనముచేయును త్రిపథగామినియాయెను ।
యేదైవము నాభినలినంబున జనియించిన అజుండు అఖిలాండంబులు ।
సృజియింప నధిపతియాయెను ।
యేదైవము వురస్థలంబుదనకును నిందిర పైనయిందిరపొతయత్యై ।
యీజగంబులకెల్లను ।
యేదైవము అవలోకనమింద్రాది దివిజగణంబులకెల్లప్పుడును సుఖంబు
లాపాదించును ।
యేదైవము దేహావస్థువని అనిమిషులందరుంగూడి శ్రీనారాయణదేవుం
డనినమ్మియుండెదరు ।
ఆదేవుండే సిరులకనంతవరదుండు తిరువేంకటగిరినాథుండు భయవిభూతినా
థుండే నానాథుండు ॥ ౧౦౦

ఆహిరి.

పల్లవి

యేటికిందలంచెదరిందరును ।
గాటపుసిరులిచ్చి కాననరో ప్రజలు ॥

(చరణము)

ఎండలంబొరలక యేచినచలిలో ।
నుండక చరిలోనుడుకక ।
అండనున్నహరి నాత్మందలంచిన ।
పండినపసిండే బ్రతుకరో ప్రజలు ॥

అడవులనలయక ఆకసనలమదిని ।
కడుపులుగాలంగ గరగక ।
బడిబడిలక్ష్మీపతికి దాసులై ।
పొడవగుపదవులం బొందరో ప్రజలు ॥

పొక్కటి రాళ్లపుండ్లు రేగంగ ।
దిక్కులనంతటందిరుగక ।
గ్రక్కున తిరువేంకటపతింగని ।
వొక్కమనసుతో నుండరో ప్రజలు ॥ ౧౯౯

బౌళి

పల్లవి

యేదితుద దీనికేది మొదలు ।
పాదుకొనుహరిమాయ బరగుజీవునికి ॥

(చరణము)

ఎన్ని బాధలు దనకు నెన్ని లంపటములు ।
యెన్ని వేదనలు మరియెన్ని దుఃఖములు ।
యెన్ని పరితాపంబు లెన్ని దలపోతలు ।
యెన్ని చూచిన మరియు నెన్నైనఁగలవు ॥

యెన్ని కొలువులు దనకు నెన్ని యనుచరణలు ।
యెన్ని యాసలు మరియు నెన్ని మోహములు ।
యెన్ని గర్వములు దనకెన్ని దైన్యంబులివి ।
ఇన్ని యునుఁదలంప మరియెన్నైనఁగలవు ॥

యెన్నిటికి జింతించు నెన్నిటికి హర్షించు ।
నెన్నిటికినాశించు నెన్నిటికిఁదిరుగు ।
యిన్నియును దిరువేంక టేశులీలలుగాగ ।
నెన్ని చూచిననుదానెవ్వండుగాడు ॥ ౧౦౨

సామంతం.

పల్లవి

చక్కదనములవారసతులార ।
యిక్కువ తెక్కువల మీరేమిసేసేరింకను ॥

(చరణము)

ఒప్పుగానరకము మాకుంబలిచ్చిమన మెల్ల ।
కప్పముగొంటిరిగా యంగనలార ।
అప్పుడే గోవిందునికి ఆహివెట్టితిఁజిత్తము ।
యిప్పుడు యెమ్మెలను మీరేమిసేసేరింకను ॥
పంచమహాపాతకాలబారిందోసి మాసిగ్గులు ।
లంచముగొంటిరిగా నెలంతలారా ।
వంచనతోడుత హరివారమైతిమింక మీ ।
యించుకగుట్టుల మీరెందు జొచ్చేరింకను ॥
దొంగిలి మాగుట్టులెల్లదోవవేసి మరుబారి ।
భంగపెట్టితిరిగా వో భామలార ।
చెంగలించివేంకటేశు సేవకుంజొచ్చితిమి ।
యెంగిలిమోవులును మీరేడఁబడేరింకను ॥ ౧౦౩

బౌళి.

పల్లవి

యెట్టుచేసినం జేసె నేమి సేయుంగవచ్చు ।
చుట్టపువిరోధంబు సూనాస్త్రిచెలిమి ॥

(చరణము)

ఒడలిలోపలిరోగమొనరఁ బరితాపంబు ।
కడుపులోపలివుండు కడలేనియాస ॥

తడిపొత మెడగోత తలపువిషయానక్తి ।
గుడివిూదితలువు అల కలము ప్రాణులకు ॥

నీడలోపలియెండ నెలకొన్న బంధంబు ।
గోడపై సున్నంబు కొందలేనిరూకవుక ।
పాడూరిలో బ్రదుకు పాపకర్మపుబుద్ధి ।
తాడుపై తపను తమిధనము ప్రాణులకు ॥

మంటఁజేసినబొమ్మ మనికిసంసారంబు ।
రెంటికినిఁగాని విరిడికోలువు బ్రదుకు ।
యింటివేలుపు వేంకటేశుఁగొలువక పరుల ।
వెంటఁదిరుగుట దోడనిడిచి వదరిడుట ॥ ౧౦౪

వరాళి.

పల్లవి

తలంపు కామాతురత్వముమీద నలవడిన ।
నిల నెట్టివారైన నేలాగుగారు ॥

(చరణము)

ఒలి నిరువురు సతులనాలింగనముసేయ ।
లోలుండటుగాన నాలుగుచేతులాయె ।
వేలసంఖ్యలు సతుల వేడుకలరమియింప ।
బాలుపడెంగాన రూపములు పెక్కాయె ॥

పాలమెలుకకోటుములు భోగియానటుగాన ।
తులసి యొక్కొకవేళ తూరుముగమాయె ।
లలితలావణ్యలీలావిగ్రహముగాన ।
కొలదిపెట్టఁగరాని గొల్లసిపాయె ॥

చిరభోగసౌఖ్యములఁ జెందననుభవిగాన ।
తిరువేంకటాచలాధీశ్వరుండాయె ।
పరగ సంసారసంపదకు బద్ధుండుగాన ।
అరుదుగా సకలాంతరాత్మకుండాయె । ౧౦౫

లలిత.

పల్లవి

యెక్కడిదురవస్థ లేటిదేహములోన ।
జిక్కి జీవుండు మోక్షశిరిం జెందలేడు ॥

(చరణము)

ఒడలుమాంసపూర మొకపుఱ్ఱాటయినమీఁదు ।
గడుగకున్నం గొరగాదు ।
కడలేని మలమూత్ర గర్హితమిదిలోను ।
గడుగరాదు యెంతగడిగినం బోదు ॥

అలర చిత్తముచూడ నలిచంచలము దీనం ।
గలసిన పెనుగాలిఘనము ।
మెఱపులేనిచిచ్చుమీఁద మిక్కిలిగొంత ।
నిలుపులేదు పట్టినిలుపంగరాదు ॥

తిరువేంకటాచలాధిపుండు నిత్యానంద ।
కరుండు జీవునకు రక్షకుండు ।
కరుణించి యొకవేళ గాచినంగాని క్షేమ ।
చొరక మానదుబుద్ధి ఛొంక దెవ్వరికి ॥ ౧౦౬

## తాళ్ళపాకం కవుల కృతులు

### సాళంగం.

పల్లవి

పుట్టుమాలినబరుబొం కేవినన్ను ।
దిట్టవదేమోశి దిమ్మరిమాయ ॥

(చరణము)

ఒరపులాడకపోవే వోసిమాయనాతోఁ ।
దొరలేవు నినుముట్ట దోసము ।
వెరపించేవేమోసి విష్ణుభక్తినంట ।
నెఱంగనటే నియుతులిన్నియును ॥

వుదుటుచెల్లదు పోపోవోసిమాయ నా ।
యెదురమాటలు నీకునింకనేల ।
వదలేవు హరిభక్తివనిత తెలియరు నే ।
నిదురవుచ్చినవారు నీవునాకెదురా ॥

వొల్లవటే జీవమోశి మాయని ।
కల్లలిన్నియును లోకమెఱుంగును ।
నల్లనివిభుని మన్ననభక్తినంట ।
జెల్లెఁబోపాపపు చెందుమేయకువే ॥

వూరకుండవుగావోసి మాయనిన్నుఁ ।
చేరంబిలువము గుప్పెనలాడేవు ।
నారాయణభక్తి నాడునన్నును నిన్నుం ।
గోరి యిందరునెఱుంగుదురేలపోవే ॥

వోవవు ననుంజూచి వోసిమాయ నా ।
త్రోవవచ్చి ననునొత్తువునీవు ।
శ్రీవేంకటగిరిదేవునిభక్తినా ।
పావళికి నిన్నునలమిరిందరును ॥ ౧౨

గుజ్జరి.

పల్లవి

నాపాలి ఘననిదానమవునీవే నన్ను ।
నీపాలనిడుకొంటి నీవేనీవే ॥

(చరణము)

ఒలసి నన్నేలేదేవుండవునీవె యెందుం ।
దొలంగని నిజబంధుండవునీవే ।
పలుసుఖమిచ్చే సంపదవునీవే యిట్టె ।
వెలయ నిన్నియును నీవేనీవే ॥

పొదిగిపాయని యాప్తుండవు నీవేనాకు ।
నదనందొడగు దేహమవునీవే ।
మదమువాపెడి నామతియు నీవేనాకు ।
వెదకనన్నియును నీవేనీవే ॥

యింకాలోకములకు నెప్పుడు నీవె యీ ।
పంకజభవాదిదేవపతివినీవే ।
అంకిలివాపంగ నంతకునీవే తిరు ।
వేంకటేశ్వరుండవు నీవే ॥ ౧౮౮

వరాళి.

పల్లవి

పుడమినిందరింబట్టె భూతము కడుం ।
బొడవైన నల్లనిభూతము ॥

(చరణము)

కినిసివోడ మింగెడిభూతము ।
పునుకవింపు పెద్దభూతము ।
కనలుకవియు చీకటిభూతము ।
పొనుగుసోమవు మోముభూతము ॥

చేటకాళ్ల మించిన భూతము ।
పోటుదారల పెద్దభూతము ।
గాటపుజడల బింకపుభూతము ।
జూటరినల్ల ముసుంగుభూతము ॥
కెలసిబిత్తలె తిరిగెటి భూతము ।
పొలుపుదాంట్ల పెద్దభూతము ।
బలుపువేంకటగిరిపై భూతము ।
పులుగుమీాది మహాభూతము ॥ ౧౦౯

సామంతం.

పల్లవి

చాలదా మాజన్మము నీ ।
పాలింటివారమై బ్రదుకంగగలిగె ॥

(చరణము)

కమలాసనాదులుగానని నీపై ।
మమకారముసేయ మార్గముగలిగె ।
అమరేంద్రాదుల కందరాని నీ ।
కోమరైననామము కొనియాడఁగలిగె ॥
సనకాదులును గానఁజాలని నిన్ను ।
తనివోవ మతిలోన దలపోయగలిగె ।
ఘనమునీంద్రులకు నగమ్యమైవున్న ।
నినుసతతమును వర్ణింపగలిగె ॥
పరమమై భవ్యమై పరగెనని ।
యిరవిట్టిదనిమాకు నెఱుగంగగలిగె ।
తిరువేంకటాచలాధిప నిన్ను యీా ।
ధరమీాదఁబలుమారు దర్శింపఁగలిగె ॥ ౧౧౦

ఆహిరి.

పల్లవి

దిక్కందరికినైన దేవుండు కడుం ।
దెక్కలికాడైన దేవుండు ॥

(చరణము)

కొత్తపెండ్లికూతుకోరి చూడంబోయి ।
యొత్తి తేరుమీఁదనిడుకొని ।
నెత్తి కన్నుమానిన వానిపెండ్లికి ।
దెచ్చిగొన్నయట్టి దేవుండు ॥
గొప్పయిన పెద్దకొండమీఁదనుండి ।
దెప్పరమ్ముగా దిగఁబడి ।
కప్పి రెండుదునుకలుగూడినవాని ।
తిప్పుదీరులాడే దేవుండు ॥
బెరసి మేనమామబిడ్డకునై పోయి ।
నిరతంపుబీరాలు నెరపుచు ।
యిరవైన మాయపుబిద్దులంబోరికొన్న ।
తిరువేంకటగిరిదేవుండు ॥ ౧౧౧

శ్రీరాగం.

పల్లవి

యేమిగలదిందు నెంతగాలంబైన ।
పామరపు భోగమాపదవంటిదరయ ॥

(చరణము)

కొండవంటిదియాస గోడవంటిదితగులు
బెండువంటిది లోనిపెద్దతనము ।
పుండువంటిదిమేను పోల్చినను మేడి ।
పండువంటిది సరసభావమింతయును ॥

కంచువంటిదిమనసు కలిమిగలదింతయును ।
మచ్చువంటిది రతి భ్రమతవంటిది ।
మించువంటిదిరూపు మేలింతయునుముట్టు ।
పెంచువంటిది దీనిప్రియమేమిభ్రాంతి ॥
ఆకువంటిదిజన్మ మడవివంటిదిచింత ।
పాకువంటిది కర్మబంధమెల్ల ।
వేంకటనుం దిరువేంకటేశుందలంచినకోర్కె ।
కాక సౌఖ్యములున్న గనివంటిదరయ ॥ ౧౧౧

ఆహిరి.

పల్లవి

మెన్నాళ్ళదాకదానిట్లేవుండుటబుద్ధి ।
కన్నపోవుట పూర్వకర్మశేషం ॥

(చరణము)

కలకాలమెల్ల దుఃఖమెకాగఁ బ్రాణికిని ।
వలదా సుఖము గొంతవడిదైనను ।
కలుషబుద్ధులం బ్రజ్ఞగలదింతయును మంట ।
గలసిపోవుటే పూర్వకర్మశేషం ॥
జాలి తొల్లియుంబడ్డ జాలెనేడునుగాక ।
మేలువొద్దా యేమిటనైనను ।
తాలిమిలో హరిం దలంచక యెటుకెల్ల ।
గాలింబోవుటపూర్వ కర్మశేషం ॥
తరగని నరకభాధయు నేడునుగాక ।
దరిచేరవలదా యింతటనైనను ।
తిరువేంకటాద్రిపై దేవునిఁగొలువక ।
గరివడేభవమెల్ల కర్మశేషం ॥ ౧౧౩

గుజ్జరి.

పల్లవి

అప్పులేని సంసారమైన పాటేచాలు ।
తప్పులేని జీతమొక్క-తారమైనంజాలు ॥

(చరణము)

కంతలేని గుడిశొక్క- గంపంతై నజాలు ।
చింతలేనియంబలొక్క- చేరడేచాలు ।
జలగాని తరుణి యేజాత్తైన నదేచాలు ।
వితలేని సంపదొక్క- వీసమేచాలు ॥

తిట్టులేని బ్రదుకొక్క- దినమైన నదేచాలు ।
ముట్టులేని కూడు వొకముద్దడేచాలు ।
గుట్టుచెడి మనుకంటే కొంచెపుమేలై నజాలు ।
వట్టి జాలింబడుటకంటే వచ్చినంతేచాలు ॥

లంపటపడనిమేలు లవలేశమేచాలు ।
రొంపికంబమౌకంటె రోయుటేచాలు ।
రంపపు కోరికకంటే రతివేంకటపతి ।
పంపిన నాతనింజేరే భవమేచాలు ॥ ౧౧౪

శ్రీరాగం.

పల్లవి

కూడువండుట గంజికొరకా తనకు ।
వేడుకలుగలసుఖము వెదకుటకుంగాక ॥

(చరణము)

కుప్పనురుచుట కసవుకొరకా తనువు ।
గొప్పయవుటిది మదముకొరకా ।
వొప్పైనవేడుకల నొరసి మనసు ।
నెప్పునకురాం దివియు నేరవలెగాక ।

కొలిచు దంచుట పొట్టుకొరకా తాఁ ।
గులజుండై మూఢుండై కొరకా ।
తలపోసి యిన్నింట దగిలి యీడు ।
తెలిసి సుఖదుఃఖములం దెలియవలెగాక ।
కొండదవ్వుట యెలుకకొరకా తా ।
గొండకొమ్ముక్కుట దిగుటకొరకా ।
కొండలకోనేటిపతిం గొలిచి తనదు ।
నిండినాపదలెల్ల నింగవలెగాక ॥ ౧౧౫

శుద్ధవసంతం.

పల్లవి

ఘనుండితం డొకండు గలుగంగగదా వేదములు ।
జననములుం గులములాచారములుగలిగె ॥

(చరణము)

కలుషభంజనుండితండు గలుగంగగదా జగతి ।
గలిగె నిందరిజన్మగతులనెలవు ।
మలసియితండొకడు వొడమంగగదా యిందరికి ।
నిలువనీడలుగలిగె నిధినిధానములై ॥
కమలాక్షుఁడితండు గలుగంగగదా దేవతలు ।
గుమిగూడిరిందరును గండిగడచి ।
ప్రమదమున నితండునిలుపంగగదా సస్యములు ।
అమరంబలియించె లోకానందమగుచు ॥
గరిమ వేంకటవిభుఁ డొకండుగలుగంగగదా ।
ధరయు నభమును రసాతలముగలిగె ।
పరమాత్ముండితండు లోపలగలుగంగగదా ।
అరిదిచావులును హితవులన్నియునుగలిగె ॥ ౧౧౬

భైరవి.

పల్లవి

చూడుడిందరికి సులభుండుహరి ।
తోడునీడయగు దొరముని యితండు ॥

(చరణము)

కైవల్యమునకుం గనకపు తాపల ।
త్రోవై శ్రుతులకుం దుదిపదమై ।
పావనమొకరూపమై విరజకు ।
నావై యున్నాడిదె యితండు ॥
కాపాడంగ లోకములకు సుజ్ఞాన ।
దీపమై జగతికిం దేజమై ।
పాపాలడంపగ భవప యోధులకు ।
తేపై యున్నాడిదే యితండు ॥
కరుణానిధి రంగపతినిం గాంచి ।
వరునకు వేంకటగిరిపతికి ।
నిరతి నహోబల నృకేసరికిం ద ।
త్వరుండగు శఠకోపముని యితండు ॥ ౧౧౭

సామంతం.

పల్లవి

కలలోనిసుఖమే కలియుగమా వెన్న
కలిలోనెక్కడిదే కలియుగమా ॥

(చరణము)

కడిగడిగండమై కాలముగడపేవు ।
కడుగంగడుగ రొంపికలియుగమా ।
బడలికే వాపవు పరమేదోచూపవు ।
గడిచి దీయును నీవు కలియుగమా ॥

కరపేవు కలతలేమలుపేవు మమతలే ।
కరకలవిడువవు కలియుగమా ।
తెరచిరమలగితే తెరువేలమూసేవు ।
గరుసిలదాటేవా కలియుగమా ॥
కానిదేమెచ్చేవు కపటాలెయిచ్చేవు ।
కానిలేకానిలే కలియుగమా ।
పైనిదే వేంకటపతి దాసులుండగ ।
కానవానీవిదేమి కలియుగమా ॥ ౧౧౮

ఆహిరి.

పల్లవి

తోరణములే దోవెల్లా ।
మారటబారట ముంచిన లత్తలా ॥

(చరణము)

కూరిమి మటములు గోపురంబులును ।
తేరుపడగలే తెరువెల్లా ।
కోరినపండ్లు గురిసేటితరువులు ।
తోరములైన వెదురుజొంపములు ॥
ఆటలుఁదిరుపులు నందపుటురుపులు ।
పాటలు వనవైభవమెల్లా ।
కూటువ నెమళ్ల కోవిలగుంపుల ।
పేటలం దేటలపెనుగూటములు ॥
వింజామరలును విసనకఱ్ఱలును ।
గొంజగొడుగులే కొండెల్లా ।
అంజనగిరిరాయుండు వేంకటపతి ।
సంజీవని పరువలకొదవంగను ॥ ౧౧౯

## అధ్యాత్మ సంకీర్తనలు

### ఆహిరి.

పల్లవి

బాపుదైవమా మాపాలిభవమా ।
త్రిపురాకాసినెత్తురు దిందొందొందొందొందొం ॥

(చరణము)

కాలనేమి పునుకిది కంచువలె లెస్సవాగి ।
తాళమెత్తరే తత్తతతత్తత్త ।
కాలమెల్ల మాభూతగుణమెల్ల వీడెకాచె ।
నేలఁబడి నేడును ధింధింధింధింధింధిం ॥

పగగొని మానక పచ్చినెత్తురెప్పుడును ।
తెగికొనుండానే తి త్తితి త్తితి త్తితి ।
తగుమహోదరువీపు ధణధణ మనివాగి ।
బిగియించరేతోలు బింభింబింభింబింభిం ॥

మురదనుజుని పెద్దమొదలియెముకదీసి ।
తురులూదరే తుత్తుతుత్తుతుత్తు ।
తిరువేంకటగిరిదేవుండు గెలిచిన స ।
మరమునను మమ్మమమ్మమమ్మమ ॥ ౧౨౦

### భూపాళం.

పల్లవి

వాడెవేంకటేశుండనే వాడెవీడు ।
వాడిచుట్టుఁగైదువు వలచేతివాడు ॥

(చరణము)

కారిమారసుతుని చక్కనిమాటలకుం జొక్కి ।
చూరగా వేదాల గుట్టు చూపినవాఁడు ।
తీరని వేడుకతో తిరుమంగయాళ్వారి ।
ఆరడిముచ్చి మీఁకూటికానపడ్డవాడు ॥

పెరియాళువారి బిడ్డపిసికి పై వేసిన।
విరులదండలు మెడవేసినవాడు।
తరుణిచేయివేసిన దగ్గరిబుజముచాఁచి।
పరవశమైచొక్కి పాయలేనివాడు॥
పామరులం దనమీఁదిపాటలెల్లా బాడుమంటా।
భూమికెల్లా నోరనూరి పోసినవాడు।
మామకూఁతురలమేలుమంగనాంచారియుందాను।
గీముగాన వేంకటగిరినుండేవాడు॥ ౧౨౧

ఆహిరి.

పల్లవి

అట్లుబారి పట్టుకోరే అమ్మలారయిదె।
వెంటబారనీదు నన్ను వెడమాయెతురుము॥

(చర్ణము)

కాగెడుపెరుగు చాడెకవ్వముతో బొడిచి।
లేగలందోలుకొని అలిగిపోయిని।
రాగతనమునవాడేరాతిరి నారగించడు।
ఆగి నన్ను గూడడిగెనయ్యో ఇందాకను॥
కొలదిగానిపెరుగు కొసరికొసరిపోసె।
కలవూరుగాయలెల్లఁ గలచిపెట్టె।
పలుకడు చేతిచట్టిపారవేసి పోయినదే।
చెలంగుచు మూటగట్టె జెల్లంబో యిందాకను॥
మట్టుపడకిటు నూరుమారులైనా నారగించు।
ఇట్టే యందరిలోన నిన్నాళ్లును।
వెట్టికి నాకొరకుగా వేంకటేశుండారగించె।
యెట్లునేడాకట ధరియించెనో యిందాకను॥ ౧౨౨

## ఆధ్యాత్మ సంకీర్తనలు

### భూపాళం.

పల్లవి

యేమో తెలిసెంగాని యీజీవుండు ।
నేమంపునెరవిద్య నేరడాయె ॥

(చరణము)

కపటాలే నేరిచెంగాని జీవుండు ।
యెప్పుడై నా నిజసుఖ మెఱంగడాయె ।
కబురులే చవిగొనెంగాని జీవుండు ।
అపరిమితామృత మానడాయె ॥
కడలనే తిరిగిగాని జీవుండు ।
నడుము మొదలుంజూచి నడువడాయె ।
కడుపుకూటికె పోయెగాని జీవుండు ।
చెడనిజీతముపొంతఁ జేరఁడాయె ॥
కనియుగానక పోయెగానిజీవుండు ।
దినము వేంకటపతిం దెలియడాయె ।
కనుమాయలనే నొక్కెంగాని జీవుండు ।
తనియ నిట్టే మంచిదరిచేరడాయె ॥ ౧౩

### సామంతం. [ఆటతాళం]

పల్లవి

తనదిగాక యిందరిదిగాక ।
తనువెల్ల బయలై దరిచేరదు ॥

(చరణము)

కడుపునిండదు కన్నుఁదనియదు ।
కడగిలో నీయాకలియుంబోదు ।
సడింబడి కుడిచిన కుడుపెల్ల నినుము ।
గుడిచిన నీరై కొల్లబోయె ॥

చవియుందీరదు చలముబాయదు ।
లవలేశమైన నొల్లకపోదు ।
చివచివ నోటికడవలోని నీరై ।
కవకవనవియుచుంగారిని ॥
అలపుదోపదు అడవినెండదు ।
మొలయించు భంగమయినం బోదు ।
తెలిసి వేంకటగిరి దేవునిందలపించు ।
తలపైన దనకు ముందరనబ్బదు ॥ ౧౨౮

నాట.

పల్లవి

నానామహిమల శ్రీనారసింహము ।
పూని మమ్మురక్షించిపొగడెద నిదిగో ॥

(చరణము)

కొండవంటి వేదాద్రిగుహలలోసింహము ।
దండిభవనాశియేటి దరిసింహము ।
అండ నారుశాస్త్రముల అడవిలోసింహము ।
నిండి అహోబలముపై నిక్కిచూచెనిదిగో ॥
యోగీంద్రుల మతి తెరమరంగు సింహము ।
జట్టిగొన్న శ్రీసతితో జంటసింహము ।
పట్టిదైత్యుల వేటాడె బలుదీము సింహము ।
మెట్టి అహోబలముపై మెరసెదానిదిగో ॥
పలుదేవతల వెనుబలమైన సింహము ।
కెలసికంబానం బెనంగిన సింహము ।
అలరి శ్రీవేంకటేశుండే నట్టిసింహము ।
కొలువై అహోబలాన గురుతాయె నిదిగో ॥ ౧౨౯

## అధ్యాత్మ సంకీర్తనలు

### లలిత.

పల్లవి

శిరసుండ మోకాల సేసవెట్టినయట్లు ।
పరమధర్మముమాని పలుచుగావలెసె ॥

(చరణము)

కోరికలునుమాని కోలచేతబట్టుకోని ।
బిరానబోటుకుంబోయి పట్టువడ్డట్టు ।
యీరీతిప్రపత్తిమాని యితర కర్మము ।
సారె పుణ్యపాపముల సందిఁజిక్కవలసె ॥

వైపైనవాడవిడిచి వదరుచేపట్టుకోని ।
వైపుగాక యీదియీదివడ్డిండట్లు ।
యేపున దాస్యముమానితరోపాయము ల ।
పూపస్వర్గభోగములపుడుగావలసె ॥

ఘనమాణముమాని గాజుబూసగట్టుకోని ।
వెనకజాణాలచే నవ్వించుకొన్నట్లు ।
యెనశిన శ్రీవేంకటేశు శరణనలేక ।
మనుజన్మాదులన మునుగంగవలసె ॥ ౧౨౭

### లలిత.

పల్లవి

అనాదిసంసారినటుగాన ।
మనోవికారమిది మానదెంతయిన ॥

(చరణము)

కడుచంచలమేకాని కాయములో నిజబుద్ధి ।
తోడరదు దుర్బుద్ధి తోచెనాకు ।
దిటువై శ్రీహరి నీవు తిద్దితేనే మొకాని ।
పెడగునాగుణమిది విడువదెంతయినా ॥

పలుచింతలేకాని పట్టిన నీపై భక్తి ।
కలుగదజ్ఞానమేకప్పెనాకు ।
బలిమిబంధాలు నీవల్లపై తెనేమోకాని ।
తొలగు నామనసిది తొలగదెంతయిన ॥

పట్టినీచలమెకాని పైపై విరక్తినాకు ।
నెట్టదు నీకృపనిలిచినాకు ।
యిట్టె శ్రీవేంకటేశ యేలినవాడవునీవు ।
యెట్టయిన నీకుబోదు యెఱుగనెంతయిన ॥ ౧౨౭

సామంతం.

పల్లవి

కతగాదద్రుష్టమిది కలిగెమాకు ।
సతమంటా నిట్టె పొద్దుజరపంగవలసె ॥

(చరణము)

కాయమనేటి మోహాభుజమెక్కినారము ।
ప్రాయపు మోహామదముపట్టెను మమ్ము ।
తీయరాని బంధపు తీగెతెంచివేయలేము ।
యేయడవిజ్ఞానమిది యెఱింగిమానేము ॥

నిచ్చల సంసారమనే నిధిదొక్కినారము ।
పచ్చి మదనభూతముపట్టెను మమ్ము ।
గచ్చుల యహంకార గర్వము మానగలేము ।
అచ్చుపుమోక్షపు తెరువచ్చినామాకు ॥

రామలరతి కొల్లాపురముల వారము ।
యేమైనా మొగ్గుశిగ్గులెంచముమేము ।
శ్రీమంతుండైనట్టి శ్రీవేంకటేశుండెనన్ను ।
యేలినాడు వీడెపో ॥ ౧౨౮

దేశాక్షి.

పల్లవి

చూడఁగజూడఁగ సుడిగొనె మాయలు ।
వేడుకతోనిన్ను వెదకేదెప్పుడో ॥

(చరణము)

కడపఁగగడపఁగ గాలముగడచెను ।
జడసిన వెనకటి జన్మముల ।
నడవఁగ నడవఁగ నడచెసంసారము ।
యెడయక హరినిన్ను యెరిగేదెప్పుడో ॥

కోరఁగ గోరఁగ కూడెలంపటము ।
గారవమగు నిజకర్మముల ।
మేరలుమీరఁగ మించెను మమతలు ।
కూరిమిహరినిన్ను గొలిచే దెప్పుడో ॥

నిలుపఁగ నిలుపఁగ నిండెను జ్ఞానము ।
అలరఁగ శ్రీహరి అనుజ్ఞను ।
యిలలో శ్రీవేంకటేశ నీమహిమం ।
గలరి చొచ్చికొని యాడితిమిపుడు ॥ ౧౫

బౌళి.

పల్లవి

అజ్ఞానజంతువు నే నైతిగాక ।
సుజ్ఞానమూర్తివి నీవుచూచుటతగవా ॥

(చరణము)

కోరితే రావలెగాక కోరనివిరానేల ।
కోరితిమాదుఃఖములు గోవిందనిన్ను ।
అరయ పాపఫలములవి యంటివానీవు ।
యేరీతినాత్మవు నీవు యింకదోషమున్నదా ॥

అనాథనాథుండవు ఆతురబంధుండవు ।
సనాథుండనునేను సరినుండగా ।
వినోదమిదినీకు విశ్వప్రపంచము ।
మనోధర్మములనీ మాయదాటగలనా ॥
సరిగజదంతపరీక్షలు చూడనెంతవాడ ।
ధర శ్రీవేంకటేశుండ దాసుండనీకు ।
గురువు నీకొప్పగించె కోరె నీకుశరణంటి ।
నిరతిం జేకొంటిగాక నేపుణ్య నేరాలున్నవా ॥ ౧౩౦

ధన్న్యాసి.

పల్లవి

బ్రహ్మపూజించె రఘుపతి విభీషణుకిచ్చె ।
బ్రహ్మణ్యుండీ రంగపతింగొలువరో ॥

(చరణము)

కావేరిమధ్య రంగక్షేత్రమల్లదిగో ।
శ్రీవిమానమదిగో శేషపర్యంకమిదే ।
దేవుండల్లదె వాడే దేవి శ్రీలక్ష్మియదే ।
సేవించరో నాభిం జిగురించెనతండు ॥
యేడుగోటలునవిగో యెసంగుపూందోపులవె ।
కూడిదామోదరపుర గోపురమదె ।
తోడవేయిగ కాల దొడ్డమంటపమదిగో ।
చూడరో పసిండిమించులకంబమదిగో ॥
ఆళువారలువారె యంగరంగ విభవమదె ।
వాలు శ్రీవైష్ణవపు జాడలవిగో ।
ఆలీల శ్రీవేంకటేశుండై వరమిచ్చి నీ ।
తాలిముల శ్రీరంగదైవముంగొలువరో ॥ ౧౩౧

మలహరి.

పల్లవి

పెట్టినవారలభాగ్యమిది ।
గుట్టుదెలిసితే గురుతులివి ॥

(చరణము)

కామధేనువును కల్పవృక్షమును ।
భూమీశత్వము భువనేశత్వము ।
సామజవరదుని శరణ్యము ॥
పరుసవేదియును పరమైశ్వర్యము ।
హరినిన్నుఁగొలిచె అనుభవము ।
నిరతభోగములు నిధినిధానములు ।
గరిమఁమెరయు మీ కైంకర్యములు ॥
నిండుభోగములు నిత్యశోభనము ।
కొండలయ్య నీ గుణకథలు ।
అండనే శ్రీవేంకటాధిప సవణము ।
మెండుకొన్నదిదె మీకరుణ ॥ ౧౩

భూపాళ.

పల్లవి

కాయ పండుసేయుబోతె కడు పులుసేకాక ।
యేయెడ తీపుగాదు యిటువంటిదే ॥

(చరణము)

కోపమెల్ల నొకవంకకూడవేసి మరికదా ।
పైపై హరిఁదలంప పాత్రుండయ్యేది ।
కైపుగాక రుచులపై కాంక్షమాని మరికదా ।
వోపి లోకములసద్ద వొల్లకుండేది ॥

పంచేంద్రియములనెల్ల పారదోలి మరికదా ।
కొంచెపు విరక్తికెల్ల వోడిగట్టేది ।
కొంచెపుకోరికెల్ల కోరకుండిమరికదా ।
వచ్చి హరిదాసులలో వహికెక్కేది ॥
వేవేలుపనులెల్ల విడిచిన మరికదా ।
శ్రీవేంకటేశ్వరుని చింతించేది ।
భావించియితని దాసపరికరమైకదా ।
త్రోవచూచి మోక్షము తుదకెక్కేది ॥ ౧౩౩

దేశాక్షి.

పల్లవి

కాపులముమేమునీకు కర్తవు నీవు మాకు ।
దాపుదండై బ్రదికించి దయఁజూడవయ్యా ॥

(చరణము)

గుట్టున అయిదుప్రాణాలకు డాగువెట్టేము ।
పట్టిదేహముల విడువఁబట్టులివిగో ।
అట్టెకర్మములనేటి అరిగోరులువెట్టేము ।
నట్టుగొట్టి జీవులకు నరకములేలయ్యా ॥
మించిన పితాళ్లకు మేరలెల్లబెట్టేము ।
పొంచిసంసారములలో గాపురమున్నాము ।
పంచేంద్రియపుఁబొలాల పైరులెల్ల జేసితిమి ।
అంచెదేవాలకెల్ల ఆజ్ఞలేడవయ్యా ॥
కూరిమివిషయముల కొట్నములుదంచేము ।
చేరి నీచైతన్యమున సేవసేసేము ।
యీరీతి శ్రీవేంకటేశ యిటు నీకె దాసులము ।
అరయఁగాచితివి నీయాధీనులమయ్యా ॥ ౧౩౪

భూపాళ.

పల్లవి

పోయినబంధము లటుఁబోవుగాక ।
ఛీ యనిరోసి యెంగిలిచేకొనేదా ॥

(చరణము)

తొల్లిచేసినకర్మాలు తొలగచేసెగురుండు ।
చెల్లెబో యింక నవిసేసేదా ।
వొల్లక విత్తులు తమవ్రముకంబాసిన మీఁద ।
మొల్లమి గ్రమ్మర నవిమొలచెనా ॥
వెడజాతిధర్మముల వెళ్లదీసెటి గురుఁడు ।
ముడింగి అందునే మరి మునిగేదా ।
వాడిసి తొడమేనంది పూడినఫలములు ।
అడరి క్రమ్మర నిందు నంటబోయెనా ॥
శ్రీవేంకటేశ్వరుని జేరంజూపె గురుండు ।
దావతియితరులం దడవేదా ।
భావించిపరుసవేది పసిఁడియైన లోహము ।
వేవేలైన తొల్లిటివిధమయ్యీనా ॥ ౧౩ ॥

మలహారి.

పల్లవి

బళిబళిదేవుండా బాపుబాపుమాయ ।
యెలమి యింతసేసేశి యేమిఁజేసికొంటివి ॥

(చరణము)

కలిమియొక్కనికి కడులేమియొక్కనికి ।
యిలనిందరు జీవులేయేలవచ్చెను ।
బలవంతుఁడొకఁడు బలహీనుఁడొకఁడు ।
మొలపించి భ్రమసేల ముంచేరు మీరు ॥

వొక-చోట రాజసము వొక-చోట బంటరికము ।
అకటా దేహాలుమోసినంతలోననే ।
పకపకనవ్వులు భయములువేరెవేరె ।
సకలజీవులమీద చల్లేరుమీరు ॥
శరణునీకంటేనే జారెనాపాపములు ।
నీరవుల రెండు నీజగములోన ।
గరిమె శ్రీవేంకటేశ కరుణించితివినన్ను ।
దరిచేర్చి నీమాయదాసుండనేగనుక ॥ ౧౩౬

దేశాక్షి.

పల్లవి

వేదములేనినివాసమట విమలనారసింహా ।
నాద ప్రియ సకలలోకపతి నమోనమోనరసింహా ॥

(చరణము)

ఘోరపాతక నిరుహరణా కుటిలదైత్యదమనా ।
నారాయణ రమాధినాయక నగధరనరసింహా ।
నీరూపం బింతింతయని నిజము తెలియరాదు ।
యీరీతిఁ ద్రివిక్రమాకృతినేర్చితి నరసింహా ॥
గోవిందా గుణగణరహితా కోటిసూర్యతేజా ।
శ్రీవల్లభా పురాణపురుషా సితనఖనరసింహా ।
దేవా మిము బ్రహ్మాదులకునుఁ దెలియనలవిగాదు ।
భావించంగ ప్రహ్లాదుడుటంబరగితి నరసింహా ॥
దాసపరికర సులభ తపనచంద్రనేత్రా ।
వాసవ సురముఖముని సేవితవందిత నరసింహా ।
భాసురముగ శ్రీవేంకటగిరిం బాయని దైవముపటుగాన ।
వోసర శీఘ్రుడేలితివిట్ల నహోబలనరసింహా ॥ ౧౩౭

### నాట.

**పల్లవి**

చేరిమొక్కరో నరులు శ్రీమంతుండితండు ।
కోరెవరములిచ్చు కొండవంటిసింహము ॥

(చరణము)

గద్దెమీదగూరుచుండి కనకకసిపుంజెండి ।
గద్దరిప్రహ్లాదునిపై కరుణనిడి ।
వొద్దనేమారుగొండలవి విడియుండానును ।
తిద్దుకొనేమీసాలు దివ్యనారసింహుండు ॥
భవనాసివరిద్రొక్కి బ్రహ్లాదుల లోననిక్కి ।
తివిరిప్రతాపమున దిక్కులకెక్కి ।
రవళినారదాదుల రంగుపాటులకుం జొక్కి ।
చెవులాలించి నుతులు శ్రీనారసింహుండు ॥
అదేకంభములోబుట్టి ఆయుధాలుచేతంబట్టి ।
వెదకి అహోబలాన వేదుకంబుట్టి ।
కదిసి శ్రీవేంకటాద్రి కాంతలలో గుంపుగట్టి ।
వెదచల్లుమహిమల వీరనారసింహుండు ॥ ౧౩౮

### సామంతం.

**పల్లవి**

అందులోనే వున్నవాడు ఆదిమూర్తి ।
అందరానిపదవైన నందిచ్చునతఁడు ॥

(చరణము)

ఘనులిండ్లవాకిళ్ళు కావఁబొయ్యేజీవుఁడా
కని నీయాత్మవాకిలి కావరాదా ।
మొనసి పరులరాజ్య మేలఁబొయ్యేజీవుఁ
అనిశము నీమనోరాజ్యముసేయరాదా ।

చెలులరూపములెల్ల చింతించేజీవుఁడా ।
చెలగి నీరూపమేదో చింతించరాదా ।
కేలన సుఖములు భోగించేటిజీవుఁడా ।
వోలసి సుజ్ఞానము భోగించరాదా ॥
చేవసంసారాన బలిసినయట్టిజీవుఁడా ।
భావపుటానందాన బలియరాదా ।
కావరపుసంపదలు కోరేటిజీవుఁడా ।
శ్రీవేంకటేశునిసేవగోరరాదా ॥ ౧౩౯

సాళంగనాట.

పల్లవి

శరణంటేజాలు సర్వేశ్వరునికి ।
అరయనిందరిఁగోట్టి అర్జునుంగావఁడా ॥

(చరణము)

చేతెడుదవ్వోసుడీ చేరిద్రెముక్కేవారికెల్ల ।
చాతిరింబగలు హరిరక్షించేచోటు ।
కాతరాన జీవులార కానలేరు నమ్మలేరు ।
ఘాతతో శిశువునకై కంభములోవెళ్లడా ॥
కూతవెట్టుదవ్వోసుడీ కోరిపిలువనేచిక్కితె ।
భ్రాంతి హరినామముండి పాలించేచోటు ।
లోతుగాదు పాతుగాదు లోలోనశ్రీపతిపేరు ।
నాతిమొరాలించి యీాతడు నాడుగావఁడా ॥
కనుచూపు దవ్వోసుడీ కప్పిశ్రీవేంకటపతి ।
మనసులో అందరినిమన్నించేచోటు ।
ననుచూచి తొడనుండి ధ్యానమునేసికొనినను ।
తనజాతనుండితడిచ్చెపో వరములు ॥ ౧౪౦

# అధ్యాత్మ సంకీర్తనలు

శంకరాభరణం.

పల్లవి

కోరెధర్మముచాలు కుక్కటంబట్టుమన్న రీతి ।
యీరీతి నింతసేసితి వింతచాలదా ॥

(చరణము)

చక్కగానన్నొక హీనజంతువుగాబుట్టించక ।
యెక్కువ నరునింజేసితి వింతచాలదా ।
నిక్కలనిదిచాలక దివ్యభోగముగోర ।
అక్కరనాకింక ఆసోద్యమా ॥

పాతకాలుసేసేటి పరులబంటుఁజేయక ।
యీతల నీబంటుఁజేసితిదిచాలదా ।
ఆతల నీవద్ద సనకాదులపదవిగోర ।
ఆతుమలోనాకింక ఆసోద్యమా ॥

నరకమనుభవించ నన్ను నందునిలుపక ।
యిరవై యిహమిచ్చితిదిచాలదా ।
ధర శ్రీవేంకటపతి తగ నీకుశరణంటి ।
పరముగోరనుయింక నప్పటినాసోద్యమా ॥ ౧౪౧

సామంతం.

పల్లవి

తాముందెలియరు తగంజెప్పినవినరు ।
పామరపుం దమకర్మఫలమో హరిమాయయో ॥

(చరణము)

చీకటినెడబాపేటి చేరువ సూర్యోదయము ।
చీకటికూతలకైతే చిమ్మిరెంచును ।
యాకటితో విజ్ఞానమునందిచ్చె శ్రీహరిభక్తి ।
కాక దుర్మార్గులకుఁ గానదు ॥

అందరు రుచిగొనేటి అన్నమది బహురోగికి ।
కందువనజీర్ణమై కారించును ।
యెందును శ్రీహరిదైవ మెక్కుడన్న చదువులు ।
మందమైనజడునికి మరగులై తోచును ॥
ధరంగొందరు మూర్ఖులు తగనొక్క రాజుంగొల్చి ।
పరిచారకునిదిట్ట భంగపడ్డట్టు ।
యిరవుగ శ్రీవేంకటేశుంగొల్చి వారివారి ।
విరసాలాడుచుం దామే నిష్ఫలులై పోదురు ॥ ౧౪౨

సామంతం.

పల్లవి

భోగమునాయందునీకు భోగివినీవు ।
శ్రీగురుండ విన్నిటను చిత్తగించునన్నును ॥

(చరణము)

చక్కనిజన్మపు సంసారవృక్షమునకు ।
పక్కనఫలమునీవు భావించగా ।
మక్కువకర్మమనేటి మత్తగజమునకును ।
యెక్కువమావటివాడవు యెంచంగనీవు ॥
నెట్టన దేహమనేటి నిర్మలరాజ్యమునకు ।
పట్టమేలుచుండిన భూపతివి నీవే ।
దిట్టయిన మనసనేటి తేజిగుఱ్ఱమునకు ।
వొట్టినరౌతువు వుపమింపనీవు ॥
సంతసమైనభక్తి చంద్రోదయమునకు ।
రతులంజెలంగు సముద్రమవునీవు ।
చేతల శ్రీవేంకటేశ జీవుండనేమడలోన ।
అంతర్యామివినీవు అంకెలజూడంగను ॥ ౧౪౩

## అధ్యాత్మ సంకీర్తనలు

### శ్రీరాగం.

పల్లవి

శ్రీపతియే రక్షించుగాక మరి ।
యేపున జంతువులమే మెఱుంగుదుము ॥

(చరణము)

జలధులలోఁతును సంభవివేడెము ।
అలరించిన శ్రీహరియెఱుంగు ।
పొలసినజ్ఞానము పుణ్యాపాపములు ।
యిలపై జీవుల మే మెఱుంగుదుము ॥
అనలము తేజము నాకసము విరివి ।
అనిశము నారాయణుం డెఱుంగు ।
మునుకొన్న కాలము మొదలిజన్మములు ।
యెనయంగఁ బ్రాణుల మే మెఱుంగుదుము ॥
విసరేగాలియు విశ్వములోపలి ।
పస శ్రీవేంకటపతియెఱుంగు ।
సూసరిపై శరణముజొచ్చుట యతనికి ।
యొసంగిన దేహుల మే మెఱుంగుదుము ॥ ౧౮౮

### పాడి.

పల్లవి

యెవ్వరేమిసోదించే డెవ్వరే మెరింగేరు ।
అవ్వలనివ్వల శ్రీహరియే దైవము ॥

(చరణము)

జగములోపలహరి సాత్వికదైవమని ।
భృగువేసోదించినాఁడు పృథివిందొల్లి ।
ముగ్గురువేలుపుల మోమొరవెట్టిరితనికే ।
జిగిమించ దేవతలు క్షీరాబ్ధికాడనే ॥

ధరంగాసి లోన హరి తారకబ్రహ్మమని ।
హరుఁడే బోధించఁజొచ్చెనందరికిని ।
అరుదుగా రామనామమంతని పట్టపురాణి ।
గిరిసుతపార్వతి కీర్తించఁదొడఁగె ॥
అదిగో శ్రీవేంకటాద్రి హరిపరతత్వమని ।
యెదుటనే బ్రహ్మపుట్టె యితనినాభిని ।
యిదిగో మనమందరమితనినే కొల్చి ।
బ్రదుకుదమిటు చారో ప్రాణులార మీరు ॥ ౧౮౫

## గౌళ.

పల్లవి

వోవో రాకాసులార వొద్దుసుడి వైరము ।
దేవుని శరణనరో తెలుసుకోరో ॥

(చరణము)

జగములో రాముండై జనియించె విష్ణుండిదె ।
అగపడి లక్ష్మి సీతయయి పుట్టెను ।
తగు శేష శంఖచక్రదైవసాధనములెల్ల ।
తగిలి లక్ష్మణ భరతశత్రుఘ్నులైరి ॥
సురులు వానరులైరి సూర్యుండు సుగ్రీవుండు ।
మరిగి రుద్రుండు హనుమంతుడాయెను ।
సరుస బ్రహ్మదేవుండు జాంబవంతుడైనాడు ।
వెరవరీ నలుండే విశ్వకర్మసుడీ ॥
కట్టిరి సేతువప్పుడె ఘనులెల్లా దాటిరి ।
ముట్టిరి లంకానగరమును దళము ।
అట్టె శ్రీవేంకటేశుండాతండే యీతండై ।
వొట్టుచు వరములిచ్చె వో నరదాసులకు ॥ ౧౮౬

లలిత.

పల్లవి

కానని యజ్ఞానులారా కర్మజాతులారమీఁదు ।
మానక కర్మముసేసి మాయఁజిక్కవలెనా ॥

(చరణము)

తపముసేసితిమంట దాటరానిగర్వమేల ।
తపమురావణాదులు తగఁజేయరా ।
అపురూపమైన నారాయణ నామముచ్చరించే ।
ప్రసన్నులతోడి సరియా బ్రహ్మాదులు ॥

మహిలోఁబుణ్యములంట మదియించమీకేల ।
మహిలోఁపుణ్యులుగారా నహుషాదులు ।
సహజపుద్వయాను సంధానపరులైన ।
వహికెక్క వైష్ణవులవంటివారసురలు ॥

అందేము స్వర్గలోకమట రాజసమేల ।
అందడా స్వర్గము నరకాసురుండు ।
చందపుశ్రీవేంకటేశు చక్రలాంచనులతో ।
పొందిజీవన్ముక్తులకు పురుండాసోమపులు ॥ ౧౪౭

పాడి.

పల్లవి

వేరొక్కరులేరు విశ్వమంతా నీమహిమే ।
తేరితెలిసేకలవు యితరములేదు ॥

(చరణము)

తల్లివై రక్షింతువు తండ్రివై పోషింతువు ।
యిల్లాలవై మోహింతువు నాకు ।
వొళ్లయి పెరుగుదువు వొగింబురాకృతతోడు ।
యిల్లుమొంగిలై వుండుదువింతా నీమహిమే ॥

గురుండవై బోధింతువు కొడుకువై యీడేర్చువు ।
అరుదై నిధానవమౌదు నీవే ।
దొరవై నన్నేలుదువు దూతవై పనిసేతువు ।
యిరవై నసిరులిత్తువింతానీమహిమే ॥

దేవుండవై పూజగొందు దిక్కుప్రాణమౌదువు ।
కావలసినట్టౌదు కామించినట్లు ।
శ్రీవేంకటేశ నీవెచిత్తములోపలనుండి ।
యీవలవై కుంతమిత్తువింతానీమహిమే ॥ ౧౮౪

ముఖారి.

పల్లవి

యెక్కువతక్కువలేవి యిందరిలోపలనేను ।
చిక్కి హరినీవు పెద్దసేసితివిగాక ॥

(చరణము)

తెలియనిందరివంటి దేహమేయిదిగదా ।
పొలసి దొరతనముపొదిగెంగాక ।
మలమూత్రములు రక్తమాంసమునొక్కటేకాక ।
కలిమిలేములు ముందుకాననియ్యవుగాక ॥

చేపట్టి యిందరివంటి జీవుండనేగానా ।
పాపపుణ్యములు నన్ను బరచెగాక ।
యేప్రొద్దులోకములోని యింద్రియములివెకావా ।
తీపులుమరపి నన్ను దిమురంచెగాక ॥

కైకొని యిందరివంటికర్మమే సేయంగగదా ।
మీకడసంపదలు నన్నేపించెగాక ।
పైకొని శ్రీవేంకటేశ భక్తియొక్కటికదా ।
యెక్కడనైనా నన్ను యీడేర్చుఁగాక ॥ ౧౮౫

భూపాళం.

పల్లవి

సర్వశక్తివి నీవె సకలలోకేశ్వరా ।
నిర్వహించి నన్ను రక్షించనీవె ॥

(చరణము)

తండ్రిపై జేసినభక్తి దైవమా నీకేశలవు ।
తండ్రికితండ్రివి నీవంతర్యామివి ।
తుండ్రాడితల్లిపై జేసె మచ్చికల్లానిది ।
నిండుదల్లిలోవాడవు నీవేకనక ॥

పెండ్లాముపై జేసినప్రేమలెల్లా నీసొమ్మే ।
పెండ్లాములోభావన నీపెంపేకనక ।
ఎడ్లకై బంగారులకై వెలసే తపసునీదే ।
యిండ్లిండ్ల సంపదలు నీవింతగనక ॥

ఇమ్ముల దేహానకు భోగించిన భోగమునీదే ।
నెమ్మదినంతర్యామివి నీవు గనక ।
యిమ్ముల శ్రీవేంకటేశ యిన్నియువిన్నవించితే ।
కమ్మినాకన్నిటికి కర్తవునీవేకాన ॥ ౧౫౦

మలహరి.

పల్లవి

హరిదాసుండగు టేయదితపము ।
పరమార్థములనుఫలమేలేదు ॥

(చరణము)

తిట్టినయప్పుడు దీవించినప్పుడు ।
అట్టిసమమగునది తపము ।
వట్టినేమములు వేవేలుసేసిన ।
బట్టబయలేకాని ఫలమేలేదు ॥

యిచ్చినయప్పుడు యిరత్యాధియప్పుడు ।
అచ్చుగనవ్వినదదితపము ।
యిచ్చలబుణ్యములెన్నిసేసినా ।
బచ్చనలింతే ఫలమేలేదు ॥

కూడినయప్పుడు గొణగినయప్పుడు ।
ఆడికవిడిచిన యదితపము ।
యీడనే శ్రీవేంకటేశుండే శరణము ।
పాడిపంతముల ఫలమేలేదు ॥ ౧౫౧

## దేశాక్షి.

పల్లవి

సులభమియిదియె చూచినదుర్లభమిది ।
అలరుసుజ్ఞానులకు అజ్ఞానులకు ॥

(చరణము)

తీరనిగొన్నాళ్ళకు తెగినదానఫలము ।
తీరవు హరిదాసులదివ్యభోగాలు ।
జారుగొన్నాళ్ళకు సకలదేవత్వములు ।
జారదు వైకుంఠుని సాలోక్యమోక్షము ॥

యింతింతనంగవచ్చు నింద్రాదులసంపదలు ।
యింతనరాదునీదాసుల యీమహిమలు ।
పంతానసాధించవచ్చు బహుళకర్మఫలము ।
యెంతయినసాధించరాదు యీహరిభక్తి ॥

వుండుతామసగుణమలలోకాలసకలలోకాలు ।
వుండవు శ్రీవైష్ణవులవద్దసన్నిండుదు ।
అండనె శ్రీవేంకటేశుండున్నిచూడలుకలనుడు ।
నిండుతనదాసులకు నిజవరాలు ॥ ౧౫౨

శ్రీరాగం.

పల్లవి

అదియెపో హరినామము ।
తుదిపదమిదియె ధృవమైకలిగె ॥

(చరణము)

తొడరి చిత్రకేతుండేనామము ।
తడవిలోకమంతయుగెలిచె ।
విడువక బ్రహ్మయు వెసనేనామము ।
బడిబడినడుగుచు ప్రభుడై నిలిచె ॥
హరుడేనామము అదితారకముగ ।
నిరతిందడవియెన్నికమీరె ।
ధరనేనామముదలచి నారదుండు ।
సురమునియై సంస్తుతులకునెక్కె ॥
ధృవుండేనామముదొరకొని నుతియించి ।
ధృవపట్టంబునతుదబ్రదికె ।
జీవళి శ్రీవేంకటేశ్వరుదాసులెల్లను ।
భువినేనామము భోగించమనిరి ॥ ౧౫౩

దేశాక్షి.

పల్లవి

యిద్దరుదేహసంబంధ మిదిగో మాయ ।
గద్దించియేడనుండునో కడసారితాను ॥

(చరణము)

తోడఁబుట్టినమమత తోడఁగిళ్లాన్నాళ్ళను ।
వాడికపుత్రులవిరాదవలెనుండదు ।
వేడుకవారెవ్వరో వీరెవ్వరోకాని ।
కూడువెట్టి వీరికొట్లాడేవారికే ॥

తల్లిమీఁదంగలభక్తి తనకే కొన్నాళ్లకు ।
యిల్లాలిమీఁదవలె యింతవుండదు ।
వెల్లివిరి నిదిగొంత విచారించనిదిగొంత ।
యిల్లుముంగిలొక్కరిది యెరవువొక్కరిది ॥
నీతితో శ్రీవేంకటేశు నిత్యసేవకొన్నాళ్లకు ।
యీతలసంసారమెంతయితవుగాదు ।
ఆతండెట్టు యిదియెట్టు అందరునెరింగినదే ।
చేతులొక్కరియందు చిత్తమొక్కరియందు ॥ ౧౫౪

సామంతం.

పల్లవి

కాదని వేరే చేయఁగలవాఁడా తాను ।
సాదువలెనుండుఁగాక స్వతంత్రుఁడు తాను ॥

(చరణను)

దైవముపై భారము తనపై బెట్టుకోనేల ।
మోయలేక సంసారాన మూలుగనేల ।
జీవుండై పుట్టితేనేమి శ్రీపతి నీవాఁడనని ।
సేవసేయుచుండఁగానే చేరికాచెనతండే ॥

యేలికఁగూర్చుండె గద్దెయెక్కుందనకదియేల ।
ఫీధిఅపరాధానకు వెరవనేల ।
ఆలుబిడ్డలకు గురియవుటకు హారించేరి ।
కాలముగోరకుండంగ కరుణించెనతండె ॥

శ్రీవేంకటేశుమాయకు చేరి యడ్డాలు రానేల।
త్రోవగానక యాతని దూరఁగనేల ।
శ్రీవైష్ణవుండవుటకు చిత్తములో విష్ణునమ్మి ।
భావించుకొనఁగా దయపాలించునతండె ॥ ౧౫౫

పాడి.

**పల్లవి**

యెంతలేదు లోకము హెచ్చేది క్రుంగేది ।
పంతపు శ్రీహరిభక్తి పట్టవలెగాక ॥

**(చరణము)**

తనువులు మోచేది ధనములు దాచేది ।
ఘనజీవులకునెల్ల గలిగినదే ।
మనసులు రోసేది మమతలం బాసేది ।
వనజాక్షు గొలిచేది వలెనింతే కాక ॥

కాపురాలు సేసేది కపటాలు బాసేది ।
తాపపుజీవులకెల్ల దగిలినదే ।
కోపములఁ ద్రుంచేది కోరికలఁ దెంచేది ।
శ్రీపతికరుణ లోనం జిక్కవలెగాక ॥

ఆకలికిబడలేది అన్నములు గొనియేది ।
తేకువజీవులకెల్ల దృష్టమైనదే ।
యెంకటతో శ్రీవేంకటేశ్వరు శరణని ।
కాకదేర సుఖియించగావలెఁగాక ॥ ౧౪[illegible]

పాడి.

**పల్లవి**

వేగిరమేటికిని వెసటలేటికిని విష్ణుని సొలయంగనేల ।
సాగిలిమ్రొక్క నతండు మన్ననలు జరపినపాటె జరపెంగాక ॥

**(చరణము)**

తనవ్రేలే తనకన్ను దాకినను తానెవ్వనింకోపించినీ ।
తనకర్మమే తన్ను జేయంగ దైవము దూరగనేల ।
అనుభవింపుచును హరినేకొలిచిన అలమటలన్నియు హరిచూచి ।
పొనుంగక తమలో దుదోషంబులు పొమ్మనప్పుడే పోయెగాక ॥

కడుపులోపలిక్రిమింగినరత్నము కడచోట్ల వెదకంగనేల ।
బడిదనయంతర్యామి దా మరచి పలువేల్పులఁ గొలువంగనేల ।
విడువక శ్రీపతినామమంత్రమే వేడుకఁదలంచంగ దలంచంగను ।
చెడకుండా నతండు పావనముసేసినప్పుడే సేసెగాక ॥

కర్మము నతండే కార్యము నతండే కడంగిన శ్రీవేంకటవిభుండు ।
నిర్మించినట్లానిన్నియు నరసెందను జానామలేలు ।
ధర్మంబితనికి యేకాలంబును దాసులరక్షించేబిరుదు ।
అర్మిలి యితనిఁగొలిచినవారలకు నందనిపదవులు నందెగాక ॥ ౧౫౭

గుజ్జరి.

పల్లవి

యేమిసేయుదును నేనేమిసేయుదును ।
స్వామిద్రోహమేజరగిని ॥

(చరణములు)

నీయాధీనమై సాగినజగన్మాత్మను ।
నీయందె బుద్ధినిలుపదు ।
కాయపుటింద్రియ కల్పితదేహము ।
కాయపువిషయాలే కదుఁగోరిని ॥

నీసంకల్పమున నెగడినజగమిది ।
నీసేవారతి సేరదు ।
ఆసల నీమాయ నంటిన మనసిది ।
ఆసలాసలనే అలసిని ॥

హరినీవె నాలోన నణచినజ్ఞానము ।
హరినీవెచూపక అందదు ।
సిరుల నాపాలిటి శ్రీవేంకటేశ్వర ।
కరుణానిధి నన్నుఁగావవే ॥ ౧౫౮

## అధ్యాత్మ సంకీర్తనలు

### శంకరాభరణం.

పల్లవి

యిందునందు కానవచ్చెనెంతైన పగలదు ।
చిందరవందరగాక చేరికోనరాదా ॥

(చరణము)

దేవునిం గొలుచువాడు దేవునికోరగాక ।
యీవలనంసారుల కేమి భ్రాంతి ।
కావరపు మనుజులకని కొలిచేవారికి ।
దైవికము విచారించ తలంపున్నదా ॥
పరముగోరెడివాడు పరమునకే కోరగా ।
కెరవై యింద్రియముల కేమి భ్రాంతి ।
వారసి భోగములలో నోలలాడేవానికి ।
అరిది మోక్షసుఖము లాసపడనున్నదా ॥
పనిగొన్న భక్తి వాడు భక్తికి కోరగాక ।
మొనసి కర్మవిధుల కేమి భ్రాంతి ।
మని శ్రీవేంకటేశు మాయయంబెక్కసవానికి ।
తనిసి భవబంధములదాటంగ జోటున్నదా ॥ ౧౫

### శంకరాభరణం.

పల్లవి

మొఱుగుకోలేనిజీవి మొడ్డగాక ।
గుటిసెంతయినా గొంతికొమ్మదప్పించాకునా ।

(చరణము)

దగ్గరనుండినవారు దలపించుగాని పొంది ।
తగ్గి దవ్వులజ్ఞానము తడవనీదు ।
కగ్గులేక గుల్లగుల్లకాక పొదిరాడుపురా ।
అగ్గమై తపుపారిండి కడజాలకేల ॥

మక్కువభోగములనే మరిగించుగాని మేను ।
అక్కజపు వైరాగ్యమందనియ్యదు ।
చిక్కి విత్తొకటివెట్ట చెట్టొకటిమొలచునా ।
అక్కరచానిపిలవిలడుగనేమున్నది ॥

శ్రీవేంకటేశుపంపున చిక్కించుగాని కర్మము ।
దావతి ఆతనియాజ్ఞ దాటనియ్యదు ।
బాధింప కాయపండే తాపండు కాయయేగాను ।
వావిరిముట్టికి మరివాడివెట్టవలెనా ॥ ౧౬౦

భూపాళం.

**పల్లవి**

వట్టిలంపటము వదలనేరదుగాన ।
పుట్టించిన హరి బుద్ధిలోనేకాడా ॥

**(చరణము)**

దేహాభిమానము తెగవిడిచినంగాని ।
యీ హాలదేవుండు తన్నేలమెచ్చును ।
సాహసించి కోరికలసంగము మానకుండా ।
వోహో పరమపద మూరకేలకలుగు ॥

నిచ్చలును వైరాగ్యనిష్ఠుండుగాకుండితేను ।
మెచ్చినజన్మాదులెల్ల వేలగడచు ।
కొచ్చికొచ్చి తనలోనికోపముదుగకుండితే ।
అచ్చపుబ్రహ్మానందు మదియేలకలుగు ॥

శ్రీవేంకటాద్రిమీది శ్రీపతింగొల్వకుండితే ।
నావల నాదేవుండిట్టె సులభుండవునా ।
భావించితనలోని భక్తినిలుపకుండితే ।
తావులన్నిటను సంతతపుణ్యుండవునా ॥ ౧౬౧

## అధ్యాత్మ సంకీర్తనలు

### సాళంగనాట.

పల్లవి

యీతనికెదురులేరు యెక్కడచూచిననిదె ।
చేతన ప్రతాపముతో చెలరేగెనితండు ॥

(చరణము)

దిక్కులుసాధించుటకు దేవదేవో త్తముండదె ।
యెక్కెనుతేరుమీద హెచ్చరికతో ।
చక్కడిదనుజులను సమరములుగెలిచి ।
యిక్కవతో వీధివీధినేగి నీవిదిగో ॥

సకలాయుధములును జక్రము చేతులంబట్టి ।
వెకలియై శంఖము వెరగిసాదించె ।
వికలులై రాక్షసులు లింగిలొంగి హతులై రి ।
అకలంకుడీహరి అన్నిటను మించెను ॥

విజయధ్వజమున దేవుండే శ్రీవేంకటేశుండు ।
భజన నలమేలుమంగ పలుమారుమెచ్చెనదే ।
త్రిజగములు నితండె దిక్కై కాచినది ।
గజబిజలింక నుడుగ్గరో రాక్షసులు ॥ ౧౮-౨

### మలహరి.

పల్లవి

వాదములేటికి వలసినవారికి ।
వేదముగలుగంగ లెల్లవిరాయు ॥

(చరణము)

దైవంబొక్కడే తత్వజ్ఞానికి ।
భావింప బలువురు భ్రాంతునికి ।
వేవేలకుమరివిత్తువొక్కటే అవి ।
కావంగ బూవంగ ఘనమైనట్లు ॥

భువిసాకారము పూర్ణజ్ఞానికి ।
అవలనిరవయవ మధమునికి ।
అవలగలిగిన అష్టప్రశ్రములును ।
భవములు శ్రీహరిపాలనేకలిగె ॥

శరణాగతియే శాస్త్రజ్ఞానికి ।
సర్వాంగవహామే జడునికిని ।
నిరతి శ్రీవేంకటనిలయు మాయలివి ।
యెరవెఱుంగువారి కిహామేపరము ॥ ౧౬౩

బౌళి.

పల్లవి

అనుచు రావణుసేనలటు భ్రమయుచువీగె ।
యినకులచంద్ర నేడిదిగో నీమహిమ ॥

(చరణాలు)

దదదద దదదద దశరథతనయా ।
కదిశితింగకకకకావలె ।
అదేవచ్చెబాణాలు హానాథహానాథ ।
పదపద పదపద పారరోషపుంజులు ॥

మమమమ్మ మమమమ్మ మన్నించుడు కపులార ।
సమరాన చచచచ్చ చావకుండా ।
మెమెమెమ్మె మెమెమెమ్మె మేమునీవారమే ।
మొమొమొమ్మొ మొమొమొమ్మొ మ్రొక్కేముమీకు ॥

తెతెతెత్తె తెతెతెత్తె తెరువేది అంకెకు ।
తతతత్త తలమనిదాగుదురు ।
గతియైన శ్రీవేంకటగిరి రఘునాథ ।
సతమై మమ్మింకనేలు జయజయనీకు ॥ ౧౬౪

## బౌళి

**పల్లవి**

విదురునివిందా విజయీభవ ।
హృదయేశ్వర విజయీభవ ॥

(చరణము)

దైవశిఖామణి దానవమర్దన ।
వేవేలకునీకు విజయీభవ ।
శ్రీవల్లభ గుణ చింతసాగర ।
యీవలనిదే విజయీభవ ॥
జగదేకవిభుండ శతముఖవందిత ।
వెగటువిజయముల విజయీభవ ।
నిగమవినుత సర్వనిలయ నారాయణ ।
యిగిరించె కృప విజయీభవ ॥
జలధిమథన సర్వజంతువిహారక ।
వెలసె నీమహిమలు విజయీభవ ।
కలితశ్రీవేంకట కామితవరదనిత్య ।
యిలధరనీకు విజయీభవ ॥ ౧౩ ౫

## సాళంగనాట.

**పల్లవి**

నమామ్యహం మానవసింహం ।
ప్రమదాంకమహోబల నరసింహం ॥

(చరణము)

దానవదైత్య విదారణసింహం ।
నానాయుధకర నరసింహం ।
భూనభోంతరాళపూరితసింహం ।
ఆననవహ్నిలతాంతకసింహం ॥

ప్రళయనృసింహాం బహుముఖసింహాం ।
సలలితగరుడాచలసింహాం ।
కులిశనఖరముఖ ఘోషితసింహాం ।
తిలకితబహురవి దీపితసింహాం ॥

శాంతనృసింహాం శౌర్యనృసింహాం ।
సంతతకరుణాజయసింహాం ।
కాంత శ్రీవేంకటగిరిసింహాం ।
చింతితఘనసంసిద్ధి నృసింహాం ॥ ౧౩౬

భూపాళం.

పల్లవి

హరివిశ్వాత్మకుండు అందరిలో నున్నవాడు ।
దర్శించి బ్రదుకరో తప్పులేదు యింకను ॥

(చరణము)

దారుపాషాణములందు దైవముగాభావించి ।
కూరిమితో మీకు మీకె కొలిచేవారా ।
చేరి ప్రాణప్రతిష్టలుసేసేనాడుదేవుండే ।
కోరిక వైష్ణవులందు కొలువరో మీరు ॥

వేదపురాణార్థమందు విశ్వాసము వెట్టుకొని ।
సోదించి తెలుసుకొనే సుగుణులార ।
వేదమే మాటలుగాను వివరించె వైష్ణవులు ।
ఆదిగురువులు వీరినడుగరో మీరు ॥

దేవుండే పెక్కురూపులై తేరి యెదుటనున్నడగా ।
ఆవల వెదకఁబోయ్యే ఆసక్తులార ।
శ్రీవేంకటేశుండే మతించిక్కినాడు దాసులకు ।
తావుకొని హరినాత్మం దలంచరో మీరు ॥ ౧౩౭

శంకరాభరణం.

పల్లవి

తమవుద్యోగములేల తమకములేల ।
సముడై పుణ్యపాపాలు సాధించనేరడా ॥

(చరణాలు)

పుట్టించనేర్చినహరి పూచిరక్షింపనేరడా ।
వట్టిచింతతో జీవులు వగవనేల ।
జట్టిగొని పదునాల్గు జగములేలెడివాడు ।
గట్టిగానందరిఁ దానే కావనేరడా ॥
అంతరాత్మైనవాడు అన్నియుఁ దానేరడా ।
వింతలుగా వేరె విన్నవించనేల ।
సంతతమై గుణములు జవకట్టినట్టివాడు ।
కొండనేప్పునేరాలుకోరి దిద్దనేరడా ॥
యేలికై దాసులనెల్ల యేలనేర్చినవాడు ।
యీలీలసంపదలెల్ల యియ్యనేరడా ।
పాలించి శ్రీవేంకటాద్రి ప్రత్యక్షమయినవాడు ।
సోలిం దన మహిమలు చూపనేరడా ॥ ౧౪౫

రామక్రియ.

పల్లవి

చేతులెత్తి మ్రొక్కరో జీవకోట్లారయిదె ।
యీ తలాతల నిండిరిదే నారదాదులు ॥

(చరణము)

దిక్కులు సాధించ హరి తిరుతేరెక్కగాను ।
యిక్కడ రతికెక్కిరి యింద్రాదులు ।
వెక్కసపుశార్ఙ్గము వెనుచేతం బట్టగాను ।
పక్కన గుండెవట్టిరి బ్రహ్మాదులు ॥

ఎడమచేత శంఖమెత్తినప్పుడు వేదము ।
కడంగి మొదలెత్తిరి గౌతమాదులు ।
కుడిచేతి చక్రము గ్రక్కున మెఱిపించగాను ।
సుడిశియు మెరసేరు సూర్యచంద్రాదులు ॥
లలి శ్రీవేంకటేశుం డలమేలుమంగయు బెండ్లి ।
నలరంగ సమరిరి అమరాదులు ।
వెలయ నితడింతట విశ్వరూపము చూపంగ ।
సలిగెం బొడసూపిరి సనకాదులు ॥ ౧౫౯

భూపాళం.

పల్లవి

నీదాకవలెనా నిఖిలమువారికెల్ల ।
ఆదిఁ నీదాసుండే చాలు నందరిరక్షించ ॥

(చరణము)

నీపాదమూలముల నిలిచినజలములు ।
మోపుగా మోచే రుద్రుండు ముందుముందె ।
కాపాడ నీనామమునం గలిగిన మహిమచే ।
పైపై మునులు యిహపరములు గనిరి ॥
పండేటి పాలవెల్లిని ప్రసాదమున గాదె ।
దండిగా దేవతలెల్ల ధన్యులైరి ।
అండనే నీ సాకార మాత్మందలంచికాదె ।
నిండిన యోగీంద్రులు నిత్యముక్తులైరి ॥
చేరి నీవిహారమైన శ్రీవేంకటాద్రిగాదె ।
కోరివరము లందరు కొల్లగొనిరి ।
ఆరీతి దాళ్ళపాక అన్నమయ్య ఘనుండాయె ।
వారివారమైనమేము వహికెక్కితిమి ॥ ౧౬౦

గుజరి.

పల్లవి

కరుణానిధివిగాగ కాచేవుగాక ।
యెరవై నావంటివానికిది యసంగతము ॥

(చరణము)

నేరనేపుణ్యమునేయ నిత్యానిత్య మెరింగి ।
నేరుతు రిత్తచేతుల నీకుమ్రొక్కెడి ।
యేరీతి బరమిచ్చేవో యేమిగలదు నాయందు ।
కారణములేనియీవి కడుననంగతము ॥

లేదు విజ్ఞానము గొంతలేశమైన నాయందు ।
సాదించగద్దో గట్టు మీశరణనేది ।
అదిగాని నన్ను బాయరంతరాత్మవై నీవు ।
విదరవెల్లి పొందులు విన ననంగతము ॥

కాను నే నర్హుండను కదిశి పనులకు ।
నేనవుడునో గటికినిన్ను బాడను ।
యీనెపాన శ్రీవేంకటేశ నన్ను నేలితివి ।
దానిక్రింద కంతేకాక దాటనసంగతము ॥ ౧౭౧

శంకరాభరణం.

పల్లవి

యిదియె నాకుమత మిదివ్రతము ।
నుదుట కర్మ్మము నొల్లనింకను ॥

(చరణము)

నిపుణత మాఱినే నినుశరణనుటే ।
తపములు జపములు ధర్మములు ।
నెపమున సకలము నీవె చేకొనుము ।
వుపమల పుణ్యములొల్లనే యింకను ॥

హరి నీదాసుండ ననుకొనుటేనా ।
పరమును ఇహమును భాగ్యమును ।
ధర నీమాయల తప్పు దెలిపుటను ।
వొరగిన సుకృతము వెల్లనే యింకను ॥

నారాయణుని నామముదలచుటే ।
సారపు జదువులు శాస్త్రములు ।
యీరీతి శ్రీవేంకటేశ నినుగొలిచితి ।
వూరకె యుతరములెల్ల నేయింకను ॥ ౧౭౨

సామంతం.

పల్లవి

అచ్చముగా శ్రీహరికింక అడ్డమాడ వెరతు ।
తెచ్చినన్ను దిద్దుకొమ్ము దేవుండవునీవు ॥

(చరణము)

సిరుసులెంచె వంటే నేనా నీకెదురు ।
కరుణించి నొకరీతి గాతువుగాక ।
వోరగంట బంగారు వోరతురుగాని మరి ।
సరిగాc బెంకొరసితే సాటివచ్చునా ॥

మనసు సోదించెనంటె మంచివాడనా నేను ।
ఘనుండవు నీవు నన్ను గాతువుగాక ।
పనికి వజ్రము సానబట్టితె మించెగాక ।
పెనుబిడుకరాచితే పిప్పిగట్టదా ॥

మొక్కగా రక్షించనంటే మొదల పుణ్యానినా ।
గక్కున శ్రీవేంకటేశ కాతువుగాక ।
నిక్కి అద్దము దోమితె నీడగానవచ్చుగాక ।
ముక్కమూకుడు దోమితె మొగముగానవచ్చునా ॥ ౧౭౩

బౌళి.

పల్లవి

మత్స్య కూర్మ వరాహ మనుష్యసింహ వామనా ।
యిచ్చ రామ రామ రామ హితబుద్ధికలికి ॥

(చరణము)

సన్నుగాను కేశవా నారాయణ మాధవ ।
వన్నెంచు గోవింద విష్ణు మధుసూదన ।
వన్నెల త్రివిక్రమా వామనా శ్రీధరా ।
సన్నుతించె హృషీకేశ సారెకు పద్మనాభ ॥
కంటిమి దామోదర సంకర్షణ వాసుదేవ ।
అంబుజాలు ప్రద్యుమ్నుండా అనిరుద్ధుండా ।
తోటి పురుషోత్తమ అధోక్షజ నారసింహామా ।
జంటవాయమిక మచ్యుత జనార్దన ॥
మ్రొక్కేము వుపేంద్ర హరిమోహన శ్రీకృష్ణరాయ ।
మొక్కితి శ్రీవేంకట మిందిరానాథ ।
యిక్కువ నీ నామములు యివియే నాజపములు ।
చక్కగా నీ దాసులము సర్వేశ అనంత ॥ ౧౭౪

బౌళి.

పల్లవి

శంఖము నీవుసాక్షి చక్రము నీవుసాక్షి ।
వంశలాడభుజములు వ్రాసుకొంటిమిమ్మును ॥

(చరణము)

నారాయణాయని యనుంటే నరకములుం త్తరించితి ।
శ్రీరామా అని పొందితి జీవన్ముక్తి ।
దూరించితి గోవిందాయని తోలితి పాపములెల్ల ।
ధీరుండనై యికెల్ల దిద్దుకొంటినిదిగో ॥

దామోదరా అని తొల్లి దాటితి దుఃఖములెల్ల ।
వామనా అని కర్మములు వంగ ద్రొక్కితి ।
భూమిరమణాయని పుట్టుగులు గెలిచితి ।
వేమరు నితరులకు వెరవనేనింకను ॥

హరియచ్యుతాయని ఆపదల నణంచితి ।
పురుషోత్తమాయని పుణ్యములెల్ల మీరితి ।
అరుదైన శ్రీవేంకటేశయని లోకముల మించితి ।
తొరలి సంసారపుదూరు చక్కబెట్టితి ॥ ౧౭౫

## దేశాక్షి.

### పల్లవి

శరణాగతుండను విచారమినవలెనా నన్ను ।
నిర్హేతుకాన గావ నేరవా యేమి ॥

### (చరణము)

నన్ను నొక జంతువు నున్న తింగాచుటకుగా ।
వన్నినట్టు కర్మముల బారిం దోయవలెనా ।
మన్నన లక్ష్మీపతివి మహియెల్ల నేలేవు ।
వెన్నుండ నన్నుఁ గావంగాయేమి ॥

పుట్టించినయట్టి నీవు పూరిమేపవెప్పుడును ।
కట్టడి షరులంజూపి కాకుసేయువలెనా ।
అట్టి బ్రహ్మాం గన్నతండ్రివదె లోకములు కుక్షిం ।
బెట్టుకున్నాడవు నన్ను బెనువవానీవు ॥

అపరాధినైతింబో నీవన్నిట నన్నేలితివి ।
చపలపుటానలలో సరిబెట్టవలెనా ।
యిప్పుడు శ్రీవేంకటేశ యిన్నిటా నన్నేలితివి ।
కపురైనమా నుతులు ఘనముగాదయ్యా ॥ ౧౭౬

ఆహిరి.

పల్లవి

పారకుమీ వోమనసా పంతమువిడువకుమీ మనసా।
పారిన నీవెబడగమ్యేదవు చేరువనాడెచెప్పనే మనసా॥

(చరణము)

చింతించకుమీ శివునివై రిచే చిక్కువడకుమి వోమనసా।
కంతువారకము వయసుబ్రాయములు కావటికుండలు వోమనసా।
యెంతే మేలుగీడె కాలము యెప్పుడు నుండదు వోమనసా।
నంతరించుకోవాని నీమనసున సంతోషముగా వోమనసా॥

యెన్నికలే తలపోయకుమీ యేమరకుండుమి వోమనసా।
కన్నవిన్నవారిలో నెపుడు కాకుపడకుమీ వోమనసా।
పున్నమమాసలు పుడమిలో బ్రదుకులు పోయివచ్చేవి వోమనసా।
మిన్నోనేలని మన్నదినములో మీదుచూడకుమి వోమనసా॥

కన్నులసంగాతము సేయకుమీ కళవళించకుమి వోమనసా।
వన్నెలమాటలు చెవులబెట్టక వాశివిడువకుమి వోమనసా।
మున్నిటసురలు బ్రహ్మాదులకైనను ముక్తిసాధనము వోమనసా।
వెన్నుని వేంకటపతిఁదలంచుము వేసారకుమీ వోమనసా॥ ౧౭౭

ముఖారి.

పల్లవి

యేల పొరలేవు లేవే యింతలోని పనికి।
మూలయింటి తోలుకప్పు మాయలిటువంటివి॥

(చరణము)

చిక్కులతమకముల చీకటిగప్పిననాడు।
యెక్కువవాసనలా హేయపుమేను।
వెక్కసపు బ్రియమది విరిగితే రోతలా
లక్కపూత కపురులీలాగు లిటుఃవంటివి॥

మించిన చిత్తములో మేలుగలిగిననాడు ।
యెంచరానిచవులా సెంగిలిమోవి ।
పెంచుకంటె కష్టమా ప్రియముదీరిననాడు ।
చంచలపు చిత్తముల చందమిటువంటిది ॥
వెల్లిగొను సురతపువేళ మరపులయింపు ।
కొల్లలాడుటా కొనగోరితాకులు ।
నలితిండిమరిమీద నలగితే రోతలా ।
వుల్లమిచ్చే వేంకటేశు వొద్దికిటువంటిది ॥ ౧౭౮

ముఖారి.

పల్లవి

దొట్టుదరించెనిది యీజీవుండు ।
బట్టబయలుగా బరచె నొకటి ॥

(చరణము)

చెడనిమట్టిలో జేసినముద్దె ।
వడువువుంచుకొన్నది వొకటి ।
తడియని నీరై తడివొడమింపుచు ।
వడిసిని వేవురవడితో నొకటి ॥

వాయనితనువీపనములుగానటు ।
చేయుచు మదివేచెనొకటి ।
కాయపు చుట్టరికమ్ములు చేయుచు ।
రేయుంబగలు విహరించె నొకటి ॥

రూపన్ని యుదానే యొంచి కపటములు
పన్ని నిదే లోపలినొకటి ।
వెన్నెల చూపుల వేంకటేశనిమ్ము ।
యెన్నికతో గదు నదిరె నొకటి ॥ ౧౭౯

ముఖారి.

పల్లవి

బ్రహ్మగడిగిన పాదము ।
బ్రహ్మముదానె నీపాదము ॥

(చరణము)

చెలంగి వసుధ గొలిచినదీపాదము ।
బలితల మోపిన పాదము ।
తలంకక గగనము దన్నినపాదము ।
బలరిపు గాచినపాదము ॥

కామిని పాపము గడిగినపాదము ।
పాముతల నిడినపాదము ।
ప్రేమపు శ్రీసతి పిసికేటిపాదము ।
పామిడి తురగపుబాదము ॥

పరమ యోగులకు బరిపరివిధముల ।
పరమొసంగెడి నీపాదము ।
తిరువేంకటగిరి తిరమనిచూపిన ।
పరమపదము నీపాదము ॥ ౧౫౦

అవతారాలు.

సామంతం.

పల్లవి

తానకాకెవ్వరు మాకు దాతయు దైవము తన ।
లోనబెట్టుకొని మాకులోనైనవాడు ॥

(చరణము)

చదివించి కూడవెట్టి జారకుండ నిల్లుగట్టి ।
బెదరులేని బుద్ధి పిన్ననాడేచెప్పి ।
యెదిరినడిగి ద్రవ్యమిదిగొమ్మనుచునిచ్చి
పదిలమై తమ్ముం బాలించువాడు ॥

మోహ వియోగము మోహానురాగము ।
దేహ విభాగంబు దెలిసిన కలికి ।
ఐహికము వేంకటాధీశుండై సర్వ ।
దేహరక్షకుండై తిరుగుచున్నాడు ॥ ౧౮౧

బౌళి

పల్లవి

చెదఱకవెలుగే చేను మేయుంగ జొచ్చె ।
అదలించి తగదనికను వారు వెట్టె ॥

(చరణము)

చిత్త మింద్రియములచే జిక్కె గదు ।
మదమెత్తిన వద్దన నింక వెట్టె ।
హత్తినమనసు మోహాదులతో గూడె ।
తత్తరించిన మాన్పందగు వారు వెట్టె ॥
జీవుండిన్నిటికిం దాఁజిక్కి పోయినత్రోవం ।
బోవంజొచ్చినబుద్ధి పాలమేటి ।
శ్రీవేంకటేశుని చింతాపరతంగాని ।
కావంగ నాత్మకు గతిదానేది ॥ ౧౮౨

కన్నడగౌళ.

పల్లవి

పోయె గాలం బడమికింగాయువెన్నాలల కరణి ।
శ్రీయుతుం దలంచుడి నరులు మాయంబడి చెడక ॥

(చరణము)

చిత్తము చేకూడ్చుకొని చిత్తైకాగ్రతను ।
చిత్తజ గురునిఁ దలంచుడి చిత్తజుంజొరనీక ॥

బూరుగుమ్రాకునం జెందిన కీరము చందమున ।
అరయ నిప్పలముగు పురియన్యులంజేరినను ॥
కూరిమి మా తిరువేంకటగిరి గురు శ్రీపాదములు ।
చేరినవారికి భవములు చెంద నెప్పుడు నటుగాన ॥ ౧౮౩

పాడి.

పల్లవి

యేటికి నెవ్వరిపొందు యిచ్చిరో ఛీ ఛీ ।
నాటకములారా ఛీ ఛీ నమ్మితిగా మిమ్మును ॥

(చరణము)

జవ్వనమదము ఛీ ఛీ చక్కందనమురో ఛీ ఛీ ।
రవ్వైన రాజస గర్వమురో ఛీ ఛీ ।
క్రొవ్వినమదము ఛీ ఛీ కూరిమి యూవరో ఛీ ఛీ ।
నవ్వులదేహము ఛీ ఛీ నమ్మితిగా మిమ్మును ॥
ముచ్చట మమత ఛీ ఛీ ముచ్చు మురిపెము ఛీ ఛీ ।
బచ్చుపణములని బచ్చన ఛీ ఛీ ।
తెచ్చుకోలు తాలిముల దిట్టతనమురో ఛీ ఛీ ।
పుచ్చిన పోకరో ఛీ ఛీ పోయెగా మీకాలము ॥
సిరుల చీకటి ఛీ ఛీ సిలుగు సంపద ఛీ ఛీ ।
వరవిభవమ ఛీ ఛీ వాసిరో ఛీ ఛీ ।
కరుణించె తిరువేంకటగిరిపతి నన్ను ।
విరసవర్తన ఛీ ఛీ వీడెగా మీభారము ॥ ౧౮౪

సామంతం.

పల్లవి

మనుజుండై పుట్టి మనుజుని సేవించి ।
అనుదినమును దుఃఖమందనేల ॥

(చరణము)

పట్టెడు గడుపుకై చొరని-చోట్లుచొచ్చి
పట్టెడుగూటికై బ్రతిమాలి ।
పుట్టిన-చోటికే పొరలి మనసు బెట్టి ।
వట్టి లంపటము వదలనేరడుగాన ॥

అందరిలో బుట్టి అందరిలో జేరి ।
గద్దరి రూపములటుదానై ।
అందమైన వేంకటాద్రీశు జపించి ।
అందరాని పదమందె నటుగాన ॥ ౧౮౫

నాట.

పల్లవి

లంకెలూడుటే లాభము యీ ।
కింకరులను నలంగెడికంటెను ॥

(చరణము)

జంపులంజంపక నరగునంబాసేటి ।
లంపటమేపో లాభము ।
కంపమూపుతో గనలి శరీరపు ।
కొంపలోన వేగుటకంటెను ॥

యీవల నావల నెంచేటి యాసల ।
లావుదిగుటేపో లాభము ।
యేవగింతలకు నిరవగు నరకపు ।
కొలువులంబడి మునుంగుట కంటెను ॥

తివిరి వేంకటాధిపు దాసులకృప ।
లవలేశమేపో లాభము ।
చవులని నోరికి సకలముందినితిని ।
శవరూపంబులం బడుటకంటెను ॥ ౧౮౬

నాట.

తనకేడ చదువులు తనకేడ శాస్త్రాలు ।
మనసు చంచలబుద్ధి మానినా ॥

(చరణము)

జడ్డు మానవుండు చదువం జదువనాస ।
వడ్డివారుగాక వదలెనా ।
గుడ్డికుక్క సంతకుబోయి తిరిగిన ।
దుడ్డుపిట్టకాక దొరకెనా ॥

దైవదూషకుండై తిరిగేటివానికి ।
దైవతంత్రము తెలిసెనా ।
శ్రీవేంకటేశ్వరు సేవాపరుండుగాక ।
పావనమతియై పరగెనా ॥ ౧౫౭

భైరవి.

పల్లవి

నడిం బెట్ట కటకటా సంసారము ।
చూడ జలధిలోపలియీఁత సంసారము ॥

(చరణము)

జెముడోరిలో బ్రదుకు సంసారము చూడ ।
చమురు దీసిన దివ్వె సంసారము ।
సమయించు వెనుదేవులు సంసారముచూడ ।
సమరంబులో నునికి సంసారము ॥

నంటిగట్టిన త్రాడు సంసారముచూడ ।
నంటికంతల త్రోవ సంసారము ।
చంద్రుని జీవనము సంసారము చూడ ।
చందమేవలెనుండు సంసారము ॥

చలువలోపలివెండి సంసారముచూడ ।
జలపూత బంగారు సంసారము ।
యిలలోనఁ దిరువేంకటేశ నీదాసులకు ।
చలువలకుంగడుఁ జలువ సంసారము ॥ ౧౮౮

## ధన్యాసి.

పల్లవి

సామాన్యమా పూర్వసంగ్రహంబగుఫలము ।
నేమమునం బెనగొనిరా నేఁడు నీవనక ॥

(చరణము)

జగతిం బ్రాణులకెల్ల సంసార బంధంబు ।
తగులఁబంధించు దురితంపు గర్వమున ।
మగుడ మారుకు మారు మగువ నీవురముపై ।
తెగికట్టరెవ్వరో దేవుండవనక ॥

పనిలేక జీవులను భవసాగరంబులో ।
మునుంగ లేవంగ జేయు మోహదోషమున ।
పనివూని జలధిలో బండకట్టించినిన్ను ।
వెనకెవ్వరో వెడలి వెలువలనక ॥

వుండనియ్యక జీవనోపాయమున మమ్ము ।
గొండలను గొబలతతిఁగొని త్రిప్పుఫలము ।
కొండలను నెలకొన్న కోనేటిపతివనంగ ।
నుండవలెను నీకు నోపలేనవక ॥ ౧౮౯

దేవగాంధారి.

పల్లవి

యెందరివెంట నెట్లుదిరుగవచ్చు ।
కందువెఱిగి చీకటిదవ్వుకొనుగాక ॥

(చరణము)

తలరాయిగాగ నెందరికి మ్రొక్కీని ।
తెలివిమాలినయట్టి దేహి ।
కొలదిమీరిన దేవకోట్లు దనలోన ।
కలవాని నొక్కనినే కొలుచుగాక ॥

కాలిచపడంగ నెక్కడికినేగెడిని ।
పాలుమారినయట్టి ప్రాణి ।
మేలిమిజగములు మేనిలో గలవాడు ।
పాలిటివాడై ప్రణుతికెక్కుగాక ॥

నూరేండ్ల నెందరిని నుతియింపగలవాడు ।
చేర దావులేనిజీవి ।
శ్రీరమణేశుండు శ్రీవేంకటేశుని ।
కోరికెందలంచి నుతి కొల్లగొనుటగాక ॥ ౧౬౦

శ్రీరాగం.

పల్లవి

వెన్నవట్టుక నేయి వెదుకనేలా మరియు ।
నన్ని వలసినను దమతొలిటివే కావా ॥

(చరణము)

తలంపునకు విష్ణుచింతన నియమమాత్రంబు ।
కలుగుచే కలుగువలెగాక ।
వలనైన భోగములు వైభవంబులు మరియు ।
కలవెల్ల తమయెదుట గలిగినవె కావా ॥

పదిలముగ హరినామ పఠనమంత్రమునోరు ।
కదియుటే కలుగవలెగాకా ।
తుదలేని సంపదలు తొలగని మదంబులును ।
కదలకెప్పుడు దమకు గలిగినవేకాక ॥

యించుకై నను వేంకటేశుగిరి శిఖరంబు ।
కాచుటే కలుగవలెగాకా ।
అంచితంబైన నిత్యానంద పదవులును ।
మించి తమయెదుట బ్రభవించినవేకావా ౧౯ ౧

ముఖారి.

పల్లవి

పసలేని యీ బ్రదుకు ।
అసలు చొచ్చిచొచ్చి అలసినట్లాయె ॥

(చరణము)

తొల్లిటి జన్మాదులగాని నరరూపు ।
పల్లించుకొన్న యీ బ్రదుకు ।
కల్లసుఖములచే కనలి కమ్మర ।
ముల్లుదీసి కొఱ్ఱుమొత్తినట్లాయె ॥

బూటకములనెల్ల బొరలిసంసారంబు ।
పాటుదెచ్చిన యీబ్రదుకు ।
నీటుగ నెద్దుదన్నిన నీగుఱ్ఱము ।
చాటుకేగినయట్టి చందమాయె ॥

పగగొన్న పొగరొపక మంటఁ బడిపడి ।
పగలు రేలైన యీ బ్రదుకు ।
తగువేంకటేశ్వరు దలంచి నేలనుండి ।
యెగసి మేడమీది కేగినట్లాయె ॥ ౧౯.౨

## అధ్యాత్మ సంకీర్తనలు

ముఖారి.

పల్లవి

ఎంత మానుమన్నఁ జింతలేల మానునే ।
వంతపు మనసు హరిపై నుంచేగాక ॥

(చరణము)

తీరని బంధాలు నెడతెగమంటే నేలతెగుఁ ।
భారపు మమతం బెడబాసినగాక ।
వూరటగా మమత నే నొల్లనంటే నేలమాను ।
ఓరుపుతో లంపటము లొల్లకుంటేగాక ॥

వెంకపుంగోపము నేడవిడుమంటే నేలవిడు ।
తోకచిచ్చైన యేసందుంచినంగాక ।
ఆకట నాకేలమాను అన్నిటను యిందరికి ।
మాకుపడి తత్తరము మఱచుటేగాక ॥

పెట్టనిది దైవమిటే పెట్టుమంటే నేలపెట్టు ।
యిట్టే వేంకటపతి యిచ్చినంగాక ।
యిట్టునట్టు నితండు దానిందరికి నేలయిచ్చు ।
వొట్టిన విరక్తినేమినొల్లకుంటేగాక ॥ ౧౯3

సామంతం.

పల్లవి

చాలదా హరిసంకీర్తనంగల ।
మేలిది దీననే మెఱసిరి ఘనులు ।

(చరణము)

తలంప వేదశాస్త్రములుగానక ।
అలయుచు వాల్మీకాదులు ।
తలకొని హరిమంత్ర మెలగ చేకొని ।
అలవిమీరగదు సధికములైరి ॥

యితర దైవముల నెఱుంగనేరక ।
ప్రతిలేని మహిమం బాత్మవి ।
మతిందలంపుచు హరిమంత్రమే కైకొని ।
సతతము హరితోసంగమైనిలిచి ॥

చదువులు బలుమరు జదువనోపక ।
అదిగో నారదాదులు ।
పదిలపు వేంకటపతి హరి నామమే ।
వదలకిదియె జీవనమనిరి ॥ ౧౯౪

## సామంతం.

పల్లవి

పోయెంబోయెంగాలమెల్ల పూటపూటకు ।
చేయినోరునోడాయె చెల్లంబోయీరోతలు ॥

(చరణము)

తిప్పన తొప్పన కేతన దేవన బాపన గన్న ।
పప్పన బొప్పన గాది బాడిపాడి ।
కుప్పలు దెప్పలునైన కోరికెలు మతిలోన ।
యెప్పుడు బాయకపోయె నన్నిలేవు రోతలు ॥

కాచనపోచన మాచు కల్లపబొల్లపమల్లు ।
బాచనదేచనగారి బాడిపాడి ।
యేచిన పరసుఖము నిహమును లేకపోయె ।
చీ చీ విరిగితిమి చెప్పనేలరోతలు ॥

బుక్కనతిక్కనచెల్లు బ్రాహ్మవకొత్తువపెద్ది ।
బక్కల నిందరినోళ్ళ బాడిపాడి ।
యెక్కుడైన తిరువేంకటేశుని దలంచలేక ।
కుక్కకాటుఁ జెప్పుటాయె కూడె నిన్నిరోతలు ॥ ౧౯౫

సాళంగనాట.

పల్లవి

పటుసిద్ధ ప్రతిపాలకుండవనగ ।
ఘటన నక్షలములను గాతువుగా ॥

(చరణము)

తుత్తుమురుగ దైత్యులదనుజాలనని ।
మొత్తిమోది చలముసం చెలంగి ।
జొత్తు పాపలుగ సొరిది విరోధుల ।
నెత్తురు వడుతువు నీవేకా ॥

తళతళ మెఱచు సుదర్శనాయుధం ।
బలరుచు నొకచే నమరంగను ।
బలుదైత్యులదొబ్బలుఁ బేగులునని ।
నిలువునఁ జెండుదు నీవేకా ॥

దిట్టవు సూత్రవతీపతి వసురలం ।
జట్టలు చీరంగఁ జతురుండవు ।
రట్టడి వేంకటరమణుని కొలిచి ।
పట్టపు సేనాపతి వటకా ॥ ౧౯౬

దేశాక్షి.

పల్లవి

ప్రాయంబోయెఁ గాలమెల్ల పూటపూటకు ।
రోయని రోతలుచూచి రుచిచూరంబోరు ॥

(చరణము)

తోడందోడ నెందాకఁ దోయుదప్పుడు ।
కాడువడ్డ చిత్తమిది కలకాలమునొట్టు ।
అడికకులోనై తనియదపోదు ॥

మున్ను దినియేటి దూడ మానుమంటా మెత్తిమెత్తి ।
కన్నుగట్టి యెండాకఁ గాయువచ్చును ।
సన్నపుటాసలమీఁది చరింబడ్డ దేహమిది ।
కన్నపు గత్తులచూపు కట్టరాకపోయె ॥
హేమము దొక్కకుమన్న యేచితి నేననేవాడు ।
చాయకురాకున్న నేమిచేయవచ్చును ।
మాయల వేంకటపతి మచ్చుచల్లనాయాత్మ ।
పాయక యాతనిఁజేరి భయమెల్లఁ బోయె ॥ ౧౯౭

## మాళవిగౌళ.

పల్లవి

పాపమెఱుంగని బ్రాహ్మండు ।
యెందుం జూపరానిచోటు చూపెనయ్యా ॥

(చరణము)

తనివోక జీవము తలకాయ నజుఁడు ।
పనివడితినితిన్న బ్రాహ్మండు ।
యెనసి యెదిరిం దన్ను నెఱుంగక విభుండై ।
ఘనవంశము మంటఁగలపెనయ్యా ॥

యెవ్వరు నెఱుంగని యెముకలయింటిలో ।
పవ్వళింపుచున్న బ్రాహ్మండు ।
జవ్వన మదమున జడిసేటి కోమలి
బువ్వులతోటలో బాదిగొనయ్యా ॥

చెలగి కన్నారికము చెడనిపడుచుం దెచ్చి ।
పలువేదనలు బెట్టె బ్రాహ్మండు ।
తెలిసి వేంకటాధిపుని దాసుండై ।
పులుగు పంజరానం బాదిగొనయ్యా ॥ ౧౯౮

## అధ్యాత్మ సంకీర్తనలు

### శంకరాభరణం.

పల్లవి

యిన్ని చేతలును దేవుండిచ్చినవే ।
వున్నవారియీపులెల్ల నొద్దికయ్యేనా ॥

(చరణము)

తెగని యాపదలకు దేవుండేకలడుగాక ।
వగలుడుపం బరులవశమయ్యేనా ।
నొగిలి యితరులకు నోళ్లుదెరచిన ।
నగుబాటేకాక మానంగబోయెనా ॥

అగ్గలపుదురితాలు హరియే మానుపుగాక ।
బగ్గున నొక్కరువచ్చి పాపబోయ్యేరా ।
తిక్కుముక్కులైనవేళ తలంచినవారెల్ల ।
సిగ్గుబాటేకాక తమ్ముంజేరవచ్చేరా ॥

యెట్టుసేసినను వేంకటేశుండే నేరుచుంగాక ।
కట్టం గడవారెల్లఁ గరుణించేరా ।
యిట్టె యేమడిగిన నితండే యీనంగుగాక ।
వుట్టిపడి యెవ్వారైన నూరడించేరా ॥ ౧౯౯

### అహిరి.

పల్లవి

యెటువంటి రౌద్రమో యెటువంటి కోపమో ।
తటతట నిరువంకదాటి వీడే ॥

(చరణము)

తోరంపు బెనుచేతుల మల్లచఱచి ।
దారుణలీలం బెదవులవుడుకఱచి ।
కారించి చాణూరుగడుభంగపరచి ।
వీరుండై యెముకలువిఱచి వీడే ॥

## సాళంగం.

పల్లవి

తనకర్మమెంతో చేతయునంతే ।
గొనకొన్న పనియెంత కూలిసంతే ॥

(చరణము)

తలపులోహరినెంత తలచె నేడే వాని ।
కలిమియును సుఖమునుం గలదంతే ।
తులదూచఁ బైడెంత తూకము సంతే ।
నెలకొన్న పిండెంత నిప్పటినంతే ॥

సిరివరుపూజెంతసేసె నేడేవాని ।
దరియునుదాపునెంతయునంతే ।
పురిగొన్నయీవెంతపొగడునంతే ।
నరపతిచనువెంత నాగవృషంతే ॥

శ్రీవేంకటపతి చింతయునంతే నేడే ।
భావపరవశము పలుకునంతే ।
దైవముకృపయెంత తాను సంతే ।
యేవంకజయమెంత యురవునంతే ॥ ౨౦౨

## బౌళి.

పల్లవి

యెండగాని నీడగాని యేమైనగాని ।
కొండలరాయుడే మాకులదైవము ॥

(చరణము)

తేలుగాని పాముగాని దేవపట్టయినగాని ।
గాలిగాని ధూళిగాని కానియేమైనా ।
కాలకూటవిషమైన గ్రక్కునమింగిన నాటి ।
నీలవర్ణుండే మానిజదైవము ॥

చీమగాని దోమగాని చెలంగియేమైనగాని ।
గామగాని నామగాని కానియేమైనా ।
పాములనన్నిటిమింగే బలుతేజాపై నున్న ।
ధూమకేతువే మాకుదార దైవము ॥

పిల్లిగాని నల్లిగాని పిన్నరొలుకైనగాని ।
కల్లగాని పొల్లగాని కానియేమైనా ।
బల్లిదుండై వేంకటాద్రిపై నున్న యాతండే మ ।
మెల్లకాలముననేలె యింటిదైవము ॥ ౨౦౩

ఆహిరి.

పల్లవి

యిందునందుదిరుగుచు నెవ్వరివాడవుగాక ।
బందెపసురమవైతి బాపుజీవుండా ॥

(చరణము)

తోలుబొక్కలోనజొచ్చి తూలేటియాకలిచేత ।
పాలుమాలి యిందరికి బంటుబంటవై ।
యేలినవానింగానక యేచినయాసలవెంట ।
కూలికింబోదొరకొంటి కూళజీవుండా ॥

తిట్టమేనిలోనజొచ్చి దిమ్మరిదొంగలచేత ।
మూటగట్టించుక నీవు మూలదొరవై ।
గాటపువిభునిచేతి ఘనతకోరికలకు ।
వేటకుక్కవైతివి వెట్టిజీవుండా ॥

చీమలింటిలోనజొచ్చి చిక్కువడి అందరిలో ।
దోమకరకుట్లకు తోడిదొంగవై ।
యేమరి వేంకటవిభు నెఱుంగక జాడ్యజొప్ప ।
నాముమేయ దొరకొంటి నాలిజీవుండా ॥ ౨౦౪

శ్రీరాగం.

పల్లవి

వేదనంబొరలే వెరవేలా ।
యీదయ విధి దనకీయ్యాదా ॥

(చరణము)

తత్తరపాట్ల తనువికారములఁ ।
జిత్తమువేచే చెలువేలా ।
భక్తితోఁ దాచిన పరధనంబుగని ।
సత్తయివుండుట చాలదా ॥

యెక్కువ తమకపుటింతులంబొందక ।
వక్కుచు వాడే వయసేలా ।
మొక్కుచు దాచిన మూలధనముగన ।
నెక్కువ దైవంబియ్యదా ॥

చింతలంబొరలెడి చిక్కులం గెరలెడి ।
రోఁతల యీనేరుపులేలా ।
భ్రాంతిగ వేంకటపతి రతిం జిత్తపు ।
టూఁతలం గోరెకలూనదా ॥ ౨౦౫

ముఖారి.

పల్లవి

వెరపులు నొరపులు వృథా వృథా ।
ధరపై మరియంతయునువృథా ॥

(చరణము)

తడయక సేసినదానంబులువృథా ।
యెడనెడ నెఱింగిన యెఱుక వృథా ।
వొడలిలోని హరి నొనరంగ మతిలోఁ ।
దలచని జీవమే తనకు వృథా ॥

జగమునం బడసిన సంతానము వృథా ।
తగిలిగడించిన ధనమువృథా ।
జగదేకవిభుని సకలాత్ముని హరిం ।
దెగికొలువని బుద్ధియును వృథా ।
పనివడికూడిన పరిణామమువృథా ।
వొనరంగ నుండిన వునికివృథా ।
ఘనుండగు తిరువేంకటగిరి హరింగని ।
మనసేరని జన్మములు వృథా ॥ ౨౦౭

ఆహిరి.

పల్లవి

యేమిగలిగెను మాకిందువలన ।
వేమారు బొరలితిమి వెఱ్ఱిగొన్నట్లు ॥

(చరణము)

తటతట నన్నిటిమీఁదట నాలజాలంబు ।
లిటునటు జరించవా యీదియీది ।
అటువలెనేపో తమకమందిసంసారపు ।
ఘటనకై తిరిగితిమి కడగానలేక ॥

దట్టముగ బారావతములు మిన్నులప్రోవ ।
కొట్టం గొనకెక్క_వా కూడికూడి ।
వట్టియాసలనే యిటువలెనేపో యిన్నాళ్లు ।
బట్టబయలీదితిమి పనిలేనిపాట ॥

వెఱచి కుమ్మరపురువు పేడలోపలనెల్ల ।
పొరలదా పలుమారు బోయిపోయి ।
వరుసజన్మముల నటువలెనె పొరలితిమి ।
తిరువేంకటాచలాధిపుఁ దలంచలేక ॥ ౨౦౮

ఆహిరి.

పల్లవి

హరి నెఱుంగని పుణ్యమంటేరుగాన ।
దురితాలె దురితాలె దురితాలెసుడీ ॥

(చరణము)

దొడ్డపుణ్యములుఁజేసి తుదలేని సంపదలు ।
అడ్డగించుకొని రాసులగు గురుతు ।
జడ్డులేని హరికథ చవిలేకుండిన నిట్టే ।
గొడ్డారె గొడ్డారె గొడ్డారె సుడీ ॥

వలెనని మేలెల్ల వడింజేసి కైవల్య ।
ములమి చేతికిలోననగుగురుతు ।
తలంపు వైష్ణవభక్తిం దగులకుండినననంతా ।
అలయికె అలయికె అలయికె సుడీ ॥

తిరమైనతీర్థాలు దిరిగియుందరిలోన ।
ధరఁబుణ్యుండవుట తెలియుటకు గురుతు ।
తిరువేంకటపతిం దెలియకుండిననంత ।
విరసాలె విరసాలె విరసాలె సుడీ ॥ ౨౦౮

నాట.

పల్లవి

యేడ వలపేడ మచ్చికేడ సుద్దులు ।
ఆడుకొన్నమాటలెల్ల నవనీజాలా ॥

(చరణము)

తొలుకొరుమొఱుపులు తోచిపోవుంగాక ।
నెలకొని మింటనవి నిలిచెనా ।
పొలతులవలపులు పొలసిపోవుంగాక ।
కలకాలంబవి కడతేరెనా ॥

యెండమావులుచూడ నేరులై పారుగాక ।
అండకుంబోవ దాహమణంగెనా ।
నిండినట్టె మోహము కెలంతలును దిట్టుజూడ ।
వుండినట్టె వుండుగాక వూతమయ్యెనా ॥
కలలోని సిరులెల్ల కనుకూరుట్లు లేగాక ।
మెలకువంజూడనవి మెరసెనా ।
అలివేణులమేలు ఆసపాటుకాక ।
తలపు వేంకటపతిం దగిలెనా ॥ ౨౦౯

ఆహిరి.

పల్లవి

యేమిసేయంగవచ్చు నీశ్వరాధీనంబు ।
తామసపుబుద్ధి కంతలు దూరవలసె ॥

(చరణము)

తెగి దురాపేక్షంబడితివి యోగతిలేదుగన ।
పగగొన్న వగల కష్టాపములంబడవలసె ।
తగుమోహసలిలంబుదాట మతిలేదుగన ।
మునుగుడంబడి భవముతో మల్లాడవలసె ॥
పాపకర్మములం జంపంగ శక్తిలేదు గన ।
కోపబుద్ధులచేత కోదమాలవలసె ।
రూపములం బొడగాంచి రోయుమరిలేదుగన ।
తాపములచేబారల తగులుగావలసె ॥
తిరువేంకటాచలాధిపు గొలువలేదుగన ।
గరిమెచెడి విషయకింకరుడుగావలసె ।
పరతత్వమూర్తిందలంపగ బ్రొద్దులేదుగన ।
దొరతనంబుడిగి యాత్రతుండగావలసె ॥ ౨౧౦

వరాళి.

పల్లవి

తనవారని యాసందగిలి భ్రమయనేల ।
తనువుం బ్రాణునికంటె తగులేది ॥

(చరణము)

తనువుం బ్రాణుండు తగిలి గర్భమునందు ।
వొనరనేకమై యుదయించి ।
దినములుచెల్లిన తివిరి యాప్రాణుండు ।
తనువు విడిచిపోయె దయలేక ।
ప్రాణికై దేహము పాపపుణ్యముసేయు ।
ప్రాణివెంటనే బొందిపోకుండదు ।
ప్రాణియెచ్చటనైన బాధలంబడకుండ ।
ప్రాణిరక్షించు బొందబడిదాబోయెనా ॥
యెరవులదేహాలివి నిజమని నమ్మి ।
యెరింగినెఱుంగ వేరిడియేలా ।
అరయం బరమునకు నాదిపురుషుండె ।
పఱగు శ్రీవేంకటపతి గలిగుండంగా ॥ ౨౧౧

సామంతం.

పల్లవి

సకలభూతదయ చాలంగగలుగుట ।
ప్రకటించి దేహసంభవమైనఫలము ॥

(చరణము)

తలకొన్న ఫలవాంఛ దగులకుండగ జిత్త ।
మలవరించుట కర్మియైనఫలము ।
పలుకర్మములలోన బ్రహ్మార్పణపుబుద్ధి ।
గలుగుట హరికృప గలిగినఫలము ॥

యెప్పుడుదిరువేంకటేశు సేవకుఁడౌట ।
తప్పకజీవుండు దానై నఫలము ।
కప్పినసౌఖ్య దుఃఖమర్మములు సమముగా ।
నొప్పుట విజ్ఞానమొదవినఫలము ॥ ౨౧౨

వరాళి.

పల్లవి

అన్నలంటా దమ్ములంటా ఆండ్లంటా బిడ్డలంటా ।
వన్నెలనప్పులుగొన్నవారువో వీరు ॥

(చరణము)

తెగనీక అప్పులెల్లఁదీసితీసివారు ।
తగిలినం బెట్టలేక దాగిదాగి ।
వెగటునంబారిపోగా వెంటవెంట ।
పెక్కు వగల నప్పులుగొన్నవారువో వీరు ॥

సేయరానిపనులెల్లంజేసిచేసి తమ ।
రాయడికి లోలోన రాసిరాసి ।
కాయములోఁచొచ్చి చొచ్చి కాచికాచి ।
మున్ను వ్రాయని పత్రాలకాగేవారువో వీరు ॥

దొరయై యప్పులవారిందోసితోసి యీ ।
పరిభవములనెల్ల బాసిబాసి ।
సిరులవేంకటపతి చేరిచేరి ।
యిట్టి వరుసనే గెలిచినవారువో వీరు ॥ ౨౧౩

కన్నడగౌళ.

పల్లవి

యేదికడ దీనికేది మొదలు వట్టి ।
వేదనలు తన్ను విడుచుటెన్నండు ॥

(చరణము)

తొడరినహృదయమే తోడిదొంగయై ।
వడిగొని తన్నువలబెట్టగాను ।
కడంగి కర్మములగడచుటెన్నండు ।
నిడివిబంధముల నింగుటెన్నండు ॥

తతిగొన్నతలంపులే దైవయోగమై ।
మతినుండి తన్ను మరిగించగాను ।
ప్రతిలేనియాపదబాయుటెన్నండు ।
ధృతిమాలినయాస తీరుటెన్నండు ॥

పొదలినమమతయే భూతమై తన్నుం ।
బొదిగొని బుద్ధి బోధించగాను ।
కదిసివేంకటపతిం గనుటయెన్నండు ।
తుదలేనిభవములం దొలగుటెన్నండు ॥ ౧౧౪

శుద్ధవసంతం.

పల్లవి

కడలుడిపి నీరాడగా దలంచువారలకు ।
కడలేనిమనసునకుం గడమయెక్కడిది ॥

(చరణము)

దాహమణగినవెనక తత్వమెరిగెదనన్న ।
దాహమేలణంగు తాతత్వమేమెఱుంగు ।
దేహంబుగలయన్ని దినములకుంబదార్థ ।
మోహమేలుడుగు దాముదమేలకలుగు ॥

ముందరెరిగినవెనుక మొదలుమరచెదనన్న ।
ముందరేమెరుంగు దామొదలేలమఱచు ।
అందముగ దిరువేంకటాద్రీశు మన్ననల ।
కందువెరిగినమేలు కలనైనలేదు ॥ ౧౧౫

## దేవగాంధారి.

పల్లవి

యిందులోనె నెవ్వండును తెలిపినిన్ను బొగడంగ ।
కందువ యింతింతని కానరాదుమహిమ ॥

(చరణము)

యేచి నీరోమరంధ్రాల నిటువంటి బ్రహ్మాండకోట్లు ।
కాచినట్లున్నవి నీకాయములందు ।
పూచిన నీబొడ్డుఁదమ్మిఁబుట్టిన బ్రహ్మలెందరో ।
చేచేతరుద్రు లెందరో చెప్పరాదుమహిమ ॥

నారువోసినట్లు నానాదేవకోట్లు ।
కారుకమ్మెనిదె నీసంకల్పమునందు ।
యీరీతి మునులెందరో యింకవేదరాసులెన్నో ।
చేరినజీవులెందరో చెప్పరాదుమహిమ ॥

అనలులుంజంద్రులు నాదిత్యకోట్లు ।
జనియింపుచున్నవి నీజలజాక్షుల ।
యెనయ శ్రీవేంకటేశ యిన్నిట నీదాసుండను ।
చెనక నలవిగాదు చెప్పరాదుమహిమ ॥ ౨౧౬

## సాళంగనాట.

పల్లవి.

మిన్నునేలమోచెనదె మేటిదైవము ।
కన్నులెదుటనె శ్రీవేంకటరాయుండు ॥

(చరణము)

యెత్తినాడు గోవర్ధనమింద్రాదిసురలెదుట ।
వొత్తినాడు శంఖము దైత్యులగెలిచి ।
మెత్తినాడు హిరణ్యునిమెదడు చందనముగా
మొత్తినాడు మల్లులను మోగతిరుగగను ॥

పట్టినాడు చక్రము వుబ్బరి కాలనేమిమీఁద ।
మెట్టినాడు కాళింగుని మెడలమీఁద ।
పెట్టినాడు యేకదాడి పెనుసముద్రముదాటి ।
కొట్టినాడు పౌండ్రకుని కోలాహలముగా ॥

తుంచినాడు సోమకుని తోయధులు చొచ్చిచొచ్చి ।
దంచినాడు జరాసంధుదండిపౌండ్రుల ।
యెంచగ శ్రీవేంకటాద్రి నిందిరయుదానుంగూడి ।
మించినాడు దాసులను మెచ్చివరములను॥ ౨౧౭

పాడి.

పల్లవి

ధనమెంతగలిగినా తగుసంరక్షణలేక ।
కనుంగొని తనకంటె కై వశముగాదు ॥

(చరణము)

యేరీతిభయభక్తి యెంతగలిగినను ।
చేరిముద్రాధారిగాక సిద్ధింపదు ।
తేరిపారి తానెంత పతివ్రతయైనను ।
కోరిపుస్తెగట్టకున్న గురుతుగాదు ॥

యిరవై దేవుండు తనయెదుట నెంతయుండిన ।
గురువను మతిలేక కొనసాగదు ।
ధరలోఁ బుట్టినప్పుడు తానెంతబ్రాహ్మణుండైన ।
పరగజంద్యములేక పాత్రుండుగాదు ॥

వావిరిందాఁ గురువైష్ణవుండననుకొన్న ।
దేవతాంతరముడుగక తిరముగాదు ॥
శ్రీవేంకటేశ్వర నీసేవకులైనవారికి ।
వేవేలువిధులైన వెలితిలేదు ॥ ౨౧౮

గౌళ.

పల్లవి

ఘనసంసారులకెల్ల కర్మమైపొడచూపు ।
ననుచు యింతకుగురి నరహరియొక్కడు ॥

(చరణము)

మెలమిఁబుణ్యములెల్ల యింద్రలోకమైతోఁచు ।
నలుగడపాపములే నరకలోకమైతోఁచు ।
పొలసిరెండుసరిమైతె భూలోకమైతోఁచు ।
కలవాడొక్కండె గురి కమలవిభుండు ॥

పరగరాజసులకు బ్రహ్మమైపొడచూపు ।
గరిమెతామసులకు కఱకంఠుడై యుండు ।
శిరులసాత్వికులకు శ్రీకాంతుడై మించు ।
నిరవైనవాడు శ్రీహరియొక్కండె ॥

ఆయమెఱిగినవారి కంతరాత్మయైయుండు ।
చాయగన్నవారికి జగమెల్లనై తోఁచు ।
చెయిగన్నవారికి శ్రీవేంకటేశుండై తోఁచు ।
యేయెడవారికి గురి యీదేవుడొక్కండె ॥ ౨౧౫

సాళంగనాట.

పల్లవి

యేలచెప్పినసుద్ది లేదాకానితోను ।
పాలుమాలక యింతలో బ్రహ్మచారివైతివి ॥

(చరణము)

మెలమిగొల్లెతలను యిన్నాళ్ళుపొందిపొంది ।
తొలగి మధురలోన దొరవైతివి ।
కొలదిమావులగాచి గొల్లవాడై యుండి ।
వలవంతనేడు రాచవాడవైతివి ॥

వేదుకలకు నింటింట వెన్నలుదొంగిలి ।
ఆదద్వారకలో సోమయాజివై తివి ।
వోడక రుక్మిణీదేవి నూరకె యెత్తుకవచ్చి ।
పాడితో నగ్రపూజకుఁ బాత్రుండవై తివి ॥

రక్కసులకాపురాలు రచ్చలకెక్కఁజేర్చి ।
పెక్కుధర్మములునిల్పి పెద్దవై తివి ।
చిక్కువాసినన్నుంగూడి శ్రీవేంకటాద్రిమీఁద ।
దిక్కులనిందరిపాలి దేవర్వై తివి ॥ ౨.౨౦

గుజ్జరి.

పల్లవి

అట యెవ్వరికిం గొర నేను అంతర్యామికేకాక ।
తటుకున నితండె గతియనియున్నాడ తప్పక నను మన్నించిగాక॥

(చరణము)

హరిదాసానుదాసుండనట నాకాచార్యత్వము సంగతులా ।
అరుదుగ విష్ణునియచ్చుమోచుకొని యన్యులంగొలిచిన నమ్మ్మదురా ।
విరతింబొంది యిక విషయముగోరిన వెనకటిపగలివి సాధించవా ।
యిరవుగ నే మొరవెట్టంగ నిటు నాయేలిక దానకాచుగాక ॥

సకలపుణ్యముల ఫలములొల్లనని స్వర్గముఁబొరసీకం బాడియౌనా ।
అకటా తిరుమంత్రమునుడుగునో రధములంబొగడంగ జీవియౌనా ।
వీకటపుమోహము నరకెదనని భావించిపారితే వెనుకొనదా ।
మొగమెదుటనె వేలుచునుండగ మురహరుఁడే దయజూచెగాక ॥

శ్రీవైష్ణవధర్మము చేపట్టి జగిఁ బిరికితనమిఁటిదేల ।
దేవతాంతరముమాని కమ్మటి తెరువుదప్ప హీనముగాదా ।
వేవేలుచదువులుచదివి ప్రాకృతుల వేడుచుఁదిరిగిన నవ్వరా ।
శ్రీవేంకటేశుండేగతియని యుండంగ చేరితంతే రక్షించెగాక ॥ ౨.౨౧

సాళంగనాట.

పల్లవి

యెదురా రఘుపతికి నీవిటు రావణా నే ।
డిదేమి బుద్ధిదలంచితిట్లాయె బ్రదుకు ॥

(చరణము)

హరునిపూజలునమ్మి హరితో మారుకొనంగ ।
విరసమైకూలితివి వెఱ్ఱిరావణా ।
వరుసతోడ బ్రహ్మవరమునమ్మి రాము ।
శరణనకుండగానె సమసెగాకులము ॥

జపతపములునమ్మి సర్వేశువిడువంగ ।
విపరీతమాయెగా వెఱ్ఱిరావణా
వుపమలనగడుతానున్న ఖలనిధినమ్మి ।
కపులపాలై తివిగా కదనరంగమున ॥

బంటుతనమునమ్మి పై కొన్న రాగవు ।
వింటంబాలిసితివిగా వెఱ్ఱిరావణా ।
యింటనే శ్రీవేంకటేశ్వరునింగొలిచి ।
వెంటనే సుఖియాయె విభీషణుండు । ౨౨౨

గౌళ.

పల్లవి

నీకు సరియేరి నిఖిలలోకములలో ।
కాకాసురుని నట్లగాచితివి నీవు ।

(చరణము)

హరిపరమపురుషా యచ్యుతానంతా ।
కరివరద మురహరా కరుణానిధి ।
ధరయాకనము బలితలయు మూడడుగులను ।
పరగంగై కొన్నయట్టి బలుండవునీవు ॥

మాధవా భూధరా మధుసూదనా కృష్ణ ।
శ్రీధరా శ్రీపతి శ్రీనివాస ।
సోధించి జలధులుచొచ్చి చదువులుదెచ్చి ।
ఆధాతకిచ్చితివి అధికుండవునీవు ॥

వామన కేశవ వాసుదేవ ముకుంద ।
రామగోవింద చక్ర కరాంబుజా ।
ఆమహిమ శ్రీవేంకటాద్రిమీదటనెక్కి ।
కామితఫలములిచ్చు ఘనుండవునీవు ॥ ౨౨౩

భూపాళం.

పల్లవి

మేలుకోశృంగారరాయ మేటిమదనగోపాల ।
మేలుకోవె నాపాలముంచిన నిధానమా ॥

(చరణము)

సందడిచే గోపికల జవ్వనవనములోన ।
కందువం దిరిగే మదగజమవు ।
యిందుముఖి సత్యభామ హృదయపద్మములోని ।
గంధము మరిగినట్టి గండుతుమ్మెదా ॥

గతిగూడి రుక్మిణి కౌఁగిటి పంజరములో ।
రతిముద్దుగురిసేటి రాచిలుకా ।
సతులు పదారువేల జంటకన్నుంగలువల ।
కితవై పొడమిన నాయిందుబింబమా ॥

వరుసం గొలనిలోని వారిచన్నుంగొండలపై ।
నిరతివాలిన నానీలమేఘమా ।
శిరినురమునమోచి శ్రీవేంకటాద్రిమీద ।
గరిమ వరములిచ్చె కల్పతరువా ॥ ౨౨౪

## తాళ్ళపాకం కవుల కృతులు

### భూపాళం.

పల్లవి

యేమిచిత్రంబేమిమహిమలు యేమినీమాయావినోదము ।
వామనాచ్యుత నిన్ను దెలియంగవసుధలో మా తరములా ॥

(చరణము)

సకలలోకనివాస నాయకశౌరి మురహరి నరహరి ।
ప్రకటమాయెను నీగుణంబులు పాలముచ్చువటంచును ।
వికటముగ నినుగన్నతల్లి వ్రేల నీవదనంబుమీటిన ।
అకట హా యని నోరుదెరచిన యందులోకములుండెను ॥
శ్రీసతిపతి దైత్యదానవ శిక్ష కామరక్షక ।
రాసికెక్కెను బండిరొప్పినరవ్వలా నీచేతలు ।
మోసమున నజునుండు నీలో ముందుగానక మాటలాడిన ।
వామనార్చిత విశ్వరూపము వసుధంజూపితివౌదువు ॥
నమోనమో శ్రీవేంకటేశ్వర నారదప్రియ భక్తవత్సల ।
విమలముగు నీదాసులిదే నీవిద్యలెల్లజూచిరి ।
సుముఖులై కరి శబరి బలియును శుక ధృవాదులునిన్నుగొలువంగ।
సమతవున్నతపదములో సంగీతసర్వమిందును గంటిమి ॥ ౨౨౫

### ముఖారి.

పల్లవి

నడచిలోకముబ్రహ్మనాటనుండీ సహజము ।
యెడయక శరణని యియ్యకొంటిసుఖము ॥

(చరణము)

ఉదయాస్తమయములు వోకరన్నట్టయ్యేనా ।
బెదరి మేలునుం గీడు చెప్పినట్టునేసినా ।
యిదిదైవకల్పితము యెవ్వారినేమనవచ్చు ।
కదిసియైలదియయ్యె కానిదెన్నడునుగాదు ॥

జననములు మరణములు జంతువులయిచ్చలా ।
వొనర కలిమిలేము లోకులన్నట్టానా ।
ఘనమైన హరిమాయ కల్పితములివి తొల్లె ।
పో నింగిపొయ్యేరింబోవుపో నీవెన్నండుబోవు ॥
శ్రీవేంకటేశ నీవుసేసినసేతలోన ।
భావించి తెలియలేక భ్రమసితిమిన్నాళ్లు ।
సావధానమున నేడు శరణంటిమి నీకు ।
యీవేళ మమ్ముగాచితి విన్నిటిఁ గెలిచితిమి ॥ ౨౨౮

నాట.

పల్లవి

సురులకు నరులకు శుభమాయె ।
హరినీచేతలు ఆనందమాయె ॥

(చరణము)

కినిశిరావణుని గెలిచిన గెలుపులు ।
చెనకి బాణుని గెలిచిన గెలుపు ।
పోరాడి హేమకసిపు గెలిచిన గెలుపు ।
వెనకముందరికి వేదములాయె ॥

కేలన కంసునటు గెలిచిన గెలుపులు ।
చెలగిబలిని గెలిచిన గెలుపు ।
అలశిశుపాలుని గెలిచిన గెలుపులు ।
బలుపుణ్యకథా భారతమాయె ॥

కెరలి యసురులను గెలిచిన గెలుపులు ।
శిరునందరి గెలిచిన గెలుపు ।
యిరవగు శ్రీవేంకటేశ నీమహిమలు ।
సరవితో బురాణ జాలములాయె ॥ ౨౨౯

## తాళ్ళపాకం కవుల కృతులు

### రామక్రియ.

పల్లవి

శరణు శరణునీకు సర్వేశ్వరా ।
నీశరణాగతేదిక్కు సామజవరదా ॥

(చరణము)

వేయిశిరసులతోడి విశ్వరూపమా ।
బయటనే పరంజ్యోతిపరబ్రహ్మమా ।
మ్రోయుచున్నవేదముల మోహనాంగమా ।
చేయిచేత అనంతపు శ్రీమూర్తి ॥
ముగ్గురువేలుపులకు మూలకందమా ।
యోగిమునుల ఋషుల వోంకారమా ।
పగటుదేవతలకు ప్రాణబంధుఁడా ।
జగమెల్లగన్నలైన సాకారమా ॥
వెలయుసచ్చిదానంద వినోదమా ।
అలరుపంచవింశతి యాత్మతత్వమా ।
కలిగిన దాసులకు కరుణానిధి ।
చెలగివరములిచ్చే శ్రీవేంకటేశుండా ॥ ౩౭

### సామంతం.

పల్లవి

వున్నతోన్నతుండు వుడయవరు ।
యెన్ననసంతుండె యీయుడయవరు ॥

(చరణము)

సర్వలోకముల శాస్త్రరహస్యము ।
లుర్వింబోడమె నీయుడయవరు ।
పూర్వపువేదాంత పుణ్యశాస్త్రములు ।
నిర్వహించెనన్నిట నుడయవరు ॥

వెక్కసపు శ్రీవిష్ణు భక్తియే ।
వొక్కరూపమే వుడయవరు ।
చక్కనైన సుజ్ఞానమున కిరవై ।
వుక్కుమీరె నిదె వుడయవరు ॥

కదిసి మోక్షసాకారము దానై ।
వుదుటున నిలిచె నీయుడయవరు ।
యిదిగో శ్రీవేంకటేశ్వరుయీడై ।
పొదలుచునున్నాడు భువినుడయవరు ॥ ౨౨౯

బౌళి.

**పల్లవి**

క్రమ్ముకోటి గోపాంగనల మోహనాకారము ।
చిక్కని నవ్వులునవ్వీ శ్రీవేంకటేశ్వరుండు ॥

(చరణము)

సత్యభామవురముపై చల్లనికస్తూరిపూత ।
తత్తరించె రుక్మిణిచే తామరపూవు ।
హత్తిన భూకాంతకు యంగపుపయ్యదకొంగు ।
చిత్తగించరమ్మ వీడె శ్రీవేంకటేశుండు ॥

పంతపు పదారువేల బంగారు వుంగరము ।
బంతినే కుబ్జగట్టినపళిండితాళి ।
వింతగా రాధాదేవి వేసిన కలువదండ ।
చెంతలను వీడెయమ్మ శ్రీవేంకటేశుండు ॥

ఆసల తులశిదేవి యటుచేతిలో యద్దము ।
భాసురపు యీళాదేవి పట్టుగొమ్ము ।
శ్రీసతియెక్కినయట్టి సింహాసనపుగద్దె ।
సేసవెట్టించుకున్నాడు శ్రీవేంకటేశుండు ॥ ౨౩౦

రామక్రియ.

పల్లవి

యెట్టు రక్షించేవో కాని యిందిరారమణ నన్ను ।
దట్టపు నీదాసానుదాసుండ నేను ॥

(చరణము)

గాటపు వైరాగ్యము కండువ సుజ్ఞానము ।
మాటలలోననెకాని మతిలోనుండదు ।
నీటున నహంకారపు నీరసగుణములు ।
మాటునందిరుగు దుర్మార్గుండనేను ॥

నవనవవిధముల నానాపుణ్యములు ।
చెవులవినుటెకాక చేయుటలేదు ।
భవజలధులలోన పడిపొరలిమునింగి ।
చవిమరిగిన నిత్యచపలుండనేను ॥

శ్రీవేంకటేశ్వర నీసేవకుండననేటి ।
భావమొక్కటెకాని భక్తియెఱుగ ।
యేవిధులంబడలేక యిటునీకె శరణని ।
దేవులతో విఱ్ఱవీగెడి గర్వుడను ॥ ౨౩౧

వరాళి.

పల్లవి.

వైకుంఠపతి నిన్ను వడిగానవలెగాక ।
పైకొని తద్విష్ణోః పరమపదముండగను ॥

(చరణము)

కాయమేల బడలె నీకడుపునించుకొరకు ।
ఆయురన్నం ప్రాయశ్చిత్తి యనంగాను ।
ప్రాయమేల తమకించి పడతులకొరకుగా ।
చేయుట ఋణానుబంధ పశుపత్నియనగా ॥

తలపేల చిక్కువడి ధనమునకొరకుగాను ।
అలమిప్రాప్తవ్యమర్థమున్నంగాను ।
వెలసియాత్మ నేల కొలిచె దోషములకై ।
మలసి నిత్యోత్సవము నన్ను బ్రహ్మాత్మునగా ॥

ధరనిన్ని సుద్దులేల దరిచేర్చఁ గూడుపెట్ట ।
నిరతి శ్రీవేంకటేశ నీవుండగా ।
శరణంటినే నిట్టిజన్మములెల్ల జింతించ ।
హరినీనామము భవహరమైయుండగను ॥ ౨౩౨

గుండక్రియ:

పల్లవి

నన్నునిన్ను నెంచుకో ఓనారాయణా ।
అన్నియు నీచేతివే అదిగో నారాయణా ॥

(చరణము)

నామనవెఱుంగవా నారాయణానేడు ।
నాములాయె వయసులు నారాయణా ।
నామధారికపుమ్రొక్కు నారాయణా ।
ఆముకొనె నీప్రియములందునే నారాయణా ॥

నగుతా నేనంటి నింతె నారాయణాయిదే ।
నగరెతింగిన్నప్పని నారాయణా ।
నగవులు మాకుజాలు నారాయణా ।
అగడునేయకుమింక నెప్పుడు నారాయణా ॥

ననలు నీవినయాలు నారాయణా మంచి ।
ననుపంటిమిదిగో నారాయణా ।
ఘనుండ శ్రీవేంకటాద్రిం గలసితివిట్టినన్ను ।
అనువాననెల్ల బాసెనందునే నారాయణా ॥ ౨౩౩

బౌళి ॥

పల్లవి

వుండెలౌకికము వుండెవైదికము ।
రెండోడలం కాంచ నుండు నాపాదములు ॥

(చరణము)

తెగిమోక్షమార్గము తెరువైనదేహిక ।
మగిడిలోకము చింతమరియేల ।
సగమువిత్తులకును సగముపాకమునకు ।
తగునావొక్కటె కాయతరిగిపెట్టినను ॥

నలువంక దైవము నమ్మినయట్టివారికి ।
మలయు మనుష్య బుద్ధిమరియేల ।
తులదూగ నొసలు బత్తుండు నోరు దొండెలు ।
మెలంగిన యట్లైతె మెచ్చునాదేవుండు ॥

తక్కక శ్రీవేంకటేశు దాసానుదాసుండైతె ।
మక్కువ నవ్వుం గాములు మటియేల ।
దిక్కుల యేనుగునెక్కి దిడ్డిదూరం బోతేను ।
పెక్కసమాంగాక యిదివిన సంగతియౌనా ॥ ౨౩౪

గుజ్జరి.

పల్లవి

సాకారకే క్రీడించెనో నగి యీలోకము హరి ।
లోకలై యెటుచూచినా లంపటాలిట్లున్నవి ॥

(చరణము)

తీరనిమాయ నావొక దేహసంబంధానకేకా ।
వూరంగూటపు సంసారమోగింజేసేము ।
ధారుణిలో నాయొక్కతగు బ్రదుకునకేకా ।
యీరీతి సీమలో యిండ్లుయొక్కడ చూచినను ॥

బంతిని నాకు నానాటి పట్టెడు గూటికే కా ।
వంతగృషి గోరక్ష వాణిజ్యాదులు ।
వంతులునూరేండ్లుండే వట్టియాసలకునేకా ।
పంతపుబ్రహ్మాండము బరంగుకొనేది ॥

కొంచెపు దేవరకును కొండంతపత్తిరివలె ।
ముంచుకొనివున్నదిదేమో ఛీ గర్వము ।
అంచల శ్రీవేంకటేశుండన్నిటి కొక్కటేకీలు ।
మెంచి నీశరణనంగా నీతఁడే మన్నించెను ॥ ౨౩౫

శ్రీరాగం.

పల్లవి

చిత్తగించుమామాటలు శ్రీనరసింహా ।
చిత్తజ జనకవో శ్రీనరసింహా ॥

(చరణము)

చెలరేగియున్నాడవు శ్రీనరసింహా నీకు ।
చెలులెల్లా మ్రొక్కేరు శ్రీనరసింహా ।
కెలవులనవ్వేరిట్టె శ్రీనరసింహానీకె ।
కెలవుమావలపు శ్రీనారసింహా ॥

చిందిన చెమటలు శ్రీనరసింహా నిన్నుం ।
జెందినది కడుజాణ శ్రీనరసింహా ।
చెందమ్మిరేకుగోళ్ల శ్రీనరసింహా నీపై ।
చిందులెల్లబాడేము శ్రీనారసింహా ॥

సిరినేరగౌగిట శ్రీనరసింహా మంచి ।
సిరుల యహోబల శ్రీనరసింహా ।
శిరసెత్తు శ్రీవేంకట శ్రీనారసింహా నీ ।
చెరబడినవారము శ్రీనారసింహా ॥ ౨౩౬

## తాళ్ళపాకం కవుల కృతులు

### సామంతం.

యిందెకలిగెనీకు నిన్నిభోగాలు ।
అందముగా చిత్తగింపుమహోభళేశ్వరా ॥

(చరణములు)

భవనాశియేరకేటిపడతి యూలునీకు ।
యీవల నెదుటగొండలివె చుక్కలు ।
జవళిపీవెకొంగిలి పరిహంటె పెద్దగుహా ।
యువధరించ గదయ్య అవుభళేశ్వరా ॥
నీడదిరుగనిమేరువు నెలంతకంబుకంఠము ।
ఆడనె నిచ్చవానలు ఆపె చెమట ।
వాడనియట్టిశృంగారవనము యీజవ్వనము ।
ఆడుకో నీకుంటెల్ల అవుభళేశ్వరా ॥
వున్నతియిందిరపొందు రాజ్యానందమునీకు ।
కన్నులకాపేచిత్తము కద్దారాయి ।
తిన్ననిమోవినీకు తేనెలుయారగింపు ।
అన్నిట శ్రీవేంకటాద్రియువుభళేశ్వరా ॥ ౨౩౭

### గౌళ.

పల్లవి

నీదాసులపంచ నీడనుండేభోగాలు ।
ఆదినారాయణ వాకువదితొపో ప్రపంచము ॥

(చరణము)

హరినిన్నుబాసినట్టి దేవదేవేంద్రలోకమెల్ల ।
గరిమ నీవుగూడక నీకర్మమునొల్ల ।
పరగ నీనుతిలేని పలుచదువులునొల్ల ।
సరి నీకథవినని సుధచారనొల్ల ॥

దేవనీదాస్యములేని దేహసంభావనయెల్ల ।
భావించి నీకు(మ్రొక్క నిష్ఫలమునోల్ల ।
ఆవల నీవొసగించని యమృతపానమునోల్ల ।
శ్రీవిభుండ నీవులేనిచింత సేనోల్ల ॥

అంది నీసేవసేయని యగ్రజన్మమైననోల్ల ।
పొంది నీకొప్పనగాని భోగమునోల్ల ।
యిందునను శ్రీవేంకటేశ యేలితివిమమ్ము నిట్టె ।
అందితి జీవన్ముక్తి యానావలేమినోల్ల ॥ ౨౩౮

మలహరి.

పల్లవి

ముకుకొనిపరయుండికి ముద్ర వాశిగతి ।
పనివడి యివి యేర్పరచంగవలెను ॥

(చరణము)

నానాత్మలతో నారాయణుండై ।
హీనాధికములు యిందేవి ।
జ్ఞానాధికులెంచగ నిందధికము ।
యీనిజమొకటి యెఱుగంగవలెను ॥

అన్నిచోటులును యచ్యుతపదమె ।
యెన్నగ విశేషమిందేది ।
సన్నిధిగలయు పత్వాతారమిది ।
వున్నతిఘనమని వుండంగవలెను ॥

పలుకులెల్ల శ్రీపతినామములే ।
యిలంగారనిరామమి దిందేది ।
తెలియుటో శ్రీవేంకటేశ్వరునుతిదె ।
తలంపులు ఘనమని తపవంగవలెను ॥ ౨౩౯

## తాళ్ళపాకం కవుల కృతులు

### మాళవిగౌళ.

పల్లవి

యిదియొక్కటి వివేకులకు యెంచిచూచిన తెలియగలదు ।
అదన నిన్నంటిన వారల నీయతలంజేతువుగాన ॥

(చరణము)

బ్రహ్మాది దివిజులకంటె నీభక్తుండధికుండని జాటునగాదా ।
బ్రహ్మలోకమునకంటె పొడవున పట్టముగట్టితి ధృవునకు ।
బ్రాహ్మనికంటెను నీదాసపరికరమే ఘనమనుటిదిగాదా ।
బ్రాహ్మణుండగు దుర్వాసుండంబరీషుపాదములకు మ్రొక్కంగజేసితివి ॥
కర్మమార్గములనుండె ఋషులకు కడుయోగ్యుండు నీదాసుండనుచు ।
నర్మిలి ముందరిబ్రహ్మపట్టమిడి హనుమంతునికికట్టితివి ।
ధర్మములోపల నెక్కుడు వైష్ణవధర్మమధికమని తెలుపుటగాదా ।
మర్మపురాత్ముండగు నా బలికిని మహింజడని భోగములిచ్చితివి ॥
నఖిలవేదములకంటె నెక్కుడు నీదాసునిమాటే యనుచు ।
శిఖరప్రతిష్ఠగా ప్రహ్లాదునిచేచేతనేపొడచూపితివి ।
సుఖులలో నీదాసుండేసుఖియనుచు శుకునకు మోక్షంబొసగితివి ।
మఖమూర్తి శ్రీవేంకటేశ్వరుండ మాపాలిటనే దక్కితివి ॥ ౨౪౦

### కన్నడగౌళ.

పల్లవి

అప్పటప్పటివేళల నన్నియువివేకించి ।
తప్పకుండాదైవమునే తలంచవోయిజీవుండా ॥

(చరణము)

తక్కనయాహారము తరువాతనేనిద్ర ।
వచ్చుసురతాంతమున వైరాగ్యము ।
గచ్చుల కర్మాంతమునఁ గానవచ్చు నలుపెల్ల ।
మెచ్చులసత్యము కొనమించి వుండుధర్మము ॥

పసిడివెచ్చించునాడే పట్టునులోభములెల్ల ।
ముసలితనాన వచ్చువిసుగెల్లను ।
వెసనంసారపువేళనె యాసలుపుట్టు ।
పొసంగి యిట్టె జ్ఞానముపొంతనుండు సుఖము ॥
కోపముదీరినమీఁదకూడ వచ్చుశాంతము ।
చేపట్టి భక్తిగలిగిజేరుమోక్షము ।
యేప్రొద్దు శ్రీవేంకటేశు నెడయకశరణంటె ।
కాపాడి యతండె యిచ్చుఘనబ్రహ్మానందము ॥ ౯౮౧

బౌళి.

పల్లవి

కిందుపడి మ్రొక్కేమీ కేశవా ।
కెందమ్మిరేకంగన్నుల కేశవా ॥

(చరణము)

కీలుబొమ్మవింతలోనే కేశవా రతి ।
కేళికెమాయాడకేకా కేశవా ।
గేలిసేసేవేలమమ్ము కేశవా నీ ।
కీలు నాచేతనున్నది కేశవా ॥
గెరనుదాటవోయి కేశవా మాకుం
గెరలించేవు వలపు కేశవా ।
గిరిపచములివిగో కేశవా నీకు ।
గిరవునెట్టుకందాన కేశవా ॥
కిలకిలనవ్వనేల కేశవా నీకు ।
కేల నీవారమామేము కేశవా ।
గిలిగించికూడితివి కేశవా నాతో ।
గెలిసేవు శ్రీవేంకటకేశవా ॥ ౯౮౨

## తాళ్ళపాకం కవుల కృతులు

### శంకరాభరణం.

**పల్లవి**

తలంచిచూడ పరతత్వంబితండు ।
వలసినవారికి వరదుండితండు ॥

(చరణము)

సిరికిమగం డమృతసింధువునకు నల్లుండు ।
సరుసపార్వతికి సయిదోడు ।
గరిమెల్లబ్రహ్మకుఁ గన్నతండ్రియితండు ।
పరగి శివునకు బావయితండు ॥

అల దేవేంద్రుని యనుజుండితండు ।
మలసిచంద్రుని మరందితండు ।
కులమున నదితికి కొడుకునితండు ।
తలంప సురాసురల తాతయునితండు ॥

ప్రాణులకెల్ల బంధుండితండు ।
వాణికి మామగు వావియితడు ।
జాణ శ్రీవేంకటాచల రమణుండితండు ।
మాణిక్యపుమన్మథమన్మథుండితండు ॥ ౨౬౩

### బౌళి.

**పల్లవి**

వందేహం జగద్వల్లభం దుర్లభం ।
మందరధరం గురుం మాధవం భూదవం ॥

(చరణము)

నరహరిం మురహరం నారాయణం పరం ।
హరి మచ్యుతం ఘనవిహంగవాహం ।

## అధ్యాత్మ సంకీర్తనలు

పురుషోత్తమం పరం పుండరీకేక్షణం ।
కరుణాభరణం కలయామిశరణం ॥

నంద నిజనందనం నందక గదాధరం ।
యిందిరానాథ మరవిందనాభం ।
యిందురవిలోచనం హితదాసవరదం ము ।
కుందం యదుకులం గోపగోవిందం ॥

వామనాఖ్యం యజ్ఞరక్షణం లక్షణం ।
వామనం కామితం వాసుదేవం ।
శ్రీమదావాసినం శ్రీవేంకటేశ్వరం ।
శ్యామలం కోమలం శాంతమూర్తిం ॥ ౨౮౮

ఆహిరి.

పల్లవి

మాయింటికిరావోయి మాధవా ।
మాయలెల్ల గంటిమిదే మాధవా ॥

(చరణము)

మచ్చుచల్లేవు వలపు మాధవా ।
మచ్చికలెల్ల జేసితి మాధవా ।
మచ్చెముసీపై నిదె మాధవాయింక ।
మచ్చరపు చూపులేల మాధవా ॥

మఱుగేల యింకనీకు మాధవా ।
మఱినాకుదక్కితివి మాధవా ।
మఱచేవా నీచేతలు మాధవామాతో
మఱచుమంటే మనేవు మాధవా ॥

మట్టులేని శ్రీవేంకటమాధవా కట్టు ।
మట్టుతో మమ్ముంగూడితి మాధవా ।

మట్టేవు మాకాళ్లుపట్టి మాధవా మా ।
మట్టెలియ్యంగదవోయి మాధవా ॥ ౨౮౫

## గౌళ.

### పల్లవి

లేరా దేవతలు లేరా లావరులు ।
ఆరీతి నాడెందువోయి రధికులేకలితె ॥

(చరణము)

మొదలసృష్టికెనెల్ల మూలమైనబ్రహ్మదేవుని ।
యదె నాభింబొడమించె నచ్యుతుండె ।
తుదబ్రళయమునందు దొంతులుగా జగములు ।
వుదరమునందు నించె నొక్కండె నిలిచి ॥

మోవలేక దేవతలు మునుగంగ మందరము ।
త్రోవమోచి తెచ్చినట్టి ధోరవిష్ణువే ।
వేవేగ జలధిలోన వేళితే క్రుంగినకొండ ।
అవల వీపునవెత్తె నాది కూర్మమితండె ॥

తనబంటు శేషుని తలితాడుగావించి ।
కొన నాధారమైనిలిచె గోవిందుడే ।
దనుజులు దేవతలు తచ్చితచ్చియలశితే ।
వెనకనంతయుఁ దెచ్చె విశ్వరూపుండితండె ॥

కాలకూటమునకీశుం గంధము గాజేశిమింగి ।
చాలి నీలవర్ణుండాయె శశివర్ణుండే ।
కాలకంఠుండాయెను శంకరుండు పాత్రయినవంక ।
పోలింప ఋగ్వేదమిదె పొగడెనీతనిని ।

అమరంగ తనయిచ్చె నమృతముపంచి పెట్టె ।
నమరులకెల్ల నారాయణుండితండె ।

నెమకి తానమ్మైన నిర్మలకౌస్తుభము ।
కమలముపై లక్ష్మిగ్గైకొన నీఘనుండె ॥

మూలమని నుడివితే మోచివచ్చికరింగాచె ।
కోలుముందై యిందరిలో గోవిందుండె ।
తూలినశ్రుతులు దెచ్చి తుంగినభూమియెత్తె ।
అలరి భస్మాసురుని నడంచెనీదేవుండె ॥

యిందువమాళిపై నేశి యింద్రియములంగట్టిన ।
కందర్పజనకుండైన కమలాక్షుండె ।
కందువ పాదతీర్థపుగంగ హరిశిరమెక్కె ।
యెందును దైవమితండె యిందిరానాథుండు ॥

మాయలెల్ల నితనివే మహిలో సంకల్పములు ।
యేయెడ శ్రీవిష్ణురాజ్ఞ యీతనిదె ।
తోయరానిచక్రముచే దుర్వాసువారంగను ।
దాయిదండై బ్రతికించె తనబంటుచేత ॥

సంది నన్నిమతముల సన్న్యాసులకు గతియై ।
అందరినోళ్లను నారాయణనామమె ।
ముందు సంధ్యాజపముల మూలపు టాచమనము ।
లందులకితని కేశవాదినామములె ॥

వాదులన దైవం కేశవాత్పరమని తొల్లి ।
వేదవ్యాసులనిన విభుండీ హరి ।
సోదించి వశిష్ఠుండును శుకనారదాదులు ।
ప్రోడితోడ దాసులైరి పురుషోత్తమునికె

బాణాసురుని నఱికి భంగపడంగా
వేణునాదప్రియుండైన విఠలుండె
బాణమై త్రిపురములు భస్మీకర
ప్రాణులరక్షించె నీ పరమాత్మ

ఆపదలందినవేళ యసురబాధలుమాన్ప ।
చేపట్టి లోకముగాచె శ్రీపతియె ।
పైపై నింద్రాదులకు పారిజాతాది శిరులు ।
వైపుగాగాయించిన వరదుండు నితండె ॥

భూమియీతని సతియ బుధులితనిపరుషు ।
సోమ సూర్యాదులితని చూపుంగన్నులు ।
వేమరునూర్పులేగాలి విష్ణుపదమాకాశము ।
పాములై నహరె నీవాసుదేవుండే ॥

హరునింబూజించవలెనంటె నజ్ఞానునకు ।
సిరులంబొదముగాచె శ్రీకృష్ణుండె ।
అరిది మార్కండేయుండతని మహిమచూచి ।
పరదైవమితండని పాటించికొలిచె ॥

ధ్రువపట్టమితండిచ్చె దొరకొని శరణంటె ।
వివరింపనిదిగో శ్రీవేంకటేశుండె ।
యీవలనితనింజెప్ప నెవ్వరివశము లింక ।
భువింబావనాతి హరినిం బొగడేటినాడు ॥ ౨౪౬

లలిత.

పల్లవి

ఆసలు చెఱచకుమీ యచ్యుత ।
ఆసుద్దులె యీసుద్దులు అచ్యుతా ॥

(చరణము)

అలవాటు తొల్లినీకు నచ్యుతా ।
అలుగము ఇంకనీతో నచ్యుతా ।
అలయకుమింకనీవు అచ్యుతా నిన్ను
నలమిపట్టెంగాని యచ్యుతా ॥

ఆలసించంబనిలేదు అచ్యుతా ।
ఆలిమగని సంధి నచ్యుతా ।
ఔా లేనివిట్టే యచ్యుతా ।
ఆలించిమిమ్మేలితివి అచ్యుతా ॥

ఆశముగించకుమింక నచ్యుతా ।
అసురుసురై చిక్కితిమచ్యుతా ।
అసలు చెమటంగూడి యచ్యుతారతి ।
యసుదా శ్రీవేంకటాద్రి యచ్యుతా ॥ ౨౪౭

వరాళి.

పల్లవి

చతురుండవన్నిటను జనార్ధనా మమ్ము ।
సతతముగా నేలితివి జనార్ధనా ॥

(చరణము)

సమమోహాలుమనవి జనార్ధనాయిట్టె ।
జమళినున్నారమిదె జనార్ధనా ।
సమకూడెగాలెస్న జనార్ధనా నీ ।
సముకమెవ్వరికబ్బు జనార్ధనా ॥

చేస్రలాయెసరసాలు జనార్ధనా పెండ్లి ।
చవికెలోమనకు జనార్ధనా ।
సనరనివాడవు జనార్ధనా మరి ।
సవతులేరు నీకు జనార్ధనా ॥

సంకెదీరంగూడితివి జనార్ధనా నీకు ।
చంకలెత్తిమొక్కేము జనార్ధనా ।
జంకించకు శ్రీవేంకట జనార్ధనా ।
శంఖుచక్రములచేతి జనార్ధనా ॥ ౨౪౮

## దేసాళం.

**పల్లవి**

కొల్ల వలపులుచల్లె గోవిందరాజనిన్ను ।
గొల్లెతలునవ్వేరు గోవిందరాజ ॥

**(చరణము)**

గొప్పలుమాచన్నులివి గోవిందరాజ నిన్ను ।
కుప్పెలవలె నొత్తిని గోవిందరాజ ।
కుప్పించిబిగించకువో గోవిందరాజ మేనం ।
కుప్పళించి పెంచేమడ గోవిందరాజ ॥

కొనగోరెసతులము గోవిందరాజ పై ।
కొనిపాదాలుచాచేవు గోవిందరాజ ।
కొసరుమాటలేలోయి గోవిందరాజ నీతో ।
గుడిసెమానేమింక గోవిందరాజ ॥

కోడెమనసువారము గోవిందరాజ మాపై ।
గూడలం జల్లేవు సిగ్గు గోవిందరాజ ।
కూడితి శ్రీవేంకటాద్రి గోవిందరాజ యట్టె ।
కోడిగూసె తెల్లవారె గోవిందరాజ ॥ ౨౦౯

## శ్రీరాగం.

**పల్లవి**

వట్టివలపుచల్లకు విష్ణుమూరితినాతో ।
వెట్టిదిరమాటాడు విష్ణుమూరితి ॥

**(చరణము)**

వినయముసేసేవు విష్ణుమూరితినీవు ।
వెనకటివాడవేకా విష్ణుమూరితి ।
వినవయ్యమామాట విష్ణుమూరితిమమ్ము ।
వెనుకొనిపట్టకుమీ విష్ణుమూరితి ॥

వెరవుగలవాడవు విష్ణుమూరితి నేడు ।
వెరగైతి నిన్నుంజూచి విష్ణుమూరితి ।
విరివాయె నీమాయలు విష్ణుమూరితి నాకు ।
విరులిచ్చెవప్పటికి విష్ణుమూరితి ॥

వెలసెనీచింతలెల్ల విష్ణుమూరితి మా ।
వెలుపలలోన నీవె విష్ణుమూరితి ।
వెలలేని శ్రీవేంకట విష్ణుమూరితి కూడి ।
విలసిల్లితివి నాతో విష్ణుమూరితి ॥ ౨౫౦

రామక్రియ.

పల్లవి

మానరానిచుట్టమవు మధుసూదనా నీ ।
మాననిజమిా నేను మధుసూదనా ॥

(చరణము)

మఱవకుమి మాపొందు మధుసూదనలోయాక ।
మఱగులేని మనకు మధుసూదనా ।
మఱియేమిచెప్పేవు మధుసూదనా యే ।
మఱకమమ్మేలుమిా మధుసూదనా ॥

మడిచియాకిచ్చేనింద మధుసూదనా మేన ।
మడుగుఁగాయె చెమట మధుసూదనా ।
మడిదోసకులుగావు మధుసూదనా నాకు ।
మడుకపన్నయమేలు మధుసూదనా ॥

మంటెమేళమాయెరతి మధుసూదనా గొల్ల ।
మందలెల్ల నీసుద్దులే మధుసూదనా ।
మందుచల్లి కూడితివి మధుసూదనా మా ।
మందిరము శ్రీవేంకట మధుసూదనా ॥ ౨౫౧

ముఖారి.

పల్లవి

వేగిరించగంతేశీ త్రివిక్రమ ।
వేగుంజుకక్కరాని త్రివిక్రమ ॥

(చరణము)

వేసరించంజుమ్మి త్రివిక్రమ నిన్ను ।
వీసమంతపనికి త్రివిక్రమ ।
వేసెవుపూవులను త్రివిక్రమా మేని ।
వేసురుంజెమటల త్రివిక్రమ ॥

వెన్నెలలోనవ్వకు త్రివిక్రమా కన్ను ।
విన్నవారేమందురో త్రివిక్రమా ।
విన్నాణపుచేతల త్రివిక్రమా ।
వెన్నగారెనీమోవి త్రివిక్రమా ॥

వెడజారెం దురుము త్రివిక్రమా నన్ను ।
విడిదిలోగూడితి త్రివిక్రమా ।
విడువక శ్రీవేంకట త్రివిక్రమా నీ ।
విడుముడిమెచ్చితి త్రివిక్రమా ॥ ౨౫_౨

పాడి.

పల్లవి

వద్దువద్దునటలింక వామనా నీ ।
వద్దనేవున్నారమిదె వామనా ॥

(చరణము)

వరుసలువెదకేవు వామనా నీవు ।
వరుండవిందరికేని వామనా ।
వరవాతవలపించి వామనా దే ।
వరవలెనున్నాడవు వామనా ।

వనముకోఁగిలివైతి వామనా నీకు ।
వనితలుభ్రాంతే వామనా ।
వనరెరుగొల్లెతలు వామనా కా ।
వనువేళచూచుకొమ్మీ వామనా ॥

వాడవారుమ్రొక్కేరు వామనా నీకు ।
వాడుదేర కెమ్మోవి వామనా ।
వాడికె శ్రీవేంకటాద్రివామనా ।
వాడేచెలమవునీవు వామనా ॥ ౨౫౩

శ్రీరాగం.

పల్లవి

చెప్పరానిమహిమల శ్రీధరా నీవు ।
చెప్పినట్టుచేసేము శ్రీధరా ॥

(చరణము)

చేరడేసినకన్నుల శ్రీధరా సి ।
జరలమేనుచూచితి శ్రీధరా ।
చేకువ సంతోషమబ్బె శ్రీధరా ।
చికుమూరాడిందమి శ్రీధరా ॥

చెల్లునన్నియును నీకు శ్రీధరా నీ ।
చిల్లరసతులువారె శ్రీధరా ।
చెల్లెంబో ఆసుద్దివిని శ్రీధరా నాకు ।
చిల్లులాయె వీనులెల్ల శ్రీధరా ॥

సేవలుసేసేమునీకు శ్రీధరా మమ్ముం ।
జేరదేరంగూడితివి శ్రీధరా ।
చెవులకురావోయి శ్రీధరా ।
శ్రీవేంకటాద్రిమీఁది శ్రీధరా ॥ ౨౫౪

## తాళ్ళపాకం కవుల కృతులు

### సామంతం.

పల్లవి.

ఉద్ధరమువిద్దరమె హృషీకేశా ।
ఉట్టి సనకానవచ్చె హృషీకేశా ॥

(చరణము)

కోటికోయుమాతో హృషీకేశ ।
యాటుబెట్టుప్రసాతుల హృషీకేశ ।
మాటాడదు మాపొందు హృషీకేశ నీపై ।
కొంటదియ్యమింకమేము హృషీకేశ ॥

ఇచ్చెకురాలనునేను హృషీకేశ నిన్ను ।
మెచ్చుకుండులాడంబాలహృషీకేశ ।
ఇచ్చి[illegible]ంతచనవు హృషీకేశ నీకు ।
కచ్చరించె మరవకు హృషీకేశ ॥

తోలనీకుమరుంగులు హృషీకేశ నన్ను ।
నీలాగునఁగూడితివి హృషీకేశ ।
యేలితి శ్రీవేంకటాద్రిహృషీకేశ ।
యీలీలనేవుంతుమిా హృషీకేశ ॥ ౨౫౫

### శంకరాభరణం,

పల్లవి

బందుగుండవన్నిటను పద్మనాభ వట్టి ।
బందెలుగట్టకుమమ్ము పద్మనాభ ॥

(చరణము)

పట్టినచలపాదివి పద్మనాభమమ్ము ।
బట్టబయలండించేవు పద్మనాభ ।
పట్టితి బలిమినన్నుం బద్మనాభ ।
యింక బట్టముగట్టుకొనేవు పద్మనాభ ॥

పాటలుపాడేవు యీడ పద్మనాభ ఆ ।
పాటివారమా విన పద్మనాభ ।
పాటిగంపనీళ్లునించేవు పద్మనాభ బండి ।
బొటలాయె నీగుట్టు పద్మనాభ ॥

పలికినట్టియాయె పద్మనాభ ।
బలవంతుండవునీవు పద్మనాభ ।
పలుమారుంగూడితివి పద్మనాభ యిదె ॥
ఫలమా శ్రీవేంకట పద్మనాభ ॥ ౨౪౮

భైరవి.

పల్లవి

తప్పనిబొంకనీతుట్టిదామోదర నాకు ।
దప్పిదేర మోవియ్యవో దామోదరా ॥

(చరణాలు)

తరితీపుమాటలెల్ల దామోదరా నీకు ।
తరుణులునేరిపేరా దామోదరా ।
దరిచేరెశంఖునీచే దామోదరా నీవు ।
తరగరివెతగు దామోదరా ॥

తగులు విరిపందెల దామోదరా నీ ।
తగవులేలచెప్పేవు దామోదరా ।
దగదొట్టిపలికేవు దామోదరా నేను ।
తగిలితివిందాక దామోదరా ॥

తలయెత్తుమామిందర దామోదరా నీ ।
తళుకుమోవిచూచె దామోదరా ।
తలకొనికూడితివి దామోదరా యింక ।
తలంగకుశ్రీవేంకట దామోదరా ॥ ౨౪౯

గౌళ.

పల్లవి

వాడికలాయె నీపొందువాసుదేవుండా ।
వాడుదేరెం గెమ్మోనీవి వాసుదేవుండా ॥

(చరణము)

వాలుచూపులుమావి వాసుదేవుండా మమ్ము ।
వాలాయించితివినీవు వాసుదేవుండా ।
వాలారుగొళనొత్తెకు వాసుదేవుండా నీకు ।
వైళమే సవ్వువచ్చును వాసుదేవుండా ॥
వలనెల్లమాసొమ్ము వాసుదేవుండా యింత ।
వలెనా మాతోడిరట్టు వాసుదేవుండా ।
వలుములుచన్నులంట వాసుదేవుండా వట్టి ।
వళుకులంబెట్టకుమి వాసుదేవుండా ॥
వడదీరె శ్రీవేంకటవాసుదేవుండా యేల ।
వడినీవు తరితీపు వాసుదేవుండా ।
వడిగొనంగూడితివి వాసుదేవుండా మన ।
వదువెవ్వరికి గద్దు వాసుదేవుండా ॥ ౨౫౧

సాళంగనాట.

పల్లవి

పంతముదప్పదునీకు ప్రద్యుమ్నావొక్క ।
బంతింగూడేవుసతుల ప్రద్యుమ్నా ॥

(చరణము)

బలబలందెల్లవారె ప్రద్యుమ్నా యింక ।
బలిమిసేయవచ్చేవు ప్రద్యుమ్నా ।
పలచనామొళిగ్గులు ప్రద్యుమ్నా నీ ।
పలుసోకులవలెనె ప్రద్యుమ్నా ॥

పచ్చలాయకట్టేవు ప్రద్యుమ్నా ।
బచ్చెనప్రియాలుచూపి ప్రద్యుమ్నా ।
బచ్చుచేరలసటల ప్రద్యుమ్నా నీ ।
పచ్చడమంటించేవు ప్రద్యుమ్నా ॥

పదరకుమింకనీవు ప్రద్యుమ్నా మా ।
బ్రదుకునీచేతిదే ప్రద్యుమ్నా ।
పదనై శ్రీవేంకటాద్రి ప్రద్యుమ్నా నన్ను ।
బదిమారులుగూడితి ప్రద్యుమ్నా ॥ ౨౫౯

నాట.

పల్లవి

అంతానీకులోనె అనిరుద్ధా మన ।
యంతరంగమొక్కటాయె ననిరుద్ధా ॥

(చరణము)

అడ్డమాడబోలమునీకనిరుద్ధా ।
అడ్డేడమీనాడు బోడియనిరుద్దా ।
అడ్డువెట్టనింకనేల యనిరుద్దా ।
అడ్డింకలెంచకుమీ యనిరుద్ధా ॥

అప్పటివేడుకొనేవా అనిరుద్ధ నీకు ।
నప్పణనేనిచ్చెనా యనిరుద్దా ।
అప్పుడేవిన్నవించనా అనిరుద్ధవొద్ద ।
నప్పసమైవున్నదాన ననిరుద్ధా ॥

ఆయమెఱుగదువోయి అనిరుద్ధా ।
ఆయెడనుండివచ్చితి వనిరుద్ధా ।
ఆయితమైకూడితివి అనిరుద్ధా ।
ఆయనాయె శ్రీవేంకట యనిరుద్ధా ॥ ౨౬౦

### బంగాళం.

పల్లవి

పోకుపోకుమంతనీవు పురుషోత్తమా వట్టి ।
బూకలు మేమెఱుంగమా పురుషోత్తమా

(చరణము)

పొలసులాడకునీవు పురుషోత్తమా నీ ।
పొలజాణతనాలు పురుషోత్తమా ।
పులుసువేసిని చెంతపురుషోత్తమా మేము ।
పులుగరసితిమింత పురుషోత్తమా ॥

పొడవాటిసటకాడ పురుషోత్తమా ।
పొడమె నీమోవినవ్వు పురుషోత్తమా ।
పుడిశెండెనీశిగ్గు పురుషోత్తమా ।
పొడిరాలిరతులలో పురుషోత్తమా ॥

పొద్దుపొద్దుకొత్తలేల పురుషోత్తమా నీవు ।
బుద్దెటింగినప్పుడయ్యె పురుషోత్తమా ।
అద్దుకొని శ్రీవేంకటాద్రి పురుషోత్తమా నీ ।
బొద్దువంటియుంగరము పురుషోత్తమా ॥ ౨౮౧

### మాళవి.

పల్లవి

అలనాడె కంటివింటివిసర్వోత్తమా ।
అల్లుకొంటివి నీచెలులసర్వోత్తమా ॥

(చరణము)

అందునిందు నీయిరవసర్వోత్తమా ।
అందాలుచెప్పవచ్చేవసర్వోత్తమా ।
అందరునెఱుంగుదురు సర్వోత్తమా మాకు ।
నందుకొనిబాసిచ్చేవసర్వోత్తమా ॥

అంగడిమ్రొక్కువారమా అధోక్షజా నీకె ।
యంగము యీనడవడి యధోక్షజా ।
అంగజముద్రలునీచే వధోక్షజా నీ ।
యంగనలుగాదనేరా యధోక్షజా ॥

అనరాదుగాక నిన్ను నధోక్షజా కడు ।
నను కాయంబ్రియములు అధోక్షజా ।
అనంగు శ్రీవేంకటాద్రి యధోక్షజా మమ్ము ।
ననిశముంగూడితివి యధోక్షజా ॥ ౨౬౧

భూపాళం.

పల్లవి

సిరసెత్తంగదవయ్యా శ్రీనారసింహా నీ ।
సిరులెల్ల నేనే కానా శ్రీనారసింహా ॥

(చరణము)

చెలులనంపితివేల శ్రీనారసింహా నాకు ।
చెలువపునవ్వువచ్చె శ్రీనారసింహా ।
చెలువపునిన్నుంజూచి శ్రీనారసింహా నీపై ।
చిలికితిమోహామెల్ల శ్రీనారసింహా ॥

చిత్తాన నిన్నుందలంచి శ్రీనారసింహా నే ।
చిత్తరుప్రతిమనైతి శ్రీనారసింహా ।
చిత్తవానచెమటల శ్రీనారసింహా యేల ।
చిత్తిణిగుణమునీకు శ్రీనారసింహా ॥

శ్రీసతినీతొడయెక్కె శ్రీనారసింహా నీవు ।
సేసవెట్టితివాపెపై శ్రీనారసింహా ।
చేసన్న శ్రీవేంకటాద్రి శ్రీనారసింహా యింత ।
సేసి నన్నుంగూడితివి శ్రీనారసింహా ॥ ౨౬౨

శంకరాభరణం.

పల్లవి

యేమిటంబోరాదు దేహికిందిరానాథుండే దిక్కు ।
ఆముకొని తన్ను శరణనుటే వుపాయము ॥

(చరణము)

అట్టె కోపగించనంటే నానాజ్ఞ నడవదు ।
పట్టిశిక్షించెనంటే పాపముహింస ।
తొట్టియేమినొల్లనంటే తోయదు సంసారము ।
కట్టుకొంటేబంధము మోక్షమునకుదూరము ॥

వొకరిరక్షించఁబోతే నొకరికపకారము ।
సకలముమానితే జన్మమువృథా ।
అకటదానముసేసేనంటే ధనములేదు ।
సుకరపుధనకాంక్ష సుజ్ఞానరహితము ॥

తనువుపోషించనంటే తగులునింద్రియములు ।
ఘనవిరక్తుండైతే లోకముమెచ్చదు ।
మనసుగెలిచెనంటే మర్మమ్మకర్మము శ్రీవేంకటేశుం ।
డౌనర వివేకించక వుడుగదు మదము ॥ ౨౭౩

ఆహిరి.

పల్లవి

యెక్కడిజాలి యేటికి నీకు యెవ్వరివంక నేమింకగలదు ।
తక్కినవెల్ల దడవకమాని ధర్మమెఱింగి బ్రదుకవో మనసా ।

(చరణము)

పుట్టినయపుడే తమకర్మములు పొదుగకపోవు జీవులనెల్ల ।
నెట్టినవిధినిం గడచెనంటే నేర్పునంబడదు బ్రహ్మకునైన ।
అట్టిట్టనక హృదయములోని హరికేశరణుజొచ్చితినంటె ।

గట్టిగ నతండేదిక్కై యి నిలిచి కావంగ గలండు వెఱవకుమనసా ।
స్టాంపున నీసంసారంబునకు జొచ్చినయపుడె తగిలెను తోడును ।
దింపంగరానిమోపులు సుమ్మీ తీపులుదెచ్చేసంపదలెల్ల ।
రంపపుటాస దీనికిందోడు రాతిరింబగలు పెట్టనితరవు ।
యింపున గోవిందాయని నొడుగు యితఁడే దయ రక్షించును మనసా ।
కావలెనని తాఁగోరినయపుడే కప్పనుమాయ తోయఁగరాదు ।
కేవలమైన వుపమలచేత గెలువంగరాదు తెలియనిచిక్కు ।
ఆవల నేమి దడవంగనేల యఖిలంబునకు నేలికయైనా ।
శ్రీవేంకటేశుపాదములెపుడు సేవింపుచును చెలంగవో మనసా॥ ౨౩౪

లలిత.

పల్లవి

యేమనిచెప్పేట మాయజ్ఞానము యెఱింగి యెఱింగి తెలియంగలేము ।
శ్రీమాధవనీమఱుఁగుజొచ్చితిమి చిత్తగించి దయజూడంగదె ॥

(చరణము)

నీవురక్షకుండవై భువి నుండఁగనె గడియించేదింకె నేమి ।
జీవాంతరాత్ముండవై యుండుదువట చేకొనికావక మానేవా ।
వేవేలుగ బుట్టించంగ త్రఁవట వెలయించంగ నీభారముగదా ।
భావించనేరక వట్టిస్వతంత్రము పయిచేసుకొనుచుఁబరగేము ॥
పలుదెఱంగుల నీనామములుండగ పాపములకు వెఱవగనేల ।
బలిమి నీముద్రలు యింతటం జెల్లంగ పైకొనునాయింక నరకములు ।
తలంకకభయహస్తము నీవెత్తంగ దాసులకింకనెక్కడిభీతి ।
నిలుపంగనేరక మనసుచేబడి నేనిచ్చనిచ్చలునుంబొరలేము ।
అదె నీరూపము తిరువారాధనమైయుండంగ వెదకంగనేల ।
పదిలపుటాచార్యుండు గలుగంగ నిహపరముల త్రోవడుగంగనేల ।
వుదుటున వరములు శ్రీవేంకటేశుం డొసగంగ నే కోరంగనేల ।
తుదమొదలెంచక యిన్నాళ్లునేమిటి దొరకొని
యింకనుతియించేము ॥ ౨౩౫

## తాళ్ళపాకం కవుల కృతులు

### శుద్ధదేశి.

పల్లవి

అటుగాన యేమిసేసినా యధికులఁదూషింపంగజనదు ।
ఇటుగతివారలమాహాత్మ్యంబులు పరికింపంగ ననంతములు ॥

(చరణము)

ధరలో దుర్వాసుండు కోపియైన తపమునకు భంగమనందగునా ।
పరాశరుండు మత్స్యగంధింగోరిన పాపమంటునాయాతనికి ।
అలవాయుజుఁడు బ్రహ్మపట్టమున కాసగించితే లాఘవమా ।
సరి జనకుండు రాజ్యంబుచేసితె సదతింబొందక తొలంగెనా ॥

అనలుండెప్పుడు సర్వభక్షకుండైతే నశుచిత్వముగలదా ।
దినకరుకిరణము హేయములంటిన దీప్తికినిగడమగునా ।
వొనర చంద్రునకు కళంకగలిగిన నుడుగక శైత్యముమానెనా ।
ఘనుండగు శేషుండు విషధరుండైతే కడుబాండిత్యముఁ దరగెనా ॥

అలప్రహ్లాదుండు రాక్షసేజన్మంబైనంతనె భక్తికింగొదువా ।
కులముగల హరిశ్చంద్రుండంత్యజునింగొలిచిన సత్యముకడమగునా ।
కలహప్రియుండైన నారదునకుంగలిగిన సాత్త్వికమునం గొఱతా ।
యెలమిశ్రీవేంకటేశుండు తనదాసులయిండ్లనున్న
నధికుండౌకాడా ౨౬ ౭

### ఖౌళి.

పల్లవి

కొంతగాలమైన నిట్టె యీజీవులకునెల్ల ।
పొంతనుండి కావవయ్యా పుట్టించినదేవుండా ॥

(చరణము)

పండును సస్యాలెల్లపరగ నేఁటేటను ।
పండదు మనసువొకపరియైనను ।

నిండును తటాకములు నెలకొన్నవానలను ।
నిండ దొకరినడిగే నిరతపునోరు ॥
వికసించువిరులెల్ల వేసవతివచ్చితేను ।
వికసించదెంతైన విజ్ఞానము ।
వొకచోటనిలుచును వొద్దికతోగొండలెల్ల
వొకచోటనుండవు వొట్టివిశ్వాసములు ॥
వశమౌను మదించిన వనగజమైనను ।
వశముగాదెంతైన వయోమదము ।
యొసగ శ్రీవేంకటేశ యేలికవునీవుమాకు ।
ఈసగదు నీకృపచే నింక బూర్వకర్మము ॥ ౨౩౭

లలిత.

పల్లవి

గోవిందాశ్రిత గోకులబృందా ।
పావనజయజయ పరమానందా ॥

(చరణము)

జగదభిరామా సహస్రనామా ।
సుగుణధామ సంస్తుతనామా ।
గగనశ్యామా ఘనరిపుభీమా ।
అగణిత రఘువంశాంబుధిసోమా ।
జననుతచరణా శరణ్యశరణా ।
దనుజహరణ లలితస్వరణా ।
అనఘాచరణా యతభూధరణా ।
దినకరసన్నిభ దివ్యాభరణా ॥
గరుడతురంగా కారోత్తుంగా ।
శరధిభంగాపణిశయనాంగా ।
కరుణాపాంగా కమలాసంగా ।
వరశ్రీవేంకటగిరిపతిరంగా ॥ ౨౩౮

గౌళ.

పల్లవి

తరితీపులం బెట్టిని తనముందరనిప్పుడు ।
హరిమాయ యింకనెంత ఆశలముంచునో ॥

(చరణము)

అన్ని వేడుకలుగల యఖిలప్రపంచము ।
కన్నులుమూసితే నెక్కడనుండునో ।
చెన్నుమీర గృహారామక్షేత్రాదు లవియెల్ల ।
కొన్నగా నిద్రించువేళ యేడనుండునో ॥

పాసంగ తాభోగించిన భోగోపకరణములు ।
మొసగం గానకెక్కితే నేమిసేసునో ।
వశమైన పుత్రమిత్రవర్గంబులెల్లను ।
వేసవెకొక్కజన్మపువేళ నెట్టులుండునో ॥

పరగం తాఁజేసినపాపము శ్రీవేంకటేశు ।
శరణాగతుండైతే నేచందమగునో ।
అరుదైన తనతోట్టి యజ్ఞానములన్నియును ।
గురుకృపగలవేళ కొంచియెందుదాగునో ॥

భైరవి.

పల్లవి

అక్కటా ప్రాణికిని అహంబ్రహ్మాత్వమేకాని ।
దిక్కుదెసయైనవానిం దెలుసుకోనేపండు ॥

(చరణము)

కలలోన సృజియించుగ ర్తకారౌ యంతర్యామి ।
లలిం బ్రపంచ మింద్రజాలములవలె ।

తలపోయుజీవుండు తనకృత్యములుగావు ।
వెలినెందుబుట్టెనని విచారించుకొండు ॥
యెదుటనే పొడమించుయీహూపు లాత్మేశుండు ।
కదిసిపురాణముల కథలవలె ।
వదలక జీవుండెవ్వరిని నియమించలేడు ।
పదరక మూలముట్టుభావించుకొండు ॥
కనిపించు మోక్షమిక్కడ శ్రీవేంకటేశుండు ।
పనివడి తన తపఃఫలమువలె ।
ఘనతం బొదుజీవుండె కమ్మర్మము వాఁడుగాడు ।
గొనకొన్న మహిమల గుఱుతెంచుకొనుడు ॥ ౨౭౦

సాళంగనాట.

పల్లవి

తమసత్వమెఱింగియు దాచిరిగాక ।
తమునేలె రాము స్వతంత్రముచూపవలసి ॥

(చరణము)

హనుమంతుని తోక నసురలందరుఁగూడి ।
మును లంకలో నగ్ని ముట్టించెవేళను ।
అనలము శీతోభవయనునేర్చిన సీత ।
పని విరావణహాతోభవయన నేరదా ॥
అంకెలజలధిదాటి యటరామునిముద్రిక ।
సంకెలేక చేతంబట్టిసాహసమున ।
లంకాధిదేవతయైన లంకిణింగొట్టినవాడు ।
వుంకించి రావణుంజంపనోపండా వాయుజుండు ॥
శ్రీవేంకటేశుండైన శ్రీరాఘవునిపంపున ।
వావిరి నంగద ముఖ్యవానరులెల్ల ।
ఆవేళహోమపాత్ర లగ్నిలోవేశినవారు ।
రావణునందులోవేశిరానోపరా ॥ ౨౭౧

కాంభోధి.

పల్లవి.

కాదు వివేకము యిదికాదు యవివేకము ।
సోదించి నీకె శరణు జొరవలెగాని ॥

(చరణము)

కందువ దొల్లిటిజన్మకథ యేమినెఱంగడు ।
ముందరిజన్మమునకు మంచిపుణ్యముసేసెను ।
యిందేమిగనెనో దేహియెవ్వరినమ్మెనో తాను ।
సందడిభోగములలో సాములుసేసెను ।
గరిమ భూమండలము కడపలగానండు ।
పరముగావలెననీపాట్లంబడి దేహి ।
యిరవు దనకు నేదోయెఱింగినయెఱుగదో ।
పరగినయాసలకే పట్టిపెనంగిని ॥

తగ నిదురించువేళ తనస్వతంత్రములేదు ।
మిగుల నుద్యోగించు మేలుకొనవేళ ।
నిగిడి శ్రీవేంకటేశ నీవంతరాత్మవనక ।
వెగటుజదువులలో వెదకజూచితివి ॥ ౨౭౭

మధ్యమావతి.

పల్లవి

యిప్పుడు నమ్మినవారి కింతకంటె సులభుండు ।
తప్పకతలంచుకోరో దైవజ్ఞులారా ॥

(చరణము)

సీతావిరహామార్చి శ్రీరామచంద్రుండు ।
భ్రాతయైనలక్ష్మణుని బాయలేదాయె ।
ఆతుమబంధువులకంటె నెడబాయక కొలిచె ।
నీతికైంకర్యపరుండే నిజబంధుడాయెను ॥

వడి దశరథుం బాసివచ్చిన రాఘవునికి ।
కడుసుగ్రీవు చుట్టరికముగలిగె ।
తడయక కనిపించె తలిదండ్రులకంటె ।
నడరిన సేవకుండె యంతరంగుండాయెను ॥

మచ్చికతో భరతునిమాటమీరిన రాముండు ।
మెచ్చి విభీషణుభక్తి మీరలేడాయ ।
అచ్చపు శ్రీవేంకటేశా అన్నదమ్ములకంటెను ।
తచ్చి శరణాగతుండె తగనిష్టుడాయెను । 273

భైరవి.

పల్లవి

వానివాని స్వభావము వద్దనరాదు ।
తానందుఁ దొరలనంటె తప్పులులేవు ॥

(చరణము)

సొరిది చింతపులుసు చూచితే నోరూరును ।
వరుసలం జవిగొన్నవాడుగాడు ।
పరగ దేహప్రకృతిపదార్థగుణములవి ।
తొరలకెఱుంగు కొంటే దోషములేదు ॥

నెలకొన్న యింతుల వర్ణించితే బుద్ధిచలించు ।
వలసి యంటిముట్టినవాడుగాడు ।
తలంపు లక్ష్యము గురి దాకిన భావములవి ।
తలంకక తెలిసితే తగులేమిలేదు ॥

రీతితో సర్వము మంత్రించితే కరవదు ।
వాతసూత్రము గట్టినవాడుగాడు ।
యీతల శ్రీవేంకటాద్రి యీశ్వరుమహిమలివి ।
యతులంగొలిచితే యేకర్మములేదు ॥ 274

త్యాగరాజ కవుల కృతులు

పల్లవి

యేమరం జనదు బ్రదికేటికాలము యెఱింగినమహాత్ములకును ।
శ్రీమంతుండగు హరినే తలంచిన చీకటులన్నియుఁ బెడబాయు ॥

(చరణము)

చేసినుండెడిది బ్రహ్మలోకమట శ్వేతుండనురాజట భువిమీఁదికి ।
కారణమున నేతెంచి నిత్యమును కళేబరంబట తనకాహారము ।
అరయ సంపదలే పనికివచ్చునట లోకాంతరగతినేమున్నది ।
శ్రీరమణునికే శరణుచొచ్చినను చెడనిభోగములు చేచేతం గలుగు ॥

చేసినక్రతువులునూఱట నహుషుండుచెలంగుచు దేవేంద్రపట్టమేలెనట ।
దోసమించుకంతకుంగా భువిపైఁ దూలుచు బామైపడియెనట ।
ఆసలం గమ్మఁ ముమెట్టునమ్మెడిది అమరత్వము ఫలమదియెల్లించుట ।
వాసుదేవునింగొలిచి తానతనివాఁడై యుండిన నెలకొనుశుభము ॥

వెలయంగ త్రిశంకుండనియెటిరాజట విశ్వామిత్రుని పరిగ్రహంబట ।
అలరినచండాలత్వమొందెనట యంతరిక్షమున నుండెనట ।
బలుములు యెంచాక వెంటవచ్చునుపాయంబులు మఱిచెప్పంగనేల ।
యలఘరుండగు శ్రీవేంకటేశ్వరుని నెఱింగి దాసుండగుటేసత్ఫలము ॥౨॥

బౌళి.

కాదనిలోయంగ నెంతటివారలు ఘనసంసారులు నరులను సురలును ।
నీదాసులతో సంగతి సేయంగ నిర్మల చిత్తంబయ్యెగాక ।

(చరణము)

హరీ నీమాయే విజృంభించునట నడంచుటెవ్వారితరము ।
దరిగొని నీకె మ్రొక్కంగ తానెమన్నించుగాక ।

నిరతి నీయాజ్ఞ జగతింజెల్లునట నెట్టనవి దెగడువా రెవ్వరు ।
ధరణిలో నీవారమా యాడుకొనంగ తప్పులువట్టక కాచెంగాక ॥
ధాత నీసుతుండు పుట్టించువాడట తగదనితో యంగ నెవ్వండోపు నిక ।
ఆతుమలోని నుద్ధ్యానముసేయంగ నతండె మొగమోడెగాక ।
ఘాతల మదనుండు మదము రేచునట కాదనిగెలువంగగలరా యెవ్వరు ।
రాతిరింబగలును నిన్నే జపించంగ రతింగై వశమయ్యెగాక ॥
నీకల్పితమగు కర్మమంటునట నెఱవిడిపించంగ సమర్థు లెవ్వరు ।
చేకొని నీవెగతియనియుండగ చిక్కులంబెట్టక చనుంగాక ।
యీకడ శ్రీవేంకటేశ్వర నీవెయెందుంజూచిన నంతరాత్మవట ।
పైకొని నిన్నే నమ్మివుండగా బ్రసన్నుండవు నీవయ్యేవుగాక ॥ ౧౨౬

గుండక్రియ.

పల్లవి

శ్రీసతికరుణేదిక్కు జీవులకెల్ల ।
వాసుదేవుండా రమణివశమై యుండంగను ॥

(చరణము)

సీతవద్దనుండ రాముచే గాకాసురునకు ।
నాతలం బ్రాణమునిల్చె నపరాధియైనను ।
యతుల రావణాసురుం డిటువంటివాడె కాడా ।
కాతరాననింటెం జిక్కి ఖండతుండాలాయెను ॥
కదిశి రుక్మిణియుండంగ కృష్ణునిచే రుక్మికి ।
అదన బ్రదుకుగల్గె నతిద్రోహియైనను ।
యెదుటనే శిశుపాలుం డీరీతివాడె కాడా ।
తుద సభలో వదరి తునుకలై పడెను ॥
సిరితొడపై నుండంగ శ్రీనరసింహ్వాచే దైత్య ।
గురుపుత్రులు నిలిచిరి క్రూరకర్మములైనను ।
పరగ శ్రీవేంకటేశు పగగాడా హిరణ్యుండు
గరిమ నదరిపాటుగాగాబొలిసెను ॥ ౧౨౭

వొట్టి యంబరీషుండున్న వుపవాసమదియెంత ।
అట్టిచక్రము రక్షగానంపుటెంత ।
గుట్టువం ధామ్ముకుల్లైన గోపికలుగూడుటెంత ।
నెట్టన నిహపరాలునీవిచ్చుటెంత ॥
తలంచి గుహుండు వోడదాటించిన మాత్రమెంత
సులభాన నిందు గృపంజూచుటెంత ।
బలిమి శ్రీవేంకటేశ పరుషలకావికెంత ।
వలసినట్టు నీవిచ్చువరములివియెంత ॥ ౨౭౯

గుజ్జరి.

పల్లవి

వొకటికొకటి లంకెయివుండు నర్థములకెల్ల ।
సకలమునకితరసంగమేకారణము ॥

(చరణము)

కోరునేదైనా తనకుగోపరుచు నీమనసు ।
కోరితేనది రాకుండితే కోపమునుపుట్టు ।
అరయగోపమువల్ల నజ్ఞానముంచుకొను ।
పోకనజ్ఞానమునం బట్టార్వ్యమెల్లమఱచు ॥
చూచునేదైనను సాధింగన్నులెదుట ।
చూచినంతటిలోన సుద్దిపుట్టునాసలు ।
యేచినయాసలవల్ల యేమిటైన వేడంజూచు ।
యాచకముకడుదైన్యమందజేయునపుడు ॥
చేసునూతకెట్టిదైన చెల్లకేగి కర్మములు ।
సేసినయాకర్మములు చేరి జన్మములెత్తించు ।
వేసరక జన్మములు శ్రీవేంకటేశుడుంగొలిపించు ।
రాసికెక్క నిత్యుండై రక్షించు జీవుని ॥ ౨౮౦

పాడి.

పల్లవి

యిందుసాధించనియర్థ మెందును సాధింపరాదు ।
పొందుగాపంచాశ కోటిభూమండలమున ॥

(చరణము)

యెక్కుడుపాపమైతేను హీనజంతువై పొడము ।
మిక్కిలిపుణ్యమైతేను మించిదేవుండై జనించు ।
దిక్కులరెండుసరియైతే మనుష్యజన్మమహాను ।
చక్కగానిందునే ముక్తిసాధించవలయు ।
మెఱసిబాల్యమునందు మిక్కిలిబుద్ధిపుట్టదు ।
మఱివార్ధకమైతేను మందబుద్ధితోనుండు ।
తఱిం బ్రౌఢవయసున తగువివేకముపుట్టు ।
నెఱినిండె సుజ్ఞానము నిశ్చయింపవలయు ॥
కాంతలభ్రమంబడితె కడుమత్తుండై యుండు ।
అంతధనకాంక్షులైతె నలమటనలను ।
సంతతవిరక్తియైతె సర్వార్థములుచేరు ।
యెంతైన యిందె శ్రీవేంకటేశుం గొల్వవలయు ॥ ౨౧

కన్నడగౌళ.

పల్లవి

నేనెంతనీచుండనైనా నీకుంబోవునా ।
తానకమై నాలోనుండి తప్పించుకోవచ్చునా ॥

(చరణము)

సేసవెట్టిపెండ్లాడినచెలి యేరూపుదియైనా
వాసితోబతికివిడువంగవచ్చునా ।
కానుకంగొల్చినయట్టి కడుబేదబంటునైనా ।
వోసరించివొకరికి వొప్పగించవచ్చునా ॥

చేరి తనవాకిలిగాచె శునకమునకైనా ।
వూరకాహారమువెట్టకుండవచ్చునా ।
అరయఁగాగన్నబిడ్డ అంకెకెంతరాకుండినా ।
కూరిమించేకొనక తాగోపగించవచ్చునా ॥

పెంచినచిలుక యెంతపేరుకుచ్చి తిట్టినను ।
మంచిముద్దాడుటగాక మొత్తవచ్చునా ।
నించిశ్రీవేంకటేశుండ నీదాసులందు నేరమి ।
యించుకగలిగెనా మన్నించకుండవచ్చునా ॥ ౫౨

దేవగాంధారి.

పల్లవి

యెంతగాలం బైనదప్పదు యెవ్వరికి నేమనంగవచ్చును ।
దొంతికడవలలోని కొలుచులు తొలుతపుణ్యములు ॥

(చరణము)

కలిమిగలదని వుబ్బవలవదు కడంగిలేదని సగ్గవలవదు ।
విలసి కలలోగన్న సుఖదుఃఖములచందములు ।
వలనుగా రాట్నంపుగుండ్రల వరుసలీజన్మంబులెల్లను ।
చెలగిదైవముమున్నె సృష్టించినది యీవిధము ॥

నేరనని దైన్యంబదేటికి నేర్తునని గర్వంబదేటికి ।
నారుకొనువడగండ్లగుళ్లవి నమ్మనేరాదు ।
కోరిమనసునం బొలుద్రాగిన గుఱుతులీభోగంబులెల్లను ।
వారివారికి నాత్మగుణములు వసుధనిలిచినవి ॥

పెద్దదొరనని మీరందగదు పేదనని తాదాగందగదు ।
ప్రొద్దుప్రొద్దును చంద్రబింబముపోల్కి వెలసినది ।
అద్దుకొనిశ్రీవేంకటేశ్వరుండన్నిటికిం దను నేలికావంగ ।
బుద్ధియెఱుంగుచు లోకపూజ్యతం బొసంగుటే శుభము ॥ ౫౩

# తాళ్లపాక కవుల కృతులు

శుద్ధవసంత.

పల్లవి

పనికొనని సేవ్యుడే హరిభాగ్యము కొలందరయ్యెడి ।
తనకు నెదిరికిని దైవమేగురి ॥

(చరణము)

తిట్టుదిట్టెడి దండములకు దీవించేటందులకు ।
సట్టనాడేమనసు వొక్కనాలికేగుఱి ।
అట్టెసంతోషమునకు నలిగిత్రుళ్ళుంపులకు ।
మట్టుమీరియున్న తన మనసేగుఱి ॥

పాపకర్మమునకు బలుపుణ్యమునకును ।
దీపించరెంటికి నొక్కదేహమేగుఱి ।
వోపి కొండెమువినంగ నోగిధర్మమువినంగ ।
కోపునర దేమవీనులు యువియేగుఱి ॥

పూవులవాసనలకు పొంచిదుర్గంధములకు ।
చేవమీరనొక్కట నాసికమేగుఱి ।
శ్రీవేంకటేశుసేవించ జీవులనుదర్శించ ।
కైవశమైయున్న తమకన్నులేగుఱి ॥ ౨౮౪

పాడి.

పల్లవి.

యేమనితలంచవచ్చు నెవ్వరింగాదనవచ్చు ।
కామించె వారివారి కర్మఫలమహో ॥

(చరణము)

చల్లనిచందురుండు సర్వమైనవారికి ।
వెల్లివిరివి రహికివెట్టయైతోచు ।
యెల్లవారికి నన్ను విలంబ్రాణాంతకుండు ।
వల్లనరోగికిదాన యరుచియైతోచును ॥

పమ్మినసంపంగిపూవు పరిమళమందరికి ।
తుమ్మిదకె విరసమైతోఁచుగాని ।
వుమ్మడిసూర్యుండెప్పుడు నొగి లోకబాంధవుండు ।
కమ్మి కలువలకె కడుబగయితోఁచును ॥

శ్రీవేంకటేశుండు శిష్టులకెల్లఁబ్రియుండు ।
భావింపంగ దుష్టకేభయంకరుండు ।
పావనపుహరినామ పఠన పుణ్యులమెచ్చు ।
యీవలావలి మూర్ఖుల కెరవయితోఁచును ॥ ౨౮౫

గుండక్రియ.

పల్లవి

తెలిసిచూచినవేళ దేవుండొక్కఁడెనిలిచి ।
నలువంకరక్షించంగ నవ్వెనీజీవుండు ॥

(చరణము)

నెలవై తండ్రి తొడపై నిద్రబోయెటిబాలుండు ।
కలలోనంబులింగని కడుమొఱవెట్టినట్టు ।
అలరి హరి యాధారమైయుండంగ మాయంజిక్కి ।
బలుసంసారబాధను భ్రమసె నీజీవుండు ॥

తటుకునరాజుంగొల్చి దండనుండె మనుజుండు ।
అట యింద్రజాలముచూచి యంబుధియీదినట్టు ।
ఘటన హరి తనకుకర్తయై యుండగాను ।
కుటిలపుటజ్ఞామునసం గుండెనీజీవుండు ॥

దరిద్రుండయినవాడు తక్కకకన్నులుమూసి ।
నిరుపమాంజనముచే నిదానముగన్నయట్టు ।
యిరవై శ్రీవేంకటేశుండిట్టె కరుణించగాను ।
మొరవులేనిభక్తిచే నీడేరుజీవుండు ॥ ౨౮౬

భైరవి.

పల్లవి

పరిపూర్ణున్ని కండవు నీకుబరాకున్నదా నిన్ను ।
మరిగివుండనిదె మూవల్లందవ్వాగాక ॥

(చరణము)

వినవా నీవేమిరైన విశ్వపల్లాపిమత ।
యెనసి విన్నవించని యెడ్డతనమింతేకాక ।
కనవా నీవిన్నియు నీకన్నుతేతుండుచూదినా ।
పనితో నాభావము చూపని నేరమిగాక ॥

పలుకవా నీవేమిరైన బహుశబ్దమయుండవు ।
అలరిపిలువని నాయవివేకమింతేగాక ।
నిలువవా నాముందర నిఖిలస్వరూపుండవు ।
తెలిసిచూడలేని సందేహమింతేకాక ॥

మన్నించవా నీవె మీమఅంగుజొచ్చితినంటె ।
పన్నిమత్తుడనై యున్న పాపకర్మముగాక ।
యిన్నిటశ్రీవేంకటేశ యేలితివినన్నునిట్టె ।
యిన్నాళ్లిణుంగని భాగ్యమిట్టుండెగాక ॥ అ౨

లలిత.

పల్లవి

తనివిలేక చీకటిదవ్వి దేహి ।
ఘనుండై హరింగొల్చితే కైకొనిరక్షింపడా ॥

(చరణము)

అందిరసవాదమున కానపడేటిమనసు ।
గొద్దిబిలములుచొచ్చి కూడపెట్టెటి మనసు ।
సంధించిమంత్రవాదాన సాదించేటిమనసు ।
యిందిరేశుపైంబెట్టితే నిన్నియునొసంగడా ॥ [illegible]

## సామంతం.

పల్లవి

యిట్టినాచెవులును యిచ్చేటినీయీవులును ।
గట్టిగా నేనల్పుండను ఘనుండవు నీవు ॥

(చరణము)

చిన్ననిమ్మపండేకదా చేతికిచ్చిరాజులచే ।
మొన్నరాని భూములకు నేలికయ్యేది ।
పన్ని పేరుకొని యొక్కపద్యముచెప్పికాదా ।
సన్నుల సర్వార్థములు చాగముగొనేటి ॥

గవ్వవేసితూదికదా ఘనమైనవజ్రము ।
చివ్వననువిలువలుచేసుకొనేది ।
అవ్వలజుట్టిడు తాటియాకువ్రాశివేశికదా ।
యెవ్వరిచే ధనమైన నిప్పించుకొనేది ॥

కనవుకట్టలువేసికదా గోవులచేత ।
కొసరుచుఁ బాలుపిండుకొనియెడిది ।
యెసగ శ్రీవేంకటేశ యిట్టినేమయొక్కకదా ।
పసగల నీకృపకుం బాత్రుండనైనది ॥ ౨౯౦

## కాంభోది.

పల్లవి

యీపాటిసుఖము యిలలోనికీవునికి ।
చేపట్టి యింతసేసిన శ్రీపతి నెఱుంగడు ॥

(చరణము)

నిరతింగట్టివేసినవానివిడిచి మోపెత్తితే ।
పరువువారు సంతోషపడినయట్లు ।
దరిద్రుండైనవాని తగురాజుగాజేసితే ।
మురిసివేడుకతోని ముందరయెఱుంగడు ॥

గుండుమోయునట్టివాని గొప్పయాతమె త్రించితే ।
అండనే పాడుచు నలపార్చుకొన్నట్లు ।
పండనితపసిం దెచ్చి బలుసంసారిం జేసితే ।
దండితనమే కాని యందలిపాల్లించడు ॥

పట్టి దున్నే యెద్దుం దెచ్చి బండిగట్టినురిపితే ।
నట్టిగవుక మేనిమల్లాడినయట్లు ।
గట్టిగా శ్రీవేంకటేశ కష్టునింబుణ్యుం జేసితే ।
వట్టియహంకారియై యెవ్వరినిఁ గైకొనండు ॥ ౧

గుజ్జరి.

పల్లవి

యెవ్వరునాకుదిక్కు యేమనిచెప్పుదునింక ।
అవ్వలికినివ్వలికి హరినీవె కాక ॥

(చరణము)

యెన్నటిప్రతిబంధమో యెంచం గామక్రోధములు ।
పెన్నాడి నేబుట్టితేను వెంటంబుట్టిని ।
మున్నిటికోలమెట్టిదో మోహమదమత్సరము ।
లన్నిలోకములం జొచ్చినందుంజొచ్చిని ॥

కొక్కడిబ్బుణమో నాకు నీదేహభోగములు ।
ప్రక్కన నేడనుండినాబడివాయవు ।
తక్కకేనాటికర్మమో తగంబుణ్యపాపములు ।
చిక్కులై కలలోనం జిమ్మిరేచిని ॥

యెందరి పగో కాని యీతమోరాజసములు ।
సందడించి చలములుసాదించిని ।
యిందున శ్రీవేంకటేశ యింతలో నన్నేలితివి ।
కిందుపడి యీపెనన్ను గెలిపించిని ॥ ౨

గదాటాడెవానింగంటె కన్నవారికి వేడుక ।
అడుగడుగు ప్రయాసములు వానికి ।
బడినుండు జతురంగబలములు దొరకును ।
చిడుముడి శత్రులపై చింతయాతనికి ॥

పాములవానింగంటె పద్మములకానందము ।
వోముచుఁ బ్రాణమువట్టుకుండునాతండు ।
యీమేర శ్రీవేంకటేశ యిల్లెల్లబెడె ఘనమున ।
కామినై భోగించదీరదాతనికిఁ బ్రొద్దును ॥ [illegible]

## ఛాయానాట.

పల్లవి

తలంప వెనకనుయ్యి తగరు ముందటదినం ।
దొలంగనాకుందెరువు దోపదేమిసేతు ॥

(చరణము)

మమకార విరక్తిమార్గ ధూతము నీకై ।
మమతసేయక నాకుమానరాదు ।
మమతమేమో నిర్మమతమేమో దీని ।
క్రమమునక్రమునే గాననేమిసేతు ॥

కర్మమార్గముజన్మగతికింతెరువ ని ।
ష్కర్మము పాతకమునకుందొడవు ।
కర్మిగావలెనో నిష్కర్మిగావలెనో యీ ।
మర్మంబు మదము మ్మానదేమిసేతు ॥

శరణాగతరక్షకుండవైనయట్టి ।
తిరువేంకటగిరిదేవుండా ।
పరిపూర్ణుండవో నీవుపరిచ్ఛిన్నుండవో ని ।
న్నరసి భజింపలేనైతి నేమిసేతు ॥ [illegible]

# తాళ్ళపాకం కవుల కృతులు

## మలహరి.

పల్లవి

పాలదొంగవద్దవచ్చిపాడేరు తమ ।
పాలిటిదైవమని బ్రహ్మాదులు ॥

(చరణము)

రోలంగట్టించుక పెద్దరోలలుగా వాపోవు ।
బాలునిముందరవచ్చిపాడేరు ।
ఆలకించి వినుమని యంబరభాగమునందు ।
నాలుగుదిక్కులనుండి నారదాదులు ॥
నోరునిండాజొల్లుగార నూగి ధూళిమేనితో ।
పారేటిబిడ్డనివద్దంబాడేరు ।
వేరులేనివేదములు వెంటవెంటంజదువుచు ।
జేరి చేరియింతనంత శేషాదులు ॥
ముద్దులుమోమునంగార మూలలమూలలదాగె ।
బద్దులబాలునివద్దబాడేరు ।
అదివో(శ్రీ)తిరువేంకటాద్రీశుండితండని ।
చదికివెండికివచ్చెసనకాదులు ॥

## ధన్యాశి.

పల్లవి.

నందనందన వేణునాదవినోదము ।
కుందకుంద దంతహాసగోవర్ధనధరా ॥

(చరణము)

రామరామగోవింద రవిచంద్రలోచన ।
కామకామ కలుమవికారవిదూరా ।
ధామధామ విశ్వవత్ప్రితావరూపదనుజ ని ।
ధూమధామకరణచతురభవభంజనా ॥

కమలకమలవాస కమలరమణదేవో ।
త్తమ తమోగుణసతతవిదూర ।
ప్రమదత్ప్రియదానుభవభావకరణ ।
సుముఖసుధానంద శుభరంజనా ॥

పరమపరాత్పర పరమేశ్వరా ।
వరదవరదామలవాసుదేవ ।
చిరచిరఘనసగ శ్రీవేంకటేశ్వర ।
సరహరినామ పన్నగశయనా ॥ ౫౭

కన్నడగౌళ.

పల్లవి

వెలికివెళ్లండు చలికివెరవండు ।
వులికి నులికినులికెనయ్యా ॥

(చరణము)

రోగియై తా రుచులంబాయఁడు ।
భోగియై రతిపొందొల్లఁడు ।
వేగిమిగిలిన వెడచీకటి నీరు ।
త్రాగిద్రాఁగిదాగెనయ్యా ॥

తొడికిఁదొడుకండు వుడికినుడుకండు ।
కడికిగఱరండు కడుంజేరండు ।
మడికిగుడికిమానిన మమతలం ।
బుడికిఁబుడికిఁబుడికియ్యా ॥

నిండినిండండు నెరసినెరయండు ।
పండిబండండు బయలింతల ।
అండనే తిరువేంకటాధిపుందలంచుచు ।
నుండినుండినుండెనయ్యా ॥ ౫౮

## ధన్యాశి.

పల్లవి

దేవదేవం భజే దివ్యప్రభావం ।
రావణాసురవైరి రఘుపుంగవం ॥

(చరణము)

రాజవరశేఖరం రవికులసుధాకరం ।
ఆజానుబాహుం నీలాభ్రకాయం ।
రాజారికోదండ రాజదీక్షాగురుం ।
రాజీవలోచనం రామచంద్రం ॥

నీలజీమూతసన్నిభశరీరం ఘనవి ।
శాలవక్షసం విమలజలజనాభం ।
కాలాహినగహరం ధర్మసంస్థాపనం ।
భూలలనాధిపం భోగశయనం ॥

పంకజాసనవినుత పరమనారాయణం ।
శంకరార్జిత జనకచాపదళనం ।
లంకావిశోషణం లాలితవిభీషణం ।
వేంకటేశం సాధువిబుధవినుతం ॥

## ఆహిరి.

పల్లవి

యెడమపురివెట్టె పరహితవివేకములోన ।
గడుసువడెం జదువుమెఱుంగులు వారెంజలము ॥

(చరణము)

లంపమేయుంగఁదొణంగె లలితంపుమతిలోన ।
తెంపుదిగవిడిచె యెడతెగనిమానంబు ।
చంపదొరకొనియె వెనటలేనితమకంబు ।
యింపుఘనమాయె నేనింకనేమిసేతు ॥

బయలువందిలివట్టిపనిలేనిలంపటము ।
దయవిడువం దోడంగె చిత్తములోనికాంక్ష ।
పయికొన్న మోహంబు పడనిపాట్లంబరచె ।
లయమాయె శాంతి మెల్లనెతీరె నెరుక ॥

చావుంబుట్టువుమఱచె సంసారబంధంబు ।
దైవమునువిడిచె యాదరికంపుఁబ్రియము ।
శ్రీవేంకటేశ్వరుండు చిత్తరంజకుండు యింక ।
గావలసినది యతనికరుణ ప్రాణులకు ॥ ౩౦౦

## శ్రీరాగం

### పల్లవి

యెంతగాలమోకదా యీదేహాధారణము ।
చింతాపరంపరలం జిక్కువడవలసె ॥

### (చరణము)

వడిగొన్న మోహంబు వలలందగులైకదా ।
కడలేనిగర్భనరకములందవలసె ।
నరిమిసుఖములచేత ననువుసేయంగగదా ।
తొడరిహేయపుదిడ్డిందూరాడవలసె ॥

పాపపుంజములచే పట్టువడంగాగదా ।
ఆపదలతోడి దేహముమోయవలసె ।
చూపులకులోనైన సుఖముగానకకదా ।
దిపనభ్రాంతిచెందిరి గాడవలనె ॥

హితుండైన తిరువేంకటేశుంగొలువకకదా ।
ప్రతిలేని నరకకూపమునం బడవలసె ।
అతనికరుణారసంబబ్బకుండంగఁగదా ।
బ్రతిమాలి చలుఁగడలఁబొరాడవలసె ॥ ౩౦౧

నాట.

పల్లవి

తెలిసినం దెలియండు తెలియనివారలు ।
దొలంగుదు బ్రహ్మాదులె యెఱుంగుదురు ॥

(చరణము)

వరదుండఖిలదేవతలకు వంద్యుండు ।
గరదుండసురలకుఁగంటకుండు ।
పరమాత్ముండంబుజభవ శివాదులకు ।
బరులకెల్ల మువ్వురిలోనొకండు ॥

దేవుండు సనకాదిమునులకును బర ।
దైవమఖిలవేదములకును ।
కైవల్యమొసంగు ఘననిధివిధికి ।
మహావిధి జడులకు యాదవకులుండు ॥

ఆద్యుండచలుండు మహాభూతమితం డ ।
భేద్యుండసాధ్యుండు భీకరుండు ।
సద్యఃఫలదుండు సకలమునులకును ।
వేద్యుండితండవో వేంకటవిభుండు ॥ 3౦౨

సామంతం ॥

పల్లవి

యెక్కువకులజుండైన హీనకులజుండైన ।
నిక్కమెరింగిన మహానిత్యుండెఘనుండు ॥

(చరణము)

వేదములుచదివియును విముఖుండై హరిభక్తి ।
యాదరించని సోమయాజికంటె ।
యేదియునులేని కులహీనుండైనను విష్ణు ।
పాదములుసేవించు భక్తుండెఘనుండు ॥

పరమమగువేదాంతపఠనదొరకియు సదా ।
హరిభక్తిలేనిసన్న్యాశికంటె ।
సరలిమాలినయంత్యజాతికులజుండైన ।
నరసి విష్ణునివెదకు నాతండఘనుండు ॥

వినియుజదివియును శ్రీవిభునిదాసుండుగాక ।
తనువుపెంపుచునుండుతపసికంటె ।
మొనలేని శ్రీవేంకటేశుప్రసాదాన్న ।
మనుభవించిన యాతండప్పుడెఘనుండు ॥ 303

శ్రీరాగం.

పల్లవి

కనుఁగొనంగ జీవుండె రంగండు గాక మెరింగినను ।
అనవరత విభవంబులప్పుడెరావా ॥

(చరణము)

విసుగకెవ్వరినైన వేడనేర్చిననోరు !
దెసలకునుఁ బలుమారుఁ దెరచునోరు ।
వసుధాకళత్రుం దడవదుగాక తడవినను ।
మొసంగఁ గోరికలు తనకిప్పుడెకావా ॥

ము. దమంది యెవ్వారికిమ్రొక్కనేర్చినచేయి ।
వొదిగి యథములనడుగఁబూనుచేయి ।
అదనహరింబూజసేయదు గాక సేసినను ।
మొదురెదురంగోరికలు యిప్పుడెరావా ॥

తడయకేమిటికైనఁ దమకమందెడిమనసు ।
అడరియేమిటికైన నలయుమనసు ।
కడివేంకటేశుగొలువదుగాక కొలిచినను ।
బడిబడిన చెడనిసంపదలిట్లురావా ॥ 3౦౪

ముఖారి.

పల్లవి

జనులు నుమరులును జయలిడంగా ।
ఘనుండదె వుయ్యాలకంభముకాడ ॥

(చరణము)

వదలకవలసినవారికివరములు ।
యెదురెదురై తానిచ్చుచును ।
నిదురలేక పెనునిధినిధానమైన ।
కదలండదె గరుడగంభముకాడ ॥

కోరినవారికి కోరినవరములు ।
పూరంతప్రౌద్ధునొసంగుచును ।
చేరువయై కృపసేసినిదివో ।
కూరిమిలనడిమిగోపురమేడ ॥

వడివేంకటపతి వరములరాయుండు ।
నడుగం గాళ్లుంగన్నులుసతులా ।
బడిబడినొసంగుచుం బ్రాణాచారులకు ।
కదిమి నీడదిరుగని చింతలా ॥ 304

బౌళి.

పల్లవి

కొండదవ్వుట యెలుకంగోరిపట్టుట దిన ।
బండాయెసంసారబంధము ॥

(చరణము)

పెలయుచిత్తంబునకు వేరుపురుపై బుద్ధిం ।
గలంగించెమోహావికారము ।
కలకాలమునకు లింగము మీదియెలుకయై ।
తలకొనియెనాత్మ పరితాపము ॥

యరయుజంచలముచే నాలజాలంబువలె ।
దిరుగదొరకొనియె దనదేహము ।
తిరువేంకటాచలాధిపుని మన్ననగాని ।
పరిపాటింబడదు తనభావము ॥ ౩౦౬

భైరవి.

పల్లవి

వీడివో యిదె వింతదొంగా ।
వేడిపాలువెన్న యెరింగినదొంగ ॥

(చరణము)

వెలయునిటంజొప్పువేసేటిదొంగ ।
తలగానసీక దాగుదొంగ ।
తలంకక నేలదవ్వేటిదొంగ ।
తెలిశిసందకాడ దిరిగేటిదొంగ ॥

అడుగుక్రిందమోపక మడచేటిదొంగ ।
అడరితల్లికినైన నలుగుదొంగ ।
అడవిలోనెలవై యున్నదొంగ ।
తొడరి నీలికాశతోనుండుదొంగ ॥

మోసమింతులంజేయు మునిముచ్చుదొంగ ।
రాసికెక్కినగుట్టుపుదొంగ ।
వేసాలకిటువచ్చి వేంకటగిరిమీద ।
మూసినముత్యమై ముదమందుదొంగ ॥ ౩౦౭

శ్రీరాగం.

పల్లవి

త్వమేవ శరణం త్వమేవ శరణం ।
కమలోదర శ్రీజగన్నాథా ॥

(చరణము)

వాసుదేవ కృష్ణ వామన నరసింహా ।
శ్రీసతీశ సరసిజనేత్రా ।

భూసురవల్లభ పురుషోత్తమపిత ।
కౌశేయవసన జగన్నాథా ॥
బలభద్రానుజ పరమపురుష దుగ్ధ ।
జలధివిహార కుంజరవరద ।
సులభసుభద్రా సుముఖసురేశ్వర ।
కలిదోషహరణ జగన్నాథా ॥
వటపత్రశయన భువనపాలనజంతు ।
ఘుటకారకరణ శృంగారాధిప ।
పటుతర నిత్యవైభవరాయ ।
తిరువేంకటగిరినిలయ జగన్నాథా ॥ ౩౦౮

సామంతం.

పల్లవి

ఆదిదేవుండనంగ మొదలనవతరించి జలధిసొచ్చి ।
వేదములును శాస్త్రములును వెదకితెచ్చెనితండు ॥

(చరణము)

వాలితిరుగునట్టి దైత్యవరుల మోహవతులనెల్ల ।
మూలమూలం ద్రోశి ముసుగుపాలుసేసె నితండు ।
వేలసంఖ్యనైన సతుల వేడుకలలరంజేసి వొంటి ।
నాలిమగనిరీతింగూడి యనుభవించెనితండు ॥
కడుపులోని జగములెల్లం గదలకుండంబాపరేని ।
పడకనొక్కమనసుతోడం బవ్వళించెనితండు ।
అడుగుక్రిందలోకమెల్ల నడంచఁదలంచి గుఱుతుమీఱ ।
పొడవువెరిగిమిన్ను జలము పొడిచితెచ్చెనితండు ॥
కొండెవయసునాడు మంచి గోపసతులమనములెల్ల ।
ఆడికెలకునోపి కొల్లలాడిబ్రదికె నితండు ।
వేడుకలర వేంకటాద్రి వెలశి భూతకోటి దన్నుం ।
జూడుండనుచు మోక్షపదముచూరవిడిచె నితండు ॥ ౩౦౯

ముఖారి.

పల్లవి

మాదృశానాం భవామయదేహానాం ।

ఈదృశం జ్ఞానమితి యేపి న వదంతి ॥

(చరణము)

వాచామగోచరం వాంఛ్యా సర్వత్ర ।
నీచకృత్యైరేవ నిబిడీకృతా ।
కేచిదపివా విష్ణుకీర్తనం ప్రీత్యా ।
సూచయంతో వా శ్రోతుం న సంతి ॥

కుటిలదుర్భేదనం కూహకం సర్వత్ర ।
విటవిడంబనమేవ వేద్మ్యధికం ।
పటువిమలమార్గసంభావనపరసుఖం ।
ఘటయితుం కష్టకలికాలే న సంతి ॥

దురితమిదమేవ జంతునాం సర్వత్ర ।
విరసకృత్యైరేవ విశదీకృతం ।
పరమాత్మానం భవ్యవేంకటనామ ।
గిరివరం భజయితుం కేవా న సంతి ॥ ౩౧౦

శ్రీరాగం.

పల్లవి

కాకున్న సంసారగతులేల ।

లోకకంటకములగు లోభంబులేల ॥

(చరణము)

వినికిగనవలసినను విష్ణుకీర్తనచెవికి ।
వినికిచేసిననదియె వేదాంతబోధ ।
మనికిగనవలసినను మధువైరిపై భక్తి ।
పునికింప్రాణులకు బ్రహ్మోపదేశంబు ॥

చదువుగనవలసినను శౌరినామము దిరుగం ।
జదువుటే సకలశాస్త్రమూలసమ్మతము ।
నిదురగనవలసినను నీరజాక్షునికి దన ।
హృదయమర్పణసేయుటది యోగనిదుర ॥
ఆసవలశిన వేంకటాద్రీశ్వరునికృపకు ।
నాససేయుట పరమానందసుఖము ।
వాసిగనవలసినను వైష్ణవాగారంబు ।
వాసిసేయుట దనకువైభవస్ఫురణ ॥ ౩౧౧

దేశి.

పల్లవి

జీవుండెంతటివాడు చిత్తమెంతటది ।
తనదైవికముగడవ నెంతటివాడుదాను ॥

(చరణము)

విడిచివోవనియాస విజ్ఞానవాసనలం ।
గడచి మున్నాడె నెక్కడివివేకములు ।
వుడుగనియ్యని మోహమిచ్చి పరమార్థముల ।
మొడవట్టినూకె నేమిటికింక నెరుక ॥
పాయనియ్యని మహాబంధమధ్యాత్మతో ।
రాయడికిందొడంగె స్థైరణలేలకలుగు ।
మాయనియ్యని కోపమహిమకరుణామతిని ।
వాయెత్తనియ్య దెవ్వరికిం జెప్పదుము ॥
సరిలేనియాత్మచంచలమంతరాత్మకుని ।
నేరంగ నియ్యదు దనకునేటిపరిణతలు ।
తిరువేంకటాచలాధిపుని మన్ననగాని ।
వెరసి యిన్నిటిగెలువ వెరవుమఱిలేదు ॥ ౩౧౨

వరాళి.

పల్లవి

యేమిగల్గదిందు నెంతసేసినంగిన వృథా ।
కామితపు మనస్సునకు కడమొదలులేదు ॥

(చరణము)

వత్తిలోపలినూనెవంటిది జీవనము ।
విత్తుమీఁదటి పొల్లువిధము దేహంబు ।
భక్తిసేయుటయేమి పాసిపోవుటయేమి ।
పొత్తులసుఖంబులకు పోరలుటలుగాక ॥

ఆకాశపాకాశ మరుదైనకూటంబు ।
లోకరంజకము తమలోనిసమ్మతము ।
చాకిమణుగులజాడ చంచలపు సంపదలు ।
చేకొనిననేమి యివిచెదరిననునేమి ॥

గాదెలోపిపీలికంబులు కర్మసంసారంబు ।
వేడివిడువనికూడు వెడమాయబ్రదుకు ।
వేదనలనెడతెగుట వేంకటేశ్వరుకృపా ।
మోదంబువడసినను మోక్షంబుగనుట ॥ ౩౧౩

శ్రీరాగం.

పల్లవి

కొంచమును ఘనముం గనుగొననేల హరిందలంచు
పంచమహాపాతకుండె బ్రాహ్మణోత్తముండు ॥

(చరణము)

వేదములు చదివియును విమతుండై హరికథల ।
నాదరించని సోమయాజికంటె
యేదియునులేని కులహీనుండైనను విష్ణు ।
పాదసేవకుండు బ్రాహ్మణోత్తముండు ॥

పరమమగు వేదాంతపఠన దొరకితేను ।
సదాహారిందలంచలేని సన్న్యాసికంటె ।
మరిగిపసురముఁదినెడి మాలయైనను వాఁడె ।
పరమాత్ముఁగొలిచినను బ్రాహ్మణోత్తముండు ॥

వినితేనుం జదివియు రమావిభునిం దలంపక వృథా ।
తనువువేపుచుందిరుగు తపసికంటె ।
చనవుగల వేంకటేశ్వరుదాసులకు వెంటంబడి ।
దిరుగు నధముండె బ్రాహ్మణోత్తముండు ॥ ३०८

బౌళి.

పల్లవి

తెలిసియు నత్యంత దినుండె ।
తన్నుం దెలియుంగ గోరెటి తెలివెపో తెలివి ॥

(చరణము)

వలచినసతి దన్ను వడిం గాలందన్నిన ।
అలరి మొట్లనుబ్బునటువలెనె ।
తలంకకెవ్వరు గాలందన్ని నామతిలోన ।
అలుగక ముదమందునదిపో తెలివి ॥

అరిదిమోహపువనిత ఆలిప్పై దిట్టిన ।
సరవిరై చొక్కినయటువలెనె ।
పరులు దన్ను వెలుపల నిట్లంబలికిన ।
అరలేక రతింజొక్కునదిపో తెలివి ॥

తనివోక ప్రియకాంత తమ్ములపురసమాన ।
ననయమును నటుగోరునటువలెనె ।
తనర వేంకటపతి దాసులప్రసాదంబు ।
అనిశమునుఁ గొనంగోరునదివో తెలివి ॥ ३०९

## అధ్యాత్మ సంకీర్తనలు

### గుండక్రియ.

పల్లవి

పోరాకపోయి తలంపున నున్నదైవంబు ।
జేరనొల్లక పరులంజేరం దిరిగెదము ।

(చరణము)

పడింబారు పెనుమృగము వలలలోపలఁదగులు ।
పడి వెడలగతిలేక పడఁకుచున్నట్లు ।
చెడనికర్మములలోఁజిక్కి భవముల బాధం ।
బడియెదము గాక యేపనికిం దిరిగెదము ॥

నీరులోపలిమీను నిగిడియామిషముకై ।
కోరిగాలముమ్రింగి కూలఁబడినట్లు ।
జారిపోయిననేల సంసారసౌఖ్య ।
వికారంబు మోహములం గట్టువడియెదము ॥

శ్రీవేంకటేశునాశ్రిత లోకరక్షకుని ।
భావింప దేవతాపతియైనవాని ।
సేవించుభావంబు చిత్తమొడంబడకనె ।
మీవలావలిపనుల నిట్లందిరిగెదము ॥ ౩౧౭.

### శ్రీరాగం.

పల్లవి

సకలసందేహమై జరగుచున్నది యొకటి ।
ప్రకటింప జీవమో బ్రహ్మమో కాని ॥

(చరణము)

వసుదేవుజఠరమను వననిధికి జంద్రుడై ।
అసమానగతిం బొడమినాడితండు ।
వసుధం జంద్రుఁడు నీలవన్నెఁ గాండేటికి నాయు ।
కసరెత్తినునుం గద్దు గలయంగొనంబోలు ॥

ఇనవంశమున లోకహిత కల్పభూజమై ।
అనఘుండై జనియించి నాఁడితండు ।
నను వైన సురతతులు నల్ల నేఁటుకినాఁడై ।
పెనుఁగొమ్మలో బెంగ పెరిగికాఁబోలు ॥

తిరువేంకటాద్రిపైం దెలియుచుంటామనై ।
అరిదివలె బొడచూపె నాఁడితండు ।
గరిమె నదియిపుడు చీకటివన్నెకామేఘము ।
హరినీలవర్ణముల ప్రభ లలమినొనంబోలు ॥ ౩౧౭

ముఖారి.

పల్లవి

చిరతనుండు శ్రీవత్సుండు ।
పరమం భవ్యం పావనం ॥

(చరణము)

వేదమయుండు గోవిదుం డమలుండు పరుం ।
డాదిపురుషుండు మహామహుండు ।
యేదెసనేమని యేదిదలంచిన ।
నభేదమవాద మఖిలసమ్మతం ॥

నిఖిలనిలయుండు మునివరదుం డధికుండు ।
మఖముఖ భోక్తాభిమతరతుండు ।
శిఖరం శివం సుశీల మమృతమయం ।
ముఖరం ముఖ్యంమూలమిదం ॥

అనేకప్రదుదుం ఘనాదివిష్ణుండు ।
ఘనుండీ తిరువేంకటనిలయుండు ।
దినందినం సముచిత రక్షకోటు ।
భజనం సిద్ధాయనం ధనం ॥ ౩౧౮

సౌరాష్ట్రం.

పల్లవి

యిందరికి నభయంబులిచ్చుఁజేయి ।
కందువగు మంచిబంగారుచేయి ॥

(చరణము)

వెలలేనివేదములు వెదకి తెచ్చిన చేయి ।
చిలుకుగుబ్బలిక్రిందఁజేర్చుఁజేయి ।
కలికియగుభూకాంతఁగౌగిలించినచేయి ।
వలనైనకొనగోళ్ల వాడిచేయి ॥
తనివోక బలిచేత దానమడిగినచేయి ।
వొనరంగ భూదానమొసఁగుచేయి ।
మొనసిజలనిధియమ్ము మొనకుఁదెచ్చినచేయి ।
యెనయ నాఁగేలుధరియించుచేయి ॥
పురసతులమానములు పొల్లసేసినచేయి ।
తురగంబుఁబరపెడిదొడ్డచేయి ।
తిరువేంకటాచలాధీశుండై మోక్షంబు ।
తెరువుప్రాణులకెల్లఁదెలిపెడిచేయి ॥ ౩౧౯

పాడి.

పల్లవి

అందరిబ్రదుకులు నాతనివె ।
కందువెల్ల శ్రీకాంతునిదె ॥

(చరణము)

వేమరుం జదివెడి విప్రులవేదము ।
సోముకవైరి యశోవిభవం ।
శ్రీమించునమరుల జీవనమెల్ల ।
సుధామథనుని సంతతకరుణే ॥

హితవగు యిలలోని సుఖమెల్లను ।
దితిసుత దమనుండు దెచ్చినదె ।
తతి తల్లి దండ్రితానై కాచిన ।
రతి ప్రహ్లాదవరదుని కృపె ॥

అలరిన యమరేంద్రాదుల బ్రదుకులు ।
బలిబంధానుకృపంబరగినవే ।
బలసి మునులయాపదలు వాపుటకు ।
బలునృపభంజను పరిణతలె ॥

పూని యనాథుల పొందుగఁగాచిన ।
జానకివిభుని సరసతలె ।
నానాభూషణంబులు నందుని ।
సూనుండు చేసిన సుకృతములె ॥

తలకొనిధర్మము తానై నిలుపుట ।
కలుషవిదూరుని గర్వములె ।
నిలిచిలోకములు నిలిపినఘనుఁడగు ।
కలియుగమున వేంకటపతివె ॥ 3.౨౦

కన్నడగౌళ.

పల్లవి

పాయక మతినుండి పరగు మేలుం గీడును ।
చేయించి కర్మికిఁ దాఁ జేయు టెవ్వరిది ॥

(చరణము)

వెల్లయఁజరాచరవిభుండైన విభునాత్మం ।
దల్లడముఁగాక ప్రాణి దానేమిసేయు ।
తెలిపి నిష్కామలభక్తి దీపించి తనుజేరం ।
గొలుపించుకొనలేమి కొరత యెవ్వరిది ॥

కొందరు సుఖులై కొదలేక మెలఁగంగ ।
కొందరి దుఃఖపుకొరత యెవ్వరిది ।
అందరిమతి వెంకటాద్రివల్లభ నీవు ।
చెంది కర్మగుణములంజేయు చేతయెవ్వరిది ॥ 3 ౨౧

ఆహిరి.

పల్లవి.

యెండలోనినీడ యీమనసు ।
పండుగాయె నేయంబనిలేదు మనసు ॥

(చరణము)

వానచేత కమ్ములవలెనాయె మనసు ।
గోనెంబట్టినబంగ గుణమాయెమనసు ।
మానంజిక్కినకొలవంత మాయెమనసు ।
తేనెలోపలి యీఁగతెఱఁగాయె మనసు ॥

గడిరాజుబ్రదుకాయె కడలేనిమనసు ।
నడివీధిపసరాయె నయమైనమనసు ।
గడకుగట్టిన పాతగతి దోఁచెమనసు ।
అడుసులోపలి కంబమై తోఁచెమనసు ॥

తెరువుచూపినజాడఁ దిరుగునీమనసు ।
మరుగుఁజేసినచోట మరుగునీమనసు ।
తిరువేంకటేశుపై దిరమైనమనసు ।
శిరిగలిగినచోట జేరు నీమనసు ॥ 3 ౨౨

భూపాళం.

పల్లవి

అలర నుతించరో హరిని ।
మెలయించి మిము భ్రమయించి నీ[illegible]

(చరణము)

సేయరో మనుజులార చింత హరినింకనైన ।
రోయరో మీభుజియించు రుచులమీద ।
కాయమస్థిరము యీకలిమిధ్రువముగాదు ।
జోయెంబో యెందుకుఁగాక వోయెం గాలము ॥

మెచ్చరో మనుజులార మీరే హరికథలు ।
పుచ్చరో మీమదిలోని పొరలెల్లను ।
కొచ్చరో మనుజులార కోరికెలెల్లను మీకు ।
నిచ్చి శుభములు యివియెల్ల కాలము ॥

కనరో వెంకటపతిం గన్నులుఁ దనియంగ ।
వినరో యీతనిస్తుతి వీనులునిండ ।
మనరో శ్రీహరిచేతి మన్ననలుమీరు ।
తనమీఁదిమది బుద్ధిదాఁచినగాలము ॥ 3 ౨3

ధన్యాశి.

పల్లవి

చదివెంబో ప్రాణి సకలము గూర ।
చదువుమీఁదివిద్య చదువడాయెగాని ॥

(చరణము)

శిరులు చంచలమని చేతల ధ్రువమని ।
పరగుసంసారము బయలని ।
తొరలిన సుఖమెల్ల దుఃఖమూలమని ।
యెరింగి లోభముపీడ నెరంగడాయెగాని ॥

తలకొన్నధర్మమే తలమీఁదిమోపని ।
వలసి నొల్లమి దైవవశమని ।
కలిమియు లేమియుం గడవంగరాదని ।
తెలిసి లోభముపీడ దెలియఁడాయెగాని ॥

యేచిన పరహితమెంతయు దమదని ।
వాచవులిన్ని నెవ్వగలని ।
యీచందమున వేంకటేశుచేతలని ।
చూచిలోభము వీడంజూడడాయొగాని ।  3౽౭౫

## శుద్ధవసంతం.

### పల్లవి

యెందుజూచినం దనకు నిన్నియును నిట్లనె ।
కందులేనిసుఖము కలనైననలేదు ॥

(చరణము)

సిరులుగలిగినఫలము చింతంబొరలనెకాని ।
సొరిది సంతోషమించుకయైనలేదు ।
తరుణిగలఫలము వేదనలంబొరలుటెకాని ।
నెరుసులేనిసుఖము నిమిషంబులేదు ॥

తనువుగలఫలము పాతకముసేయనెకాని ।
అనువైనపుణ్యంబు అదియింతలేదు ।
మనసుగలఫలము దుర్మతిఁబొందనేకాని ।
ఘనమనోజ్ఞానసంగతి గొంతలేదు ॥

చదువుగలిగినఫలము సంశయంబేకాని ।
సదమలజ్ఞాన నిశ్చయమింతలేదు ।
యిదియెరింగి తిరువేంకటేశ్వరునిం గొలిచినను ।
బ్రదుకుగలుగును భవము ప్రాణులకులేదు ॥  3౽౭౬

## అహిరి.

### పల్లవి

సతతమునేజేయు ననాచారములకుం గడయెక్కడ ।
మతి ననుంగని కావుము రామారామారామా ॥

(చరణము)

సేసిన నాబ్రహ్మహత్యలు శిశుహత్యలు గోహత్యలు ।
ఆసలనెన్నో యెన్నో అయాజాడలను ।
యీసున నేనిపుడెరింగియు నెరంగక సేసెదురితపు ।
రాసులకును గడలేదిదె రామారామారామా ॥

నమలెడిశావాచవులకు నానావిధభక్షణములు ।
కమిలిన దుర్గంధపుశోకమ్ములు దొమ్ములును ।
జముబాధల నరకంబులసారెకు నన్నిటువలె ।
శ్రీరమణుండ ననుంగాచె విటు రామారామారామా

కపటపు నాధనవాంచలు కలకాలముఁ బరకాంతల ।
జపలపుఁదలంపుల సేతలసంఖ్యములరయంగను ।
యెపుడును నిటువలెనుండెడు హీనుని నన్నిటుగా వెదో ।
రపమున శ్రీవేంకటగిరి రామారామారామా ॥ 3 ౨౨

కన్నడగౌళ.

పల్లవి

కరుణానిధిం గదాధరం ।
శరణాగతవత్సలం భజే ॥

(చరణము)

శుకవరదం కౌస్తుభాభరణం ।
ఆరాధనప్రియమనేకదం ।
సకలరక్షకం జయాధికం ।
సేవకపాలకమేవం భజే ॥

ఉరగశయనం మహోజ్వలంతం ।
గరుడారూఢం కమనీయం ।
పరమపదేశం పరమం భవ్యం ।
హరిం దనుజభయదం భజే ॥

లంకాహరణం లక్ష్మీరమణం ।
పంకజసంభవభవప్రియం ।
వేంకటేశం వేదనిలయం ।
శుభాంకం లోకమయం భజే ॥ 3 ౨౭

సామంతం.

**పల్లవి**

చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మీకు ।
జాలెల్లనడగించు సంకీర్తనం ॥

(చరణము)

సంతోషకరమైన సంకీర్తనం ।
సంతాప మణంగించు సంకీర్తనం ।
జంతువులరక్షించు సంకీర్తనం ।
సంతతముదలంచుడీ సంకీర్తనం ॥

సామజముం గాచినది సంకీర్తనం ।
సామమునకెక్కుడీ సంకీర్తనం ।
సామీప్యమిందరికి సంకీర్తనం ।
సామాన్యమా విష్ణుసంకీర్తనం ॥

జముబారివిడిపించు సంకీర్తనం ।
సమబుద్ధిపొడమించు సంకీర్తనం ।
జమళిసౌఖ్యములిచ్చు సంకీర్తనం ।
శమదమాదులఁజేయు సంకీర్తనం ॥

జలజాసనుని నోరి సంకీర్తనం ।
చలిగొండసుతదలచు సంకీర్తనం ।
చలువగడునాలుకకు సంకీర్తనం ।
చలపట్టితలంచుడీ సంకీర్తనం ॥

సరిళిసంపదలిచ్చు సంకీర్తనం ।
సరిలేనిదిదియపో సంకీర్తనం ।
సరుసవేంకటవిభుని సంకీర్తనం ।
సరగుననుఁదలచండీ సంకీర్తనం ॥ 3 ౨౮

## తాళ్ళపాకం కవుల కృతులు

### శుద్ధవసంతం.

**పల్లవి**

యెదుటి నిధానమవెటుచూచిన ।
నీవదె వేంకటగిరి యనంతుండా ॥

(చరణము)

సొగిసిభాద్రపద శుద్ధ చతుర్ధశి ।
తగువేడుక నిందరుగొలువ ।
పగటుసంపదలు బహుళమొసంగు ।
నీవగు వేంకటగిరి యనంతుండా ॥

తొలుత సుశీలకు దుస్సీలవలన ।
వెలయు సంపదలవిముఖుండై ।
వలెనని కొలిచిన వడిఁగాచిన మా ।
యల వేంకటగిరియనంతుండా ॥

కరుణంగాచితివి కౌండిన్యుని మును ।
పరగినవృద్ధబ్రాహ్మణుండవై ।
దొరవులుమావులు ధ్రువముగగాచిన ।
హరివేంకటగిరి యనంతుండా ॥ 3 ౧౯

### శుద్ధవసంతం.

**పల్లవి**

యేమివొరలేరు యేమిమరలేరు ।
యీమాయలంపట చిందమొందనెకాని ॥

(చరణము)

సతులుగలమేలు దాసడింజొరలనెకాని ।
సతమైన సౌఖ్యస్వస్థానంబులేదు ।
హితులుగలమేలు తానిడుమం బొరలనెకాని ।
హితవివేకము నరులకెంతైనలేదు ॥

తనువులెత్తినమేలు తగులాయమేకాని ।
కనుగొనంగ యోగభోగముగొంతలేదు ।
ఘనముగలమేలు తా గర్వాంధమేకాని ।
ఘనుండైనశ్రీనాథుం గనుగొనంగలేదు ॥

చింతగలిగినమేలు చిక్కువంబట్టనెకాని ।
చింతవేంకటవిభునిం జింతించలేదు ।
సంతుగలిగినమేలు సంసారమేకాని ।
సంతతముంజెందని సద్గతిచేరలేదు ॥ 330

ఆహిరి.

పల్లవి

నానాదిక్కుల నరులెల్ల ।
వానలలోననె వత్తురు గదలి ॥

(చరణము)

సతులు సుతులుం బరిసరులుబాంధవులు ।
హితులుగొలువంగ నిందరును ।
శతసహస్రయోజనవాసులు ।
సువ్రతములతోడనె వత్తురుగదలి ॥

ముడుపులుజాళెలు మొగిదలమూటలు ।
కడలేనిధనము గొత్తలును ।
కడుమంచిమణులు కరులు దుర్గములు ।
వడిగొనిచెలంగుచు వత్తురు గదలి ॥

మగుటవర్ధనులు మండలేశ్వరులు ।
జగదేకపతులు జతురులును ।
తగువేంకటపతి దర్శింపగ బహు ।
వగలసంపదల వత్తురు గదలి ॥ 331

నాట.

**పల్లవి**

యెంతబోధించి యేమిసేసిన దన ।
దొంతికర్మములు తొలంగెనా ॥

(చరణము)

సతత దురాచారజడునకుం ।
బుణ్యాసంగతి దలపోశినంగలిగెనా ।
అతిపాపకర్మబోధకుండై వెలయు ।
దుష్ట మతిందలపోశిన మరికలిగెనా ॥

బహుజీవహింసాపరుండై నవానికి ।
యిహపరములు దైవమిచ్చెనా ।
విహితకర్మములు విడిచినవానికి ।
సహజాచారముజరగెనా ॥

దైవదూషకుండై తిరిగేటివానికి ।
దైవతాంతరము దెలిసెనా ।
శ్రీవేంకటేశ్వరుం జింతింపకుండిన ।
పావనమతుడై బ్రతికెనా ॥ 33౨

శ్రీరాగం.

**పల్లవి**

యేటిబ్రదుకు యేటిబ్రదుకు ।
వొక్కమాటలోనె యలమటమైనబ్రదుకు ॥

(చరణము)

సంతకూటములె చవులయినబ్రతుకు ।
దొంతిభయములతోడి బ్రదుకు ।
ముంతనీళ్లనె మునిగేటిబ్రదుకు ।
వంతంబొరలి కడ వరలేనిబ్రదుకు ॥

మనసుచంచలమై మనువయిన బ్రదుకు ।
దినదిన గండాల దీరు బ్రదుకు ।
తనియకాసలనె తగిలేటి బ్రదుకు ।
వెనకముందరచూడ వెరపయిన బ్రదుకు ॥

తెగి చెందె తీపయి తినియేటి బ్రదుకు ।
పగవారి పంచలపాలైన బ్రదుకు ।
తగువేంకటేశ్వరుం దలంచని బ్రదుకు ।
పొగడనోపక మంటఁ బొగిలేటి బ్రదుకు ॥ 333

లలిత.

**పల్లవి**

సకలసంగ్రహము సకలసంచయము ।
అకృతసుకృతమిది హరినామం ॥

**(చరణము)**

సకలవేదశాస్త్రముల సారమిది ।
సకలమంత్రరాజంబునిది ।
సకల పురాణరసముల మధురమిది ।
అకుటిలపావనం హరినామం ॥

సకలతత్వ సంశయఖండనమిది ।
సకలకర్మనిశ్చయమునిది ।
సకలవిధిరహస్య ప్రధానమిది ।
అకారణహితం హరినామం ॥

సకలదేవతాస్వామిప్రియంబడి ।
సకలలోక రక్షణము నిది ।
ప్రకటఁవేంకటపతి నామాంకిత ।
మ కించనధనం హరినామం ॥ 33౪

పాడి.

పల్లవి

కటకటా జీవుండాకాలముదోలుకరాగ ।
సటవటలనే ప్రొద్దుజరపేవుగా ।

(చరణము)

సమతనన్నియునం జదివి కడపటను ।
కుమతివై అందరింగొలిచేవుగా ।
తమిగొని ప్రేమనెంతయును గంగకుంబోయి ।
తమకించి నూతినీరుద్రాగేవుగా ॥

తనువుంబ్రాయమునమ్మి దానధర్మముమాని ।
చెనటివై కర్మలుసేసేవుగా ।
వానరంగ మీదనొడ్డిన మొగులునమ్మి ।
దోనెలనీళ్లువెళ్లం ద్రోసేవుగా ॥

యెలమితోదిరువేంకటేశుం గొలువలేక ।
పొలము రాజులవెంటఁ బొయ్యేవుగా ।
చిలుకకువలె బుద్ధిచెప్పినం గానలేక ।
పలుమారుకేశంబాడేవుగా ॥ 33౨

సామంతం.

పల్లవి

అందరికాధారమైన ఆదిపురుషుఁడితండు ।
విందై మున్నారగించె విధురునికడ నితండు ॥

(చరణము)

సనకాదులుగొనియాడెడి సర్వాత్మకుండితండు ।
వనజభవాదులకును దైవంబైన తండ్రితండు ।
యినమండలమునజెలఁగేటి హితవై భవుండితండు ।
మునుపుట్టినదేవతలకు మూలభూతియితండు ॥

సిరులొసంగి యశోదయింట శిశువైన తండ్రితండు ।
ధరనావులమందలలో తగం జరించె నితండు ।
నరసతలను గొల్లెతలకు జనవులొసంగెనితండు ।
అరసి కుచేలునియటుకులాదరించె నితండు ॥

పంకజభవునకును బ్రహ్మపదమొసంగెను యితండు ।
సంకీర్తనలాద్యులచే జట్టిగొనియె నితండు ।
శంకిగనె కాలముం బరదేవుండయిన యితండు ।
వేంకటగిరిమీద ప్రభలవెలసిన ఘనుండితండు ॥ ౩౩౬

నాట.

పల్లవి

కాయము జీవుండుగలనాడె తెలివయులె ।
యీయత్నములు దనకెన్నండు ॥

(చరణము)

సతతము సంసారజడుండు దానట యాత్మ ।
హితవుదెలుసుకొలమెన్నండు ।
రతిసరసముల వూరకె ప్రాయమెడలంగ ।
యితరసుఖము దనకెన్నండు ॥

యెడపక ద్రవ్యమోహితుండై తిరుగం దన ।
యిడుమపాటు మానుటెన్నండు ।
కడలేని పొలయలుకలచేతం దనదేహ ।
మిడియుంగ నిజసుఖమెన్నండు ॥

శ్రీవేంకటేశునిం జేరి తక్కినసుఖ ।
మేవగించుకాలమెన్నండు ।
శ్రీవల్లభునికృప సిరిగాదలంచి ।
జీవుం డీవై భవముగాంచుటెన్నండు ॥ ౩౩౭

సామంతం.

పల్లవి

అతండె సకలవ్యాపకుం డతండె యాతురబంధువుం
డతండు దలంపులముంగిట నబ్బుటయెన్నండొకో ॥

(చరణము)

సారెకు సంసారంబను జలనిధులీదుచు నలసిన ।
వారికి నొకదరిదాపగు వాడిక నెవ్వండొకో ।
పేరిన యజ్ఞానంబను పెనుజీకటి తనుంగప్పిన ।
చేరువ వెలుగై తోచెడి చెలియింక నెవ్వండొకో ॥

దురితపుకాననములలో త్రోవటుదప్పినవారికి ।
తెరువిదె పొమ్మని జూపెడి దేవుండిం దెవ్వండొకో ।
పెరికిస యాశాపాశము పెడగేలుగఁ దనుంగట్టిన ।
వెరవకుమని విడిపించేటివిభుఁడింక నెవ్వండొకో ॥

తగిలిన యాపదలనియెడి దావానలములుచుట్టిన ।
వెగడకుమనివడినాప్పెడి బిరుదింక నెవ్వండొకో ।
తెగువయుదొప్పనుంగలిగిన తిరువేంకటవిభుండొక్కండె ।
సొగిశి తలంచినవారికి సురుతరువగువాడు ॥ ౩౩౮

ముఖారి.

పల్లవి

యెక్కడనున్నా నితండు ।
దిక్కై మాకెనం దిరిగెగాక ॥

(చరణము)

సరసుండు చతురుండు జగదేకగురుండు
పరమాత్ముం డఖిలబంధువుండు ।
హరి లోకోత్తరుం డతండె నామతి ।
సిరితో బాయక చెలంగెగాక ॥

ఉన్నతోన్నతుం డుజ్జ్వలుండధికుండు ।
పన్నగశయనుండు భవహరుండు ।
యిన్నిటంగలిగిన యిందిరారమణుండు ।
మన్ననతో మము మనిపెంగాక ॥

మమతల నలమేల్మంగకు సంతత ।
రమణుండు వేంకటరాయుండు ।
జమళిసంపదల సరసవిభవముల ।
తమకంబున మముం దనిపెంగాకా ॥ ౩౩౯

## కన్నడగౌళ.

పల్లవి

విశ్వప్రకాశునకు వెలియాడలోనేడ ।
శాశ్వతునకూహింప జన్మమికనేడ ॥

(చరణము)

సర్వపరిపూర్ణునకు సంచారమికనేడ ।
నిర్వాణమూర్తికిని నిలయమికనేడ ।
ఉర్వీధరునకుగాలూందనొకచోటేడ ।
పార్వతిస్తుత్యునకు భావమికనేడ ॥

నానాప్రభావునకు నడుమేడమొదలేడ ।
ఆననసహస్రునకు నవ్వాలివలేడ ।
మానిహృదయస్థునకు మాటేడపలుకేడ ।
జ్ఞానస్వరూపునకు గానవినవేడ ॥

పరమయోగీంద్రునకు పరులేడతానేడ ।
దురితదూరునకు సంస్తుతినిందలేడ ।
తిరువేంకటేశునకు దివ్యవిగ్రహమేడ ।
హరికినారాయణున కవ్వంగాములేడ ॥ ౩౪౦

## వసంతం.

### పల్లవి

తలంపులో పలితలంపు దైవమితండు ।
పలుమారుబదియును బదియైనతలంపు ॥

(చరణము)

సవతైనచదువులు సరుగదెచ్చినతలంపు ।
రవళిందరిగుబ్బలిని రంజిల్లుతలంపు ।
కనగూడంగోరి భూకాంతముంగిటితలంపు ।
తివిరిదూషకుగోళ్లం దెగటార్చ్చుతలంపు ॥

గొడగువట్టినవానిం గోరి యడిగినతలంపు ।
తడబడక విప్రులకు దానమిడుతలంపు ।
పొడిశిజలనిధినిగడకూర్చి తెచ్చినతలంపు ।
జడియక హలాయుధము జళిపించుతలంపు ॥

వలపించి పురసతుల వ్రతముచెరిచినతలంపు ।
కలికితనములు చూపంగలిగున్నతలంపు ।
యిలవేంకటాద్రిపై నిరవుకొన్నతలంపు ।
కలుషహరమై మోక్షగతిచూపుతలంపు ॥ ౩౭౧

## పాడి.

### పల్లవి

అన్నదాదినాం అన్యేషాం ।
తస్మిన్ తస్మిన్ తత్రచపునశ్చ ॥

(చరణము)

సతతాధ్యయననిష్ఠాపరాణాంద్ర్పథ ।
వ్రతినాంయతినాంవనవాశినాం ।
గతిరీహాస్మర్తుంతుజగత్యాంపర ।
స్థితిరియంకావిష్ణుసేవాపునశ్చ ॥

మోహినామత్యంతముష్కరాణాంగుణ ।
గ్రాహినాంభువనై కకఠినానాం ।
దేహసంతాళనవై దేశికోవాసదా ।
శ్రీహరిస్మరణవిశేషః పునశ్చ ॥

కింకర్వాణదుఃఖితజీవినాం ।
పంక్కిలమనోభయభ్రాంత్తానాం ।
శంకానివర్త్యతిఃస్సరసాకాశ్రీ ।
వెంకటాచలపతేర్వినుతిః పునశ్చ ॥ ౩౮౨

## సామంత్రం.

### పల్లవి

దొరకునా యితనికృప తుదిపదంబు ।
అరిది విభవము లొల్లమనినాఁబొదలు ॥

### (చరణము)

సొంపలర నితండు గృపం చూచు టరుదని కాక ।
యింపుసామాన్యమా యితనికరుణ ।
లంపటము ఘనమైన లక్ష్మి కటాక్షములు ।
సంపదలు తోడనే చల్లునెదలాడు ॥

తగ నీతనిపై భక్తిదగులుటరుదనికాక ।
నగుట సామాన్యమా ననిచియితండు ।
జగదేకహితములుగ సరసతలు సౌఖ్యములు ।
దిగులువాయంగ నితండు దిప్పుదీరాడు ॥

తిరువేంకటాద్రి సిద్ధించుటరుదనికాక ।
మరుగందనునిచ్చునా మరియొకరిని ।
యిరవై నభోగములు యిష్టసామ్రాజ్యములు ।
విరివిగొని యితనిదయవెంటనేతిరుగు ॥

ఆహిరి. ౩౮౩

**పల్లవి**

చెలినేడు తానేమి సేయునమ్మ ।
చెలియేమిసేయు నీచెలులేమిసేయుదురు ।
చెలువైనవిభుమేని చెలువింతసేయంగ ॥

(చరణము)

సతినేడి బంగారు చవికెలోఁజిత్రంపు ।
గతులెంతచూపినం గడకంటఁజూడదు ।
అతనిజూచిన మంచియబ్బురపుజూపులు ।
అతనివెంటనె యెనటుగాఁబోలును ॥

తేనియలూరేటి మంచి తియ్యని మాటలు మంత్ర ।
గానములుగా వినుపించి కడువేసరితిమి ।
వానిమాటలు విన్నవలనైన ముదమున ।
వీనులు ముద్రించిన విధముగాఁబోలును ॥

నిచ్చళీపుమోమున నెయ్యముదైలువారె ।
బచ్చనచేతలు గుబ్బలపై నిండనొప్పును ।
అచ్చపువేడుక వేంకటాద్రీశుం డీరేయి ।
నెచ్చెలికి నిచ్చినట్టె నేరుపుగాఁబోలును ॥ ౩౮౪

సామంత్తం.

**పల్లవి**

యిత్తడి బంగారు సేయ నింతకు నేరుతుసంటా ।
కొత్తసేతలెల్ల దొరకొంటిగానీవు ॥

(చరణము)

హీనులైనవారు నిన్ను నేర్చికొలిచిన ఘన ।
మైనపదవులంబెట్టి యెటువలెనె ।
మానక యెవ్వతెనైన మచ్చికందగిలి నాతోనా ।
నీపట్టి సరిసేసెగదరా నీవు ॥

కడుచాతకులు నిన్నుంగదిశి కొలిచేరంట ।
నడరి పుణ్యులంజేయు నటువలెనె ।
కడంగి యెవ్వతెనైన గాజుమాణిక్యముసేసి ।
వడినన్ను గెరలించవద్దురా నీవు ॥

దిందుపడ మాయసేసి దేవుండనేగానంట ।
నందరిభ్రమలం బెట్టునటువలెనె ।
అందమైన తిరువేంకటాద్రీశుని ప్రేమ ।
చెంది నన్నుంగూడి దాచంజెల్లునా నీవు ॥ ౩౮౫

బౌళి.

పల్లవి

యెక్కడచొచ్చేది భవమేది యుం గడపలగానము ।
వుక్కనం బరితాపానలమూరకమండెడిని ॥

(చరణము)

హృదయవికారముమాన్పంగ నేతెరంగును సమకూడదు ।
మదనానందముచేరుపంగ మందేమియులేదు ।
పొదలినదేహగుణంబులందొ నడువంగ గతి గానము ।
ప్రబదికించిన కోరికెలకుం బ్రాయముదిరిగినది ॥

కమలినయజ్ఞానంబిది కన్నులముందరఁ గానదు ।
తిమిరముపొదిగొని చూడ్కిం దెరువేమియులేదు ।
తెమలని యాశాపాశము తేరి పగ సత్త్వము చాలదు ।
మమకారము వెడలింపఁగ మతియెప్పుడులేదు ॥

దురితంబులు పుణ్యంబులు తోడుబడ నాత్మనుం బెనగొని ।
జరగంగ శరీరధారికి సత్కర్మములేదు ।
తిరువేంకటగిరి పతియగు దైవశిఖామణిపాదము ।
శరణనిబ్రదుకుట దప్పను సన్మార్గములేదు ॥ ౩౮౬

## గుండక్రియ.

**పల్లవి**

ప్రాణులనేరమి గాదిది బహుజన్మపరంపరచే ।
ప్రాణులుసేసిన తమతమ పాపఫలముగాని ॥

(చరణము)

హరి సకలవ్యాపకుండని అందరుఁజెప్పంగ నెరింగియు ।
పరదైవంబులం గొలువకపాయరు మానవులు ।
నరపతిభూమేలంగ భూవరు భజియింపంగనొల్లక ।
పరిసరవర్తుల వెంబడిం బనిసేసినయట్లు ॥
పొందుగ తమతమసేసిన పూజలు మొక్కులుగైకొను ।
అందముగాఁ బురుషోత్తముం డాతండెకలడనియు ।
అందరు నెరింగియు యితరులం జెందుదురున్నతశైలము ।
నందక చేరువ తరువుల నందుకొనినయట్లు ॥
శ్రీవేంకటపతి యొక్కండె చెప్పఁగ జగములకెల్లను ।
దైవము నాతుమలోపలి ధనమనంగా వినియు ।
సేవింపరు పామరులీదేవుని మధురంబొల్లక ।
వావిరిఁబులుసులుచేదులు వలెనని కొనునట్లు ॥ ३८८

## ధన్యాశి.

**పల్లవి**

ఘోర దురితములచే గుణవికారములచే ।
నీరీతింబడు నాకు నేదిదెరువు ॥

(చరణము)

హరిజగన్నాథు లోకారాధ్యు ।
నెఱుంగనేరని వాని కేదిదెరువు ।
పరమపురుషుని జగద్భరితనంతర్వ్యాప్తి ।
నిరవు కొలుపని వాని కేది దెరువు ॥
శ్రీవేంకటేశుం దలంచినవెనక సకలంబు ।
నేవగింపని వానికేది దెరువు ।
దేవోత్తముని మహిమ దెలిసితెలియంగలేని ।
యీావివేకంబునకు నేదిదెరువు ॥ ३८७

# అధ్యాత్మ సంకీర్తనలు

ఆహిరి.

పల్లవి

యేపనులు సేసినా నిటువలెనేవో ।
యీపనికిం జొరనిపని యేటిలో పైరు ॥

(చరణము)

హరికథలమీది ప్రియమబ్బునా తొంటి తమ ।
పరిపక్వమగు దపఃఫలముగాక ।
గరిమె నివి లేకున్నం గలకాలములుచేయు ।
నిరతంపుదపమెల్ల నీటిలో వ్రాత ॥

నారాయణునిభక్తి ననిచెనాధనమెల్ల ।
బారజల్లిన దానఫలమదియువో ।
కోరియివిలేకున్న కోటిదానములైన ।
పేరుకొని వరదం గలపిన చింతపండు ॥

వేంకటేశ్వరుండె దైవంబనుచు ।
జదువుంగలిగిన మంచి చదువదియేవో ।
పదిలముగ నీవిధముపట్టియ్యకుననను ।
చదువుల సురులు మున్నుచదివేటిచదువు ॥ ౩౪౯

శ్రీరాగం, జంపె.

పల్లవి

అణురేణు పరిపూర్ణుండైన శ్రీవల్లభుని ।
బ్రణుతించువారు వో బ్రాహ్మలు ॥

(చరణము)

హరినామములనే సంధ్యాదివిధులొనరించు ।
పరిపూర్ణ మతులు వో బ్రాహ్మలు ।
హరిమంత్ర వేదపారాయణులు హరిభక్తి ।
పరులైనవారు వో బ్రాహ్మలు ॥

యేవిచూచినను హరియున్నిటంగలఁడనుచు ।
భావించువారు వో బ్రాహ్మలు ।
దేవకినందనుండె దేవుండని మతిందెలిసియు ।
పావనులువారు వో బ్రాహ్మలు ॥

ఆదినారాయణున ననయుంబుఁదమయాత్మ ।
బాదుకొలిపినవారు బ్రాహ్మలు ।
వేదరక్షకుండైన వేంకటగిరీశ్వరుని ।
పాదసేవకులువో బ్రాహ్మలు ॥ ३४०

దేశాక్షి.

పల్లవి

సీతాశోక విఘాతకవో ॥
పాతాళలంకాపతివిభాళా ॥

(చరణము)

హనుమంతరాయా అంజనితనయువో ।
వనధిలంఘనగాత్ర వాయుపుత్రా ।
యినకులాధిప నిజహితజగన్నుత ।
వనజోదరసేవకసత్వధనిక ॥

ప్రళయాంతకరూప బలాధిప రవిఫల ।
గిళన ప్రతాపసుగ్రీవప్రియ ।
కుళిశ దానవసంకులవిదారణ ।
భళిభళిజగత్పతిబలుబంట ॥

పంకజాసను దివ్యపదవైభవవో ।
లంకిణి ప్రాణవిలంఘన ।
వేంకటేశ్వరు సేవా వీరమహాధీర ।
కింకరరాయసుఖిభవా ॥ ३४१

## శ్రీరాగం.

పల్లవి

యిన్నిజన్మములేటికి హరిదాసు ।
లున్నవూరం దానుండినంజాలు ॥

(చరణము)

హరిభక్తులయింట యన్నము గొనువారి ।
వరువుడై వుండవలెనన్నంజాలు ।
పరమభాగవత భవనంబులఁ జెడ్డ ।
పురువు దానయిపొడమినంజాలు ॥

వాసుదేవుని భక్తవరుల దాసులు మున్ను ।
రోసిన యెంగిలిరుచిగొన్నంజాలు ।
శ్రీసతీశునిం దలంచినవారి దాసాన ।
దాసుండై వుండఁదలచినంజాలు ॥

శ్రీవేంకటేశుంజూచినవారి శ్రీపాద ।
సేవకుండై వుండ జేరినంజాలు ।
యీవిభుదాసుల హితులపాదధూళి ।
పావనమై సోంకిబ్రదికినంజాలు ॥ 3౫౧

## ముఖారి.

పల్లవి

భోగీంద్రులును మీరుఁబోయిరండు ।
వేగనమీఁదటి విభవములకు ॥

(చరణము)

హరుండపోయిరా అజుండనీవునుం బో
తిరిగిరా మీఁదటి తిరుణాళ్లకు ।
సురలు మునులును భూసురలుఁ బో
అరవిరి నిన్నాళ్లు నలసితిరి ॥

## అధ్యాత్మ సంకీర్తనలు

జముండపోయిరా శశియునీవునుబోయి ।
సుముఖుండవై రా సురలంగూడి ।
గుములై దిక్పతులుదిక్కులకుం ।
బోయిరండు ప్రమదాన నిన్నాళ్లుబడలితిరి ॥

నారదసనకసనందనాదులు ।
భూరివిభవముల బోయిరండు ।
దూరముగాఁబోకిట్టె తొరలి వేంకటగిరి ।
జేరి నన్నిట్లనే సేవించుడి ॥ 3x3

### సామంతం.

**పల్లవి**

అతనికెట్ల సతమైతి నొకడు ।
హితవో పొందులహితవో యెఱుంగ ॥

(చరణము)

హృదయము తలంపున నిరవై నంగదా ।
పదిలమాను లోపలిమాట ।
వెదకినచిత్తము వెరవెఱుంగదు నే ।
నెదిరి నెఱుంగ నేనెమియునెఱుంగ ॥

కాలూద మనసుగలిగికదా నా ।
తాలిమి మతిలోం దగులాట ।
మేలిమిపతితో మెలంగుటేదో నే ।
నేమో నేనిపుడెక్కడో యెఱుంగ ॥

నేడని రేపని నేనటెంగికదా ।
పోడిమి మతిలో పొరపాటు ।
వాడె వేంకటేశ్వరుండు రాఁగలిగె ।
ఆడుజన్మమె నాటిదియెఱుంగ ॥ 3x8

## అధ్యాత్మ సంకీర్తనలు

### కేదారగౌళ.

పల్లవి

నీవున్నచోటువైకుంఠము నెరుసులుమఱిచోరరాదు ।
పావనమనిచెప్పేది వేదముపాలించంగవలెను ॥

(చరణము)

దేవుఁడా నాదేహమేనీకు తిరుమలగిరిపట్టణము ।
భావింపహృదయకమలమె బంగారపుమేడ ।
వేవేలు నావిజ్ఞానాదులు వేడుకపరిచారకులు ।
వల్లభా యిందులో నితరచింతలువెట్టకువే ॥
పరమాత్మానామనసె బహురత్నంబులమంచంబు ।
గరిమేలనాయాత్మె నీకు కడుమెత్తనిపరపు ।
తిరముగ సుజ్ఞానదీపమున్నది దివ్యభోగమె ఆనందము ।
మరిగితి నీ వున్నయెడల నింక మాయలం గప్పకువె ॥
ననిచిన నావూరుపులె నీకు నారదాదులపాటలు ।
వినయపునాభక్తియె నీకును వినోదమగుపాత్ర ।
అనిశము శ్రీవేంకటేశ్వర అలమేల్మంగకుం బతివి ।
ఘనుండవు నన్నేలితివింక కర్మములెంచకువె ॥ ౩౫౫

### రామక్రియ.

పల్లవి

మఱి నేనేమిసేయంగలను మాధవ నాశక్తిగలదిదియె ।
నెఱవుగ భువిలోగలిగినవెల్ల నీసొమ్ములే కలవి ॥

(చరణము)

ధరణీధరా నాతపమనంగానేటిది ।
యిరవుగ నామనసు మీఁదెత్తుటయింతె నీకు । భా
పరగంగ నాలోనిభక్తియనఁగా నేటిది ।
సరగున నాయాతుమ నీకుసమర్పణాయనుటె ॥

సుడిగొని పై నాస్తుతియనంగా నేటిది ।
నుడిగిననానుడుగులు నీకునోరనె యప్పింంచితి ననుటె ।
వడిగా నేగై కొన్న వ్రతమనంగా నేటిది ।
జడియక నీవాడననుకొనుచు శరణనుటెకలది ॥

శ్రీవేంకటేశ నాశిలంబునంగా నేటిది ।
దావతిపడక నీదాసులకు దాసుండ నేననుటెంతే ।
వేవేలుగ నే బూజించె విధమనంగానేటిది ।
భావమున నలమేలుమంగపతివి ।
నీపాదములకు మ్రొక్కుటయింతె ॥ 3౪౬

బౌళి.

పల్లవి

నేనెంతవాడను నిన్నునడిగినంటె ।
వీనుల నీ కథలెల్లవినుటేకాక ॥

(చరణము)

అలిగిన నలుగక యన్యులు మరి దూర ।
బలికినను మారువలుకక ।
కలచినం గలగక సరికొట్టినను ।
మూలుగనివాడుగదా ముక్తికినర్హుండు ॥

నగిననుం దా నగకనాతులెవ్వరైనం ।
దగిలిపెనంగినందగులక ।
వగచినా వగవక వ్రతముచేటిచెమంటె ।
మొగమోడకున్న వాడె ముక్తికినర్హుండు ॥

విటిచినావిటుగక విష్ణుభక్తియెదాటున ।
వెటుపించిన మటివెటవక ।
నెటవై శ్రీవేంకటేశ నీపాదములెనమ్మి ।
మెటుగులేని వాడె ముక్తికినర్హుండు ॥ 3౫౭

రామక్రియ.

పల్లవి

సకలదేవతలు నీశరీరమని సర్వేశ్వర నినుం దలంచుటమేలు ।
వికటమేల నిను యేకాగ్రబుద్ధి నీ వేడుకతో సేవించెనింకను ॥

(చరణము)

శివదుర్గరవిగణాధిప క్షేత్రపాలక సహితముగా ।
భువిలో మిమ్ముంను పంచపూజగాఁ బూజింతురు కొందరు ।
తివిరి యిందరును బంతినే పొత్తుల దేవరలై పొరిచూపు సేతురని ।
వివరముగా నిన్నే కొలిచితి నీవె వహించుకొని రక్షించవె ॥

బహువిద్యాధర భేతాళ బ్రహ్మరాక్షస గణాదుల ।
సహచరుంగా మిమ్ముం గామ్య కర్మముల సాటె భజింతురు కొందరు ।
మహిమలుచూపుచు వేల్పులదండై మనసుల పంతులు వెదకుదురనుచును ।
విహితధర్మమని నిను శరణంటిని వెలయంగ ననుం దయజూడగదే ॥

అతిమాయాయంత్ర తంత్ర మంత్రాంతర సాధనయుక్తముగా ।
యితరులు గొందరు చిల్లర తెరువుల యెనయించి మిమ్ము నర్చింతురు ।
తలినివితమలో నన్యోన్య విరుద్ధములని యుపాయసహితములనియును ।
గతియంటి నీ యలమేలుమంగకును పతి శ్రీవేంకటేశుండ కావవె ॥ 3౹౮

దేశాక్షి.

పల్లవి

యిది నీమాయయో యింద్రజాలమో యేమియు నెఱుంగను ।
సదరపు నాకర్మవశంబుననే సంకల్పించెదనో యెఱుంగను ॥

(చరణము)

నరకములనుభవించె యప్పుడు నాయాతనాదేహంబు ।
నఱములతో నఱకుదురు యమభటులు నలియదప్పటిం జరుగును ।
సరినశిపత్రములు నాటుసమయ దెంతైనా జగిరింపుచుండు ।
వరుసం దప్తలోహ తైలంబులలో వైతురు పోవదు వేనుతగులు ॥

అంతట నొకతల్లి కడుపునం బుట్టదు అతికోమలమగు మేను మోచుకొని ।
వంతుల బాల్యకౌమార్యయావనవయసులం బెక్కు భావముకాదు ।
కాంతలంగవయుదు రక్తమాంసములఃం గమ్మటినోరును యేమిటం దనియదు ।
వింతగా నాహారంబులు గొందును వెస నాకలియును దీరదు ॥

మెఱయంగ గలలో నన్నియుగందును మేలుకాంచితేనట తాను ।
మఱచితిఁ దలంచితి సర్వాపరాధములు మఱి యన్నియు నేజేసితిని ।
తఱితో శ్రీవేంకటేశ నాపాలిటి దైవను యలమేల్మంగపతి ।
గుఱిగా నావిన్నప మవధరించు గోవింద గోవింద గోవిందా ॥ 3౪౯

సాళంగనాట.

పల్లవి

వెనకీవెదక చొప్పులెత్తుచును విచారించితి నిన్నాళ్ల
యిదివో కంటిని శ్రీవేంకటగిరియెదుటనే నీ శ్రీపాదములు ॥

(చరణము)

ఘన తులసి కాననంబులో కాపురముసేతువనంగాను ।
అనిశముబద్మవనంబునను ఆడుచునుండుదు వనంగాను ।
నిను నీదాసులు పాడేచోట్ల నెలవై యాలింతువనంగాను ।
యినమండలమున నుండుదువనంగా యీమాటవినినేను ॥

పైకొని క్షీరాంబుధిలో నెప్పుడు పవళించివుందువనంగాను ।
వైకుంఠంబున వెలుగొందుచు సర్వము భావించెవనంగాను ।
దాకొని జీవులలో నెప్పుడు సంతర్యామివై వుందువనంగాను ।
లోకము నీవై వుండుదువనంగా లోలతని మాటవిని నేను ॥

పరమయోగీంద్రులు తేలపోయుచునున్న భావములో నుందువనంగాను ।
పరిపరివిధముల పుణ్యకర్మములపాయక చరింతువనంగాను ।
గరిమలనెప్పుడు అలమేల్మంగకౌగిటిలో వాడవనంగాను ।
యిరవుగ శ్రీవేంకటేశుండవనంగా యీమాటవిని నేను । 3౫౦

లలిత.

**పల్లవి**

యెంతటివాడవు నిన్ను నేమని నుతింతును ।
వింతలు నీ కమరకుండగావిచారించె నేను ॥

(చరణము)

పాలసముద్రములోనం బవళించివుండె నీకు ।
బాలుండవై తేనవెన్న బాతాయెనా ।
కాలమెల్లను శ్రీకాంతకౌగిట నుండె నీకు ।
గొల్లవైతే గొల్లెతలంగూడ వేడుకాయెనా ॥

పరమపదమునందు బ్రహ్మమైవుండె ।
పెరిగే రేపల్లెవాడప్రియమాయెనా ।
సురులనెల్ల గావ సులభుండవై ననీకు ।
గరిమెతోడం బసులగావ వేడుకాయెనా ॥

యెప్పొద్దు ముక్తుల నెనసివుండెనీకు ।
గోపాలురతోఁగూడుండగోరికాయెనా ।
బాపురె యలమేల్ మంగపతి శ్రీవేంకటేశ్వర ।
యెప్పొద్దు నిట్టిలీలలే హితవాయెనా ॥ ౩౭౧

శ్రీరాగం.

**పల్లవి**

తెలియదు నీమనసు దేవోత్తమా ।
సులభుండవని విని చొరంబారి మనసు ॥

(చరణము)

చూతును నీమూర్తినిచొప్పుగా గన్నులెదుట ।
ఆత్మఁ దలపోసెననుచును అలవరచుకొందును ।
నీతియెంచిచూచితేను నీవెంతనేనెంత ।
యీతల నాయగ్గలికెకు నేమనుచున్నాడవో ॥

నెట్టుకొనం బూజింతు నీవునావాడవెయుంట ।
పెట్టెలోన నుంచి చక్కబెట్టుకొందును ।
యెట్టిది నాసాహసంబు యేమిట నిన్ను మెప్పించితి ।
నట్టనడుమ నన్నెట్టు నవ్వుతావున్నాడవో ॥
నొడిగి నినుంబిలుచునోరునిండా బేరుకొని ।
నొడయుకెందున్నాడవో యెక్కడెక్కడ ।
అడరి శ్రీవేంకటేశ అలమేల్మంగపతివి ।
వడినన్నేలితి వెటువంటిసుకృతివో ॥ ౩౬౨

పాడి.

పల్లవి.

సందేహమెక్కడాలేదు సంతోషించుకొంటినేను ।
కందువ బ్రహ్మానందము గైకొంటినేను ॥

(చరణము)

నున్నగా సంకీర్తన నానోరికిచ్చితి గనుక ।
నన్ను రక్షింతువేయనుచు నమ్మితినేను ।
పిన్ననాడె నీవు నన్నుం బేరుకొంటివి గనుక ।
యెన్నంగ నీడేర్తువని యియ్యకొంటినేను ॥
శ్రీకాంతుండ నీమూర్తి నాచిత్తములో నిల్పంగాను ।
నాకు నీవుగలవని నమ్మితినేను ।
దాకొని లోకములో నీదాసుండనిపించంగా ।
యీకడ నేలితివనియెఱింగితి నేను ॥
కైవసమై నీవు నాకుకలలో నానతియ్యంగా ।
నావద్దనున్నాడవని నమ్మితినేను ।
యేవేళ శ్రీవేంకటేశయెదుటనే వుండగాను ।
పావనమైయున్నిటను బ్రబలితినేను ॥ ౩౬౩

సాళంగనాట.

పల్లవి

గెలిచితి భవముల గెలిచితి గామాదుల ।
యిల నీవేలికవై తివింక నేడ వెఱపు ॥

(చరణము)

హరి నీకు నేదాసుండనని దొకసలిగె ।
వొరశి యచ్చుమోచిన దొకసలిగె ।
అరయ ప్రసాదజీవి ననేటి దొకసలిగె ।
యిరవాయె నన్నిటనాకింక నేడ వెఱపు ॥

అట్టె నాలోన నున్నాడవనేటి దొక బలిమి ।
వొట్టి విన్నుం బాడేటి దొకబలిమి ।
గట్టిగా నీభాగవతకరుణయొక బలిమి ।
మెట్టు నేనమిసేసినా యింక నేడ వెఱపు ॥

వొట్టి నీవేగతియని వుండె నేమమొకదాపు ।
వుప్పతిల్లు నీపై భక్తి వొకదాపు ।
నేర్పున శ్రీవేంకటేశ నీసేవవొకదాపు ।
మెప్పుడు నీవె దిక్కు యింక నేడ వెఱపు ॥ ౩౬౪

కుంతలవరాళి.

పల్లవి

మానరాదు నీకింక మమ్ముంగావవలెను ।
పనిపట్టి నీకు నీవె బిరుదు లేవున్నవి ॥

(చరణము)

సరలి నిన్ను భక్తరక్షకుండని నారదుండు ।
పరువడి లోకములం బాడిపాడిచాటినాడు ।
పరగ నీయర్థములకు శాసనాలై వేదములు ।
మొరయుచు బ్రహ్మనాల్గు మొగములనున్నవి ॥

శరణాగత వజ్రపంజరుండని వాల్మీకి ।
సురలకు రామకథచూపి జెప్పె గుఱిగాను ।
ఘోరి నీసుద్దులివె పురాణపత్రికలై ।
పెరుగుచు వ్యాసుల పెట్టెలలోనున్నవి ॥
తారకబ్రహ్మమవనితగం గాశిలోశివుండు ।
యేరుపరచి ప్రాణులకిప్పుడుఁ జెప్పుచున్నాడు ।
యీరీతి శ్రీవేంకటేశ యిందుకుసాక్షులునీవారలు ।
ఆరూఢి గరుడగంభమండ నేడున్నవి ॥ ౩౯౫

లలిత.

పల్లవి

పురాణపురుషా నామనోరథము పొందుగ నీడేర్చవే ।
నిరుహేతుకాడ యానిధివినివనగావిందు ॥

(చరణము)

యెపుడు ప్రసన్నుండవౌదువో యనుచుయెదురుచూతు నీకు ।
అపురూపంబగు నీసూక్తులు విన నాలింతువీనులను ।
వుపమలనిన్నును వశముచేసుకొన నూహింపుచుండుదును ।
చపలుండనై నీమన్ననలే యిటు సారెకుంగోరుదును ॥

సతతము నీభావముదెలుసుకొనంగ చదువులలో వెదకుదును ।
తతి నీశ్రీపాదతీర్థముగొనంగ తమకింతునేను ।
హితవరులగు నీదాసులతో నన్నించుకొనంగదగుదును ।
అతిమోదంబున నిన్నునుతించె యందులకె నేనోరూరుదును ॥

యేడనైన నీభక్తిగలుగుటకు యేప్రొద్దును నేబ్రార్థింతు ।
వేడుకతో నీసేవసేయుటకు వేళగాచియుందు ।
జోడుగా నలమేల్మంగకుంబతివై చూపట్టిన శ్రీవేంకటేశ్వర ।
జూడచూడ మము రక్షించేవని సంతసమందుచునుండుదును ॥ ౩౯౬

# అధ్యాత్మ సంకీర్తనలు

## సామంతం.

పల్లవి

ఆహా యేమిచెప్పేది హరి నీచిక్కు ।
ఊహాపోహాలచేత వ్రాఁడిపోవు వయసు ॥

(చరణము)

చేతఁజిక్కినట్లుండు చెప్పినదాకజ్ఞానము ।
ఆతలంగడచితేను అట్టటుపోవు ।
జాతిం జేసినట్టుండు నాఁడిదేహమాయుష్యముతో ।
ఆత్మయెడసితేను అదివదలవును ॥

నిక్కమువలెనుండు నిద్రించుదాఁక గల ।
ప్రక్కన మేలుకొంటేను బట్టబయలు ।
దక్కినయట్లనుండు ధనధాన్యములు యింట ।
చక్కననుభవించితే సరికిసరికియగాను ॥

సులభమువలెనుండు చూచేటియాలోకము ।
యిలంజేకొనంగోరితే నెలయించును ।
యెలమి శ్రీవేంకటేశ యిది నీకల్పితమె ।
తలపోసి మెలఁగ నీదాసులెఱుంగుదురు ॥ ౩౬.౨

## శుద్ధవసంతం.

పల్లవి

కాదనితొలంగరాదు కరుణించంబాడినీకు ।
వేదములుచాటిచెప్పె విశ్వవ్యాపకుండవు ॥

(చరణము)

కాచెనన్న చరమశ్లోకము నాకుఁబూటకాఁపు ।
చూచి నీవేడనుండినా జూపి యిచ్చి ।
ని కాచినమ్మించెయభయకరమె నాకుంబూటకాపు ।
యేచిన నాలోని భయమెల్లందీర్చిని ॥

నీవునన్ను బుట్టించిన నిమిత్యమే పూటకాపు ।
పోవక రక్షించుమని బుద్ధిచెప్పిని ।
దేవుండవై నిలిచిన నీధీమసమెపూటకాపు ।
కేవలమై బిరుదులెక్కించ్చి రక్షించిని ॥
పోసీక నీబంట్లుచెప్పే బోధనాకు పూటకాపు ।
యేనెపానన్నైనా నిన్నుయింటంబెట్ట ।
పూని శ్రీవేంకటేశ్వర పూటకాపు లిందరును ।
వీనులలో నీకుం దామేవిన్నవించేరు ॥ 3ఞు

వరా

పల్లవి

అట్టెపెంచితేంబెరుగు నడంచితేనడంగును ॥
దిట్టలై వివేకులార తెలుసుకోరో ॥

(చరణము)

తలంచకుండగవలె తలంచితె గ్రామాదులు ।
పొలుచు నిప్పుల నెయిపోశినట్లు ।
కలుగకుండగవలె కలంగితేను మనసు ।
చెలంగి చీమలపుట్ట చిమ్మిరేగినట్లుండు ॥
యెడమియ్యకుండవలె యెడమిచ్చితె గోపము ।
విడివడ్డకోతికి వెఱ్ఱెత్తినట్లు ।
పొడిగట్టకుండవలె పొడిగట్టితేనాసలు ।
కడల్లతో సముద్రము కడతేరనట్టు ॥
తగులకుండంగవలె తగిలితేభోగములు ।
జిగురుగండెం బక్షులుచిక్కినట్లు ।
తగ శ్రీ వేంకటేశ్వరులసులిందుభ్రమయరు ।
జిగిమించె నమృతము చేతికిచ్చినట్లు ॥ 3ఞూ

శ్రీరాగం.

పల్లవి

యింతసేయకుండితే నేనేడనుందును ।
యెంత పుణ్యమో నీకు యేమి చెప్పే దింకను ॥

(చరణము)

అట్టె నన్నుద్ధరించ్చిన యదే నీప్రతాపము ।
వొట్టిసంపన్నుంజేసె నీ వుదారత్వము ।
గుట్టున వెనకవేసుకొనే నీపంతము ।
యిట్టినాభాగ్యమునెందు యేమి చెప్పేదింకను ।
నరకము వెళ్లంది నన్ను నీసాహసము ।
సరగజ్ఞానింజేసి నీచాతుర్యము ।
మఱిగించుకొనె నన్ను మఱి నీవాత్సల్యము ।
యిరవాయె నావేడుక యేమి చెప్పేదింకను ॥

నన్ను లోకపూజ్యుం జేసే నాడె నీదొరతనము ।
విన్నపము లాలించె నీవిచారము ।
మన్నించె శ్రీవేంకటేశ మమ్మ్మ నీపట్టపుదేవి ।
యిన్నిట బ్రతికించితి వేమి చెప్పేదింకను ॥ 320

రామక్రియ.

పల్లవి

నేనె తలంచ నిన్ను నేరమి యేమిచెప్పేది ।
శ్రీనాథ నన్నుంగృప శేశి వోర్చుకొనవే ॥

(చరణము)

పరగం గన్నులకు రెప్పలు దాపై వుండినట్టు ।
దరిదాపై వున్నాడ వింతటా నాకు ।
అరశి దేహానకు ముంజేయి అడ్డమై వున్నయట్టు ।
వరుస నాకు సహాయమై వత్తువునీవు ॥

మీనులకు నెప్పుడు విని కెలంకై వున్నట్టు ।
పూనుకొని చుట్టమవై పోషింతువు ।
మానక జీవునికి మనసు దోడై వున్నట్టు ।
ఆనుకో నెప్పుడుందగులై నీవున్నాడవు ॥

మలసి నాలికెకు నీమంత్రము ఫలమైనట్టు ।
అలరి నాకిటు దాతవై వున్నాడవు ।
తలకొన్న బిడ్డలకు తలిదండ్రివై వున్నట్టు ।
సులభవు శ్రీవేంకటేశుండవై వున్నాండవు ॥ 32౧

మధ్యమావతి.

పల్లవి

నాయంత నేవుద్దండంబున నీ నగరుబంచి సోదించంగలేదు ।
పాయక ననుమన్నించ్చి యేలుకొని ప్రకాశమాటమేలు ॥

(చరణము)

ధరలోని రూపము నీవె దాచుకొని యుండంగను ।
గరుడధ్వజమె నీగుఱుతు కనుపించెను నాకు ।
బిరుదులువొగడె శ్రుతులచేతనెపై కెటింగితినేను ।
పరగిన నీప్రతాపతేజమే బయలుసేసెనినున్న ॥

యెవ్వారికి నసాధ్యుండవై నీవు యేకతమున నుండగాను ।
రవ్వసేసి నిను నాకుంజెలిపెను రచనల నీమహిమె ।
చువ్వున నీవిచ్చు వరదహస్తమే చొప్పు చూపంగానఁ గంటిని ।
నివ్వటిల్లు నీకరుణ యిందరికి నిన్నిటువలెనె ముంగిటం బెట్టె ॥

శ్రీవేంకటగిరిపై రహస్యమునం జెలంగుచు నుండగాను ।
భావింప నలమేల్ మంగ్గ సంపదలె పట్టిచ్చెను నీప్రభావము ।
దైవికమునం బ్రకటించిన తొంటివుదారగుణము విని శరణు చొచ్చితిమి ।
యీవలనావల మీచివ్నాములే యింతసేసెమిమ్ము ॥ 32౨

శంకరాభరణం.

పల్లవి

అటువలెనె సుజ్ఞాని యన్నిపుణ్యములుం జేసి ।
తటుకున హరికిచ్చి దానుండవలెను ॥

(చరణము)

పూరిపసులను మేపి వొప్పగించి యిండ్లకు ।
చేరి జంగిలివాడు నిశ్చింతుండై వుండు ।
తెరకాండు మోపుమోచి తెచ్చి నగరికొప్పించి ।
నేరుపుతో వెట్టివాడు నెమ్మది నిద్రించును ॥

అట్టిబూరెలువండిన యాపె చేతులటచూపి ।
యింటివారి కొప్పగించి యేగినయట్టు ।
నట్టుతోడంబేరటాలు నాగవల్లియైనమీద ।
వొంటిిందననెలవున నూరకున్నయట్టు ॥

కూటమివచ్చినవాడు గుంపులెల్లవిచ్చిపోతె ।
యేటివాడుంగాక తనయిచ్చనేవుండు ।
పాటించి శ్రీవేంకటేశు బట్టు యేలికెపనులు ।
గాటన నన్నింజేయుంగత యేమిగాడు ॥ 323

సౌరాష్ట్రం.

పల్లవి

యిందరికంటె నెక్కుడు యెంచంగ యోగీశ్వరుండు ।
అంది కనుంగొను తనయంతరాత్మనెపుడు ॥

(చరణము)

చూడంగలవన్నియును చూడనీయోగీశ్వరుండు ।
బూడిదిలోకచ్చకయై పొరయుండెందు ।
యేడనైనానుండని యిచ్చైన యోగీశ్వరుండు ।
వాడలో కుమ్మరిపురువువలె నెంద్దునంటడు ॥

చెనటి యేపుణ్యమైన జేయని యోగీశ్వరుండు ।
నూనెగొల్చిన కుంచమైనశికిలును ।
వీనుల నేమైనను వినని యోగీశ్వరుండు ।
నానేటితామరపాకై నడుమందనుండును ॥

వొడ్డిచవులుగొనని ఉత్తమయోగీశ్వరుండు ।
జిడ్డంటనినాలికై నిశ్చింతానుండు ।
యెడ్డవలె మెలంగనియెడలో యోగీశ్వరుండు ।
దొడ్డశ్రీవేంకటేశ్వరుతో నెరమించును ॥ ౩౨౮

పాడి.

పల్లవి.

యేమిటివంకసుఖము యెంచి చెప్పఁగావచ్చు ।
కామించక మానుటే అక్షయసుఖముగాక ॥

(చరణము)

వెలలేని పదార్థాలు వేడుకవలెనెవచ్చు ।
చెలంగినాశమునొంది చింతపుట్టించు ।
పలులంపటములెల్లపనికివచ్చినట్టుండి ।
తలంచినట్టువడక తడబాటుసేయును ॥

సరి నాహార నిద్రలు సహజమువలెనుండి ।
అరుదై వేళలందప్పి యలయించును ।
పరుల సంగతములు భక్తితోన వానగూడె ।
పెరిగి తగులములై పెనంపులంబెట్టును ॥

వుపకారి దానధర్మాలొడంబాలై మించి ।
విపరీతమై బలశి వెసరింపించు ।
యెపుడు శ్రీవేంకటేశ యివియెల్ల నీచేష్టలు ।
వుపమించి తెలిశితే వొద్దికతోనుండును ॥ ౩౨౯

## అధ్యాత్మ సంకీర్తనలు

### మలహరి.

పల్లవి

పరమాత్ముండవునీవు పరతంత్రుడనేను ।
హరినీవు సర్వజ్ఞుండవజ్ఞానముదెల్పవె ॥

(చరణము)

సంతతముసర్వలోకసాక్షివి నీవు గనుక ।
యెంత నే నెఱుంగకున్న నెఱిగించవె ।
యింతట నింద్రియములనేలెవాడవు గనుక ।
చెంతనే లోలుండనైన చేరిబుద్ధిచెప్పవె ॥

జడియు నిబంధమోచనుండవు నీవు నే ।
విడువకున్న మలిమతవిడిపించవె ।
తడయకనీవె సూత్రధారివి గనుకనె ।
నడుమం దెరువు దప్పిన దప్పనీకవె ॥

అనివిశ్వలోచనుండవైనాడవు గనుకనే ।
గానని యర్థములెల్లం గనిపించవె ।
జానుగ శ్రీవేంకటేశ జగత్కుటుంబివిగనుక ।
నానావిధములను నన్నేలి పోషించవె ॥ ౩౨౮

### సాళంగం.

పల్లవి

యివియె తొల్లిటివారు యెంచినడచినశాంతి ।
వివరించి కొలిచితే విష్ణుండె శాంతి ॥

(చరణము)

సకలపుద్యోగములు చాలించుటేశాంతి ।
సుఖదుఃఖములు విడుచుటేశాంతి ।
వొకరేవియిచ్చినను వొల్లకుండుటశాంతి ।
ప్రకటించిరచ్చలకువాయుటేశాంతి ॥

మహిమీఁదిపనులెల్ల మానియుండుటె శాంతి ।
సహజబాంధవములు జారుటేశాంతి ।
బహుకుతర్కములకు బారకుండుటెశాంతి ।
విహితవిషయముల విడుచుటేశాంతి ॥

పూరకెనిశ్చింతమున నుండఁగలదేశాంతి ।
కోరకుండె సాత్వికగుణమెశాంతి ।
భారము శ్రీవేంకటేశుపై బెట్టుటేశాంతి ।
ధీరత తోడుత గుణాతీతుండౌటెశాంతి ॥ ౩౨౨

సామంతం.

పల్లవి

భక్తవత్సలుండవుగా భావించ నీకెదగు ।
శక్తినీకంతైనఁగద్దు సర్వేశ్వరా ॥

(చరణము)

నావాడవేయని వుందు వలి నీవెవ్వరికైన ।
ఆవల నందరి వాండవై వుండుదువు ।
భావించ నిందుకొఱకా బహురూపుండవైతివి ।
వేవేలు శిరసులతో విశ్వమూరితి ॥

నీపేరు నానాలికపై నెలకొనె యీరీతి నే ।
దాపై యిందరి నోళ్లం దగిలున్నవి ।
యేపున బెక్కునామము లిందుకా పెట్టుకొంటివి ।
వోపి నానాశబ్దములతో నువిఁధగా ॥

యేలికవు నాకని యెంచుకొంద్దు నేపొద్దు ।
యీలీల నందరికి నేలికవట ।
తాలిచితి వసంతావతారాలు నివి పనికా ।
వేళతో నానాగతి శ్రీవేంకటేశ్వరా ॥ ౩౨౩

సామంతం.

పల్లవి

భావించనేర్చినవారి భాగ్యముకొలదిముక్తి।
శ్రీవల్లభుండె జీవన్ముక్తి॥

(చరణము)

చూచితలంచెవారికి సులభానమండుముక్తి।
కాచుకున్నవారికి గలదుముక్తి।
చేచేత నందుకొంటె చేరువనే వుండుముక్తి।
యేచికొలిచితె దనయింటనుండుముక్తి॥

తగిలిసాముశేశితె దనలోనున్నదిముక్తి।
పగ లేకుండితె భూమిపైదెముక్తి।
నొగలక నుడిగితే నోరనె వున్నదిముక్తి।
బగివాయకుండితే బట్టబయిటనెముక్తి॥

ధరియించుకుండితె తనువుపైనుండుముక్తి।
అరశితె గురుస్మరణందుండుముక్తి।
యిరవై శ్రీవేంకటేశు నెప్పుడు శేవించితేను।
దొరకి పుణ్యులకు నెదుట నుండుముక్తి॥ 328

గుజ్జరి.

పల్లవి

యీాయీాయీా యీాయీాయీా యీాయీారీతి।
నాగుణముయిదె నాయందెతగిలెను॥

(చరణము)

మనస్సున నే నినుఁదలంచి।
మాటలంగొసరుదును।
వొక్కొకపరి।
వినయముతో నీకు వేవేలుమ్రొక్కులు మ్రొక్కుదును।

వాకొక్కకపరి ।
మనంబగుభక్తిని బయలుల ।
కౌంగిట నలముదును వాకొక్కకపరి ।
తనియక వేడుకతోను దైవమానిముంబాగడుదును ॥
జగత్తున నేనినువెదకి సారెకునవుదును ।
వాకొక్కకపరి ।
పగటున నీనామములు పాడుచుం జెలంగుదును ।
తగులుచు నినుంబూజించి తగం బ్రియమునంజొక్కుదును ।
వాకొక్కకపరి ।
నిగమములను నిన్నువిని నీరజనాభా వెర వెరగందుదును ॥
అంతట నీమహిమగని అటునీదాస్యమే కోరుదును ।
వాకొక్కకపరి ।
చెంతల నీదాసులంజూచి సేవసేసి నిను నడుగుదును ।
వాకొక్కకపరి ।
అంతరంగమున శ్రీవేంకటేశ ।
అలమేల్ మంగతోఁబొడచూపితివి ।
సంతసమున నే నీపాదములకు శరణుచొచ్చి ।
నేఁబ్రదికితిని ॥ ౩౮౦

లలిత.

పల్లవి

కొసరితినోఁ పెనంగి గునిశివిూరుమడుగ ।
వెసనీబంట్ల నింతె నీవె దిక్కునాకు ॥

(చరణము)

బలిమిని బిడ్డండైన బ్రహ్మాంతవాడనా ।
అలసముద్రుండుమామ యంతవాడనా ।
చలువైన నీమఱంది చంద్రు నంతవాడనా ।
వొలుదు నీతో బుట్టినయింద్రునంతవాడనా ॥

చనవున మీతండ్రి కశ్యపునంతవాడనా ।
అనుజుండైన లక్ష్మణునంతవాడనా ।
మనవికి మీబావ ధర్మజునంతవాడనా ।
అనంగుండాతె నభీష్మునంతవాడనా ॥

మునికై నయల్లుండభిమన్యునంతవాడనా ।
అనిరుద్ధుండా మనుమండంతవాడనా ।
ఘనుండ శ్రీవేంకటేశకల్పించి నీవాడించ్చంగా ।
పనివ్రాని మెలగేటి ప్రతిమెను నేను ॥ ౩౫౧

సాళంగనాట.

పల్లవి

కావకుంటె నేదిగతి కమలాక్షా యిందరికి ।
నీవే వుపకారివై నిలిచితిగాక ॥

(చరణము)

జీవురిడేరెకొఱకు శ్రీరంగవేంకటాద్రి ।
దేవభూములందు నీదివ్యమూర్తులు చూపి ।
వేవేలు నీగుణములు వేదశాస్త్రములం దెల్పి ।
యీవలరక్షించేవు నిన్నే మనినుతింతుము ॥

అంతట బాదతీర్థములైన గంగాదినదులు ।
పొంతనె యేడేడకు పుణ్యపురుషులనిల్పి ।
వంతదీర నేకాదశీవ్రతాచారాలుగల్పించి ।
యెంతెంతప్రయాసపడే విదేవనై నీవు ॥

నానావిధమంత్రపు నీనామజపముగల్పించి ।
ధ్యానము యజ్ఞము మొదలైన పూజలు గడించి ।
యీనెపాన శ్రీవేంకటేశ బ్రదుకుమనుచు ।
కానుకగొనియిచ్చేవు ఘనవరములను ॥ ౩౫౨

గౌళ.

పల్లవి

వేడ విచారాలువద్దు విష్ణుండితండె ।
యెడయనివరములిచ్చి నీ దేవుండె ॥

(చరణము)

మున్ను బలభద్రునికి మూర్తియై నిలిచినవాడు ।
సన్నిధై మునులచేఁబూజగొన్నవాడు ।
వెన్నుమీర శేషాద్రికి శిఖరమైయున్నవాడు ।
యిన్నిటికెక్కుడైన వాడిదేవుండె ॥

చదువులలోఁజెప్పి స్వయంవ్యక్తమైనవాడు ।
కదిశి గుహుని సేవగైకొన్నవాడు ।
వెదకంగా సురలకువిశ్వరూపై యున్నవాడు ।
యెదుటఁగానంగవచ్చె నీ దేవుండె ॥

తొండమాంజక్రవర్తితో మాటలాడినవాడు ।
నిండుకొని పెద్దలకు నీడైనవాడు ।
అండనై శ్రీవేంకటేశుండలమేలుమంగతోడ
యెండనీడ కన్నుల వాడిదేవుండె ॥ 383

కాంబోధి.

పల్లవి

అటుగాన శరణంటె అపరాధములెంచకు ।
తటుక్కున బ్రదికించి దయంజూడవె ॥

(చరణము)

యెంచరాని నేరములు యిన్నిఁజేశి యేలికెకు ।
వంచనతో మ్రొక్కితే భావముగరంగు ।
పొంచి పొంచి వెగటుగాబోరెనవాడైనను ।
మంచిమాటలాడితె సమ్మతి హితుండౌను ॥

ఆనాజ్ఞ దోశినట్టి యాతండైన యేలికెకు ।
కానికె చేతికిచ్చితేఁ గరుణవుట్టు ।
మొనముతో సొమ్మెల్లాముచ్చిలించి తినివచ్చి ।
దీనతతో లెంకమైతే దిగులెల్లఁబాపును ॥

వాలాయించి దూరుచేశివచ్చినైనా యేలికెకు ।
వేళగాచి కొలిచితే వేడుకవుట్టు ।
యీలీల శ్రీవేంకటేశ యేజాతివాడైనను ।
మూల నీముద్రమోచితె మునుపే రక్షింతువు ॥ ౩౧౮

బౌళి.

పల్లవి

యితండే బ్రహ్మస్వరూప మితండే పరతత్వము ।
యితండే స్వయంవ్యక్తమితనితలంచుండీ ॥

(చరణము)

హరి వేంకటాద్రినుండునని పురాణములు చెప్పు ।
పరమేష్ఠికి విశ్వరూపము చూపెనందురు ।
సరుసనే జనులకు స్వప్నములో మాటలాడీ ।
పరుషలకు వరాలుపైపైనిచ్చెను ॥

మునులుపూజించిరట మున్నియామూర్తిని ।
సనకాదియోగీంద్రులిచ్చటనె వేదకిరట ।
మొనలేనిమహిమలు యెప్పుడునుంగలవట ।
ఘన దివ్యజ్ఞాన సిద్ధిగలవాడట ॥

అలమేల్మంగపురమందుగాపురమున్నది ।
యిల శ్రీవేంకటేశుండితండై వున్నాడు ।
తలంప నితనిపేరేధరించిరి లోకులెల్ల ।
తెలుసుకొంటె దానెద్రిష్టదేవుండు ॥ ౩౧౯

గుజ్జరి.

పల్లవి

యెక్కడ పోయెనో జాతస్మరత్వము యేమిసేయంగలవాడను నేను ।
దిక్కు నీవె హరినన్నుంగాచుటకు దేవదేవ యింకబోధించవే ॥

(చరణము)

తిరముగ జన్మాంతరమున సంపాదించిన సుజ్ఞానంబున ।
స్మరించి యీపుట్టుగున గడమనె సాధించెదనని యంటినా ।
అరయం దల్లిగర్భంబున వెడలినయపుడె అన్నియుమఱచితిని ।
ధరలోపలనే విడువక త్రావిన మరులుంబాలు ననుమక్కుండేసెను ॥

అంతటనేఁ బెద్దవెరిగి బుద్దెఱింగి అటు నీమ్హాయాప్రపంచమునను ।
చేతల బహువిధసృష్టిలోదగిలి చిక్కువడుచు నేభ్రమశితిని ।
చింతించి నేమఱి వెక్కులు చదువుచు చిత్తములో బహుసంశయములోబడి ।
అంతటనంతట జరగి జరగి కడునజ్ఞానముపాలైతిని ॥

ముదిశిన పిమ్మట లోభమోహములు ముంచుకొనంగ నటులోలుండనైతి ।
వదలక భువిపై బ్రహ్మదేవుండటువ్రాశిన వ్రాతలు నిజమాయె ।
చెదరక యలమేల్మంగ విన్నపము చేకొని శ్రీవేంకటేశ కాచితివి ।
బ్రదికితి నింక నాచార్యునియానతి ఫలియించెను నాభాగ్యమువలన ॥ ౩౮౭

బౌళి.

పల్లవి

సంగరహితుండై నంగాక శాంతమాత్మ కేలగలుగు ।
సంగతెఱంగనట్టి వారిజాడలూరకుండునా ॥

(చరణము)

వెలయ నన్నుపొంతనున్న వెన్న గరంగ కేలమాను ।
పెలుచంజల్ల తోడిపాలు పేరకుండునా ।
అలరి యరడువద్దితీగె అంటంబార కేలమాను ।
చెలులసరసనున్న వారి చిత్తమూరకుండునా ॥

బెరశి యినుముతోడియగ్ని పెట్టు వడకయేలమాను ।
విరులతేనెచూచి తేటివిడువనేర్చునా ।
వోరశి యుల్లింగూడికప్రముగె గంధమేలమాను ।
శిరులతోడమెలంగువారు చింతలేక వుందురా ॥

వూరిచవుటనేల జలములుప్పనుండకేలమాను ।
వూరుంగాయకదవ బెల్లువురులకుండునా ।
కోరి శ్రీవేంకటేశుకొమ్మ యలమేలుమంగ ।
జేరకున్న వారి కతలు చెప్పనెట్టువచ్చును ॥ ౩౮౭

మలహారి.

పల్లవి

మరవంగనియ్యదు రేచును మాయాప్రపంచమిదివో ।
తెఱంగింకనేదో తెలియదు దేహాము మోచినను ॥

(చరణము)

మొక్కడి · మనోరథంబులు మొనోన్నితలఁపునంబారును ।
తక్కక భుజించి యేకాంతంబున నున్నపుడు ।
చొక్కపుచుట్టరికంబులు చుట్టుక యింట్టికి వచ్చును ।
గ్రక్కున సంసారబంధము కట్టుకొనినయంత ॥

పెనగొని పంతపుమాటలు పెక్కులునోరనువెడలును ।
గొనకొని నలుగురిలోపలం గూరుచుండినవేళ ।
వనితలు వద్దనేవుండ్డి వావులుతాన కూడును ।
మనసొడంబడి తనలో గామముమిక్కుటమైన ॥

చేతులంబెనగొని కర్మము చేతలుయేమో సేయించు ।
మొతులరాజ్యమదంబున నెనశిన సమయమునా ।
యీతల శ్రీవేంకటేశ్వర యేలితివిటు ననునీవే ।
కౌతుకముగ శరణాగతికాచును మమ్మెపుడు ॥ ౩౮౮

## సామంతం.

పల్లవి

నేనె భాగ్యవంతుండను నీకృపగలిగెను నాకు ।
జ్ఞానమిచ్చితివి నేసంసారము సేయంగాను ॥

(చరణము)

పుట్టుదరిద్రుండై వున్నప్పుడు వచ్చినసంపద ।
అట్టె వేపచేదుడాగె యప్పటితీపు ।
దట్టమై యాకలిగొన్నతఱిగలయాహారము ।
గట్టిగాజవియైనట్టు గలిగె నీభక్తి ॥

చిక్కులేక భీతివాశిన మీఁదిసంతోషము ।
నిక్కపురోగము మానినసౌఖ్యము ।
మిక్కిలి యప్పులు దరిమెఁగసె దొరతనము ।
గ్రక్కున నాకబ్బినట్టు గలిగె నీభక్తి ॥

జడిశి యెండదాకిన సమయమందలి నీడ ।
అడవిలోపల సహాయమైనతోడు ।
అడరి దొరకినట్టు అట్టె శ్రీవేంకటేశ ।
కడంగి నీకృపవల్లంగలిగె నీభక్తి ॥ ౩౮

## వరాళి.

పల్లవి

ఆమూరితియే యీమూరితి అందునిందు భేదము లేదు ।
సోమార్కనేత్రుండ విశ్వరూపములు చూచినవారమే మునుయేము ॥

(చరణము)

బలిమితోడ వత్సాపహరణమున బ్రహ్మకుని మాయ చూపితివి ।
విలసిల్లంగ రణభూమిని నరునకు విశ్వరూప మటుచూపితివి ।
అలరిని నీరూపు జలమధ్యంబున అక్రూరునకటుఁజూపితివి ।
చెలంగి కుమారస్వామికి నారూపు శ్రీవేంకటగిరింజూపితివి ॥

దైవికముగ దుర్యోధనునభను ప్రతాపము నీరూపు చూపితివి ।
ఆవిధముననే నీరూపము దక్కనాశ్రమమున నటుచూపితివి ।
నీవిధమెఱంగని భీష్మకు నీకు మఱి నిర్మలరూపము చూపితివి ।
శ్రీవేంకటగిరి నారూపంబెచేరి పరుషలకుంజూపితివి ॥

పుట్టినపుడె వసుదేవునకు చతుర్భుజములని రూపు చూపితివి ।
జట్టిగ గొల్లెతలకు రూపము రాసక్రీడలలో జూపితివి ।
యిట్టె నారదునకు ద్వారకలో యింట్లింట నీరూపు చూపితివి ।
పట్టుగ శ్రీవేంకటేశ్వర ఆరూపమె మాకిప్పుడు చూపితివి ॥ 3౯౦

సామంతం.

పల్లవి

దైవమా నీతప్పు లేదు తలంచేవారి భాగ్యమె ।
వేవేలుగా నుతియించి వేదములే నిన్నును ॥

(చరణము)

నీవు గలవనే చోట నీగుణములుఁగలవె ।
నీవు లేనిచోట నిర్గుణమౌను ।
భావించితె మనసులోంబరగు నీసాకారము ।
ఆవలనిన్నుంగాన నిడడే నిరాకారము ॥

యెఱింగి కనుగొంటెను యీజగమెల్ల నిజము ।
మెఱంగక మఱచితె నింతామిథ్యా ।
పుఱకభక్తిసేసితేను నందునందు భేదము ।
నెఱయనొల్లకుండితే నిలుచున భేదము ॥

తపము ఫలించెనంటె దండనుండు మోక్షము ।
యెపుడునిష్ఫలమంటె యెన్నండు లేదు ।
కృప నలమేల్మంగకధిప శ్రీవేంకటేశ్వర ।
కపటములింకనేల కావవెయిందఱిని ॥ 3౯౧

## లలిత.

### పల్లవి

కటకటా యీయాత్మలే గతి నీదెరగలరు ।
యిట్టు నీకుశరణంటె యిట్టె రక్షింతువు ॥

### (చరణము)

చేరి నీమహిమ చిరజీవులనడిగేమంటె ।
ఆరీతి జీవులు బ్రహ్మాదిదేవతలింతె ।
వారుం దమపుట్టినయివ్వలగానితొల్లింటి ।
నీరూప మింతింతని నిశ్చయింపలేరు ॥

అందరికి శృతులే ఆధారమనాదినుండి ।
పొంద్దుగా నడిగేమంటె పొడచూపవలియును ।
కంద్దువరుషుల పాతక్రమములవచ్చెనింతె ।
అందరియర్థములు నిశ్చయములు సేయ లేరు ॥

అదిగాన యెంచి సనకాదులు శుకాదులును ।
మొదలనే నినుంగొల్చి ముక్తులనిపించుకొనిరి ।
అదనందక్కిన వుపాయముల నింతవున్నదా ।
పదిల యలమేల్మంగపతి శ్రీవేంకటేశా ॥ 3F_೨

## బౌళిరామక్రియ.

### పల్లవి

యింతమాత్రము మానె మమిందుని కేమిగూడిని ।
చెంతధర్మమునకు రక్షించేవు నీవు నన్ను ॥

### (చరణము)

పిడికెడు బియ్యమె పేదరికంబగువేలిమి ।
తోడింబడ సంధ్య మూడుదోశిళ్లనీళ్లు ।
నుడిగి జపమువేళ నూటయెనిమిదెంచ్చేది ।
తడుపుకొనేది తీర్థస్నానములన్నియును ॥

ఘోరకయా కలిగోని వుండేది మా వ్రతములు ।
నిరసపుటాహారాలు నిష్టలెల్లను ।
ఘోరందోటలపువ్వులోగి దేవపూజలు ।
గోరమైనబ్రతుకులు కోరేటి తపములు ॥

బలసాకుతిలలు దర్భలు పితృపూజలు ।
పలుకకుండేది మాబలుమోసము ।
యిలపై శ్రీవేంకటేశ యిందు నిన్ను మెప్పించేమా ।
కలిగినదిమాకు నీకరుణేకాకా ॥ ౩౯౩

సామంతం.

**పల్లవి**

యెట్టుదోయవచ్చు వినినెంతటి వారికైనను ।
పట్టి నీకు శరణంటె బ్రదికింతువు గాక ॥

(చరణము)

మాలతనమునంటిది మతిందగులుంగామము ।
అలరిముట్టు వంటిది యంటుంగ్రోధము ।
కేలినోదిగించు నెంగిలివంటిది లోభము ।
వాలాయించి యెందుండైనావచ్చునులోకులకు ॥

చుట్టి మద్యమువంటిదె చొక్కించు మోహము ।
పట్టిమాంసము నంటిది వయోమదము ।
పుట్టిన భ్రమవంటిది పొదిగిన మచ్చరము ।
వుట్టిపడి నోరూరించు నూరకె ప్రాణులను ॥

గోడమలంగువంటిది గుట్టు తోడిసంసారము ।
విడని కట్టువంటిది వేడుక యాశ ।
యీడనె శ్రీవేంకటేశ యేలితివి నీదాసుల ।
జాడదప్పనియ్యవు యీచందము జీవులదె ॥ ౩౯౪

## శంకరాభరణం.

### పల్లవి

తనమనసే తనకు తారుకాణ వచ్చుగాక ।
విను కలి పరబుద్ధి వీనులంబట్టినా ॥

### (చరణము)

చుట్టమైనవాడు తన చోటికి నమ్మికే గాక ।
వెట్టివాడు సతమౌనా వేగినంతను ।
అట్టె తనయింటియన్న మాకటికొదగుంగాక ।
పొట్టం బొరుగువిందులు పొద్దు దప్పకుండునా ॥

వాడికైన యిల్లాలు వంశమునకెక్కుంగాక ।
కూడగొట్టుకాంత తనకులమయ్యేనా ।
వాడలో మంచిగుణము వాసివన్నెందెచ్చుగాక ।
యేడనైనా యపకీర్తి హీనమెకదా ॥

మొక్కిన హరింగొల్చితే నిహపరములిచ్చుంగాక ।
తక్కిన దేవతలింతటికో పేరా ।
చక్కని శ్రీవేంకటేశుండు సర్వాంతరాత్ముకుండు ।
తక్కక మనుజులాల తలంచి బ్రదుకరో ॥ ౩౯౫

## శ్రీరాగం.

### పల్లవి

యెట్టు వేగించేదిందుకె గురేశితరకాండ్లు ।
వెట్టివేమి సేయుమంటా వెన్నడించేరిపుడు ॥

### (చరణము)

వొంటికాలం గుంట్టిగకుంట్టి వ్రారిబందెలకుంజిక్కి ।
పంటదాకా దున్ని నొక్కపసురము ।
గంటు గంటు లాకలొత్తి కల్లలనడిమిపంట ।
కుంట్టివాడు గావలుండి కుప్పలేరుపరుచె ॥

కలదికక్కమంచము కన్నవారెల్లంబండేరు ।
తలెతోదొగ్గినంబ్బలిదావక్షూళ్లు ।
వెలంగంతలకొంపలు విడుంబట్లుచూపేరు ।
తలవరులెందులోన దప్పువెదకేరు ॥

వొళ్లుచెడ్డవాడొకండు వుభయమార్గ గొని ।
కల్లదొరపుట్టుబడి కడుంగట్టెని ।
చల్లని శ్రీవేంకటేశ సకలలోకపతివి ।
యిల్లిదే నీశరణంటిమిందరినింగావలె ॥ 3౯౭

లలిత.

పల్లవి

తప్పదు తప్పదు దైవముకృప యిది ।
ముప్పిరి నింతా ముకుందుడే ॥

(చరణము)

వెక్కసపుమతి వెలుతులుదేరిస ।
నెక్కడచూచిన నీశ్వరుండె ।
గుక్కక యాసలు గోసి వేశినను ।
నిక్కమడుగడుగు నిధానమె ॥

పొంచి శరీరపు భోగములుడిగిన ।
చుంచుబాపములు సుకృతములె ।
దంచేటివిషయపు తగులమింబాసిన ।
మెంచి చూచినను యిహమే పరము ॥

శ్రీవేంకటపతి సేవె కలిగిన ।
వేవేలు వగలువేడుకలె ।
చేవదీరె సందియములేదిదె ।
భావమునమ్మిన ప్రపన్నులకును ॥ 3౯౮

## తాళ్ళపాకం కవుల కృతులు

బౌళి.

పల్లవి

దేవ నీవి చేదెందుకు దీనికింగా నింతయేల ।
యేవేళ మాయెరుకలు యెందుకుంగోలుపును ॥

(చరణము)

యెవ్వరివశములు బుట్టిరింగినడచె మన ।
యివ్వల నారాయణ నీవియ్యక లేదు ।
దప్పు చేరువ మనసు యిచ్చియితే గనక ।
రవ్వగ మృగాదులెల్ల రాజ్యమేలనేరవా ॥

సారెకు నిన్నుందలపించ జంతువులవశమా ।
కేరి నీవు జిహ్వాంబలికించగాగాక ।
యీరీతి లోకమెల్లం దమయిచ్చకొలందులనయితే ।
దూరానగొక్కెరలు చదువవా వేదాలు ॥

యిందరి పాపపుణ్యాలు యిన్నియు నీచేతలే ।
కందువ స్వతంత్రులుగారు గాన ।
చందపు శ్రీవేంకటేశ శరణంటినిదె నీకు ।
చెంది నీవెకాతుగాక చెంతటనువలెనా ॥ 3గా

సామంతం.

పల్లవి.

పరుసమొక్కటికాదా పయిండిగా జేసేది ।
అరయ లోహామెట్టున్నా నందుకేమి ।

(చరణము)

వనజనాభునిభక్తి వదలకుండినజాలు ।
మనసు యెందుదిరిగినా మఱియేమి ।
మొనశి ముద్రలుభుజముల నుండితేజాలు ।
తనువెంత హేయమైన దానికేమి ॥

శ్రీకాంతునామము జిహ్వాదగిలి తెజాలు ।
యేకులజుండైననను హీనమేమి ।
సాకారుడైన హరిశరణుచొచ్చినజాలు ।
చేకొని పాపములెన్ని చేశిననేమి ॥

జీవుండెట్టున్న నేమి జీవునిలోయంతరాత్మ ।
శ్రీవేంకటేశునకాచింతయేమి ।
యేవల నంబరమైన యిహమైన మాకుజాలు ।
కై వశమాయె నతండుకడమలింకేమి ॥ ౨౯౯

భూపాళం.

పల్లవి

మిన్నక వేషాలు మాని మేలుకోవయ్యా ।
నన్నుల నీయోగనిద్రచాలు మేలుకోవయ్యా ॥

(చరణము)

ఆవులు పేయలకుంగా నఱచిం చిదుకవలె ।
గోవిందుండ యింక మేలుకొనవయ్యా ।
ఆవలి వలిపదుచులాటలు మరిగివచ్చి ।
త్రోవగాచుకున్నారు ప్రొద్దున మేలుకోవయ్యా ॥

వాడల గోపికలెల్లావచ్చి నిన్నుముద్దాడం ।
గూడియున్నారిదె మేలుకొనవయ్యా ।
తోడనె యశోద గిన్నెతో బెరుగువంటకము ।
యీడకుందెచ్చి పెట్టె నింక మేలుకోవయ్యా ॥

పిలిచినందగోపుండు పెరుకొనియిదె కన్నుం ।
గొలుకులువిచ్చి మేలుకొనవయ్యా ।
అలరిన శ్రీవేంకటాద్రిమీది బాలకృష్ణ ।
యిల మామాటలు వింటువింక మేలుకోవయ్యా ॥ ౩౦౦

పాడి.

పల్లవి

యిందునుండ మీకెడలేదు ।
సందడిసేయక చనరో మీరు ॥

(చరణము)

నాలుక శ్రీహరినామంబున్నది ।
తూలుచుంబారరో దురితములు ।
బారిభుజంబునచక్రంబున్నది ।
తాలిమి భవబంధములటుదలరో ॥

అంతర్యామై హరివున్నాఁడిదె ।
చింతలువాయరో చిత్తమున ।
వింతలచెవులను విష్ణుకథలివిగో ।
పొంతలఁగర్మములు పోరో మీరు ॥

కాపయి శ్రీవేంకటపతి పేరిదె ।
నాపై నున్నది నయమునను ।
కోపపు కామాదిగుణములార మీ ।
రేపున కడంగడ నెందైనం బోరో ॥ ౪౦౧

రామక్రియ.

పల్లవి

నీయాజ్ఞ దలమోచి నీదేహధారినైతి ।
యీయెడ గోవిందుండ నేనిదే రెట్లో ॥

(చరణము)

తనువు వెసరినాను తలంపువెసరదు ।
ధనముగడించేటి తరితీపున ।
చెనకి మగండువిడిచిన మామవిడువని ।
పనియాయె హరి నాబ్రదుకుజాడయెట్లో ॥

ప్రాయముముదిశినను భావముముదియదు ।
వేయైన సంసారవిషయాలను ।
వోయయ్య కలివోసెనా వుట్లదిక్కుచూచేదె ।
మాయదాయనింక నామనసుజాడెట్లో ॥

కడలేని నావిధులు కన్నులారంజూచి నీవు ।
నడుమ శ్రీవేంకటేశ నన్ను నేలితి ।
నోడుగులు దప్పినను నోముపలముదప్పని ।
అడియాలమచ్చెనాకు నానతిచ్చితెట్లో ॥ ౪౦౨

భూపాళం.

పల్లవి

క్షితిని జీవులంగావ మేలుకోవయ్యా ।
నీదయ మాకెల్లరక్ష నిద్ర మేలుకోవయ్యా ॥

(చరణము)

తగుగోపికలకన్ను దామరలువికసించె ।
మిగుల సూర్యనేత్రుండ మేలుకోవయ్యా ।
తెగువరాక్షసులనే తిమిరమువిరియంగ ।
నెగడిన పరంజ్యోతి నిద్ర మేలుకోవయ్యా ॥

ఘనదురితపు నల్లంగలువలు వికసించె ।
మినుకుశశివన్నుండ మేలుకోవయ్యా ।
పనివడి వేదాలనె[illegible]త్తులెల్లంబలుకంగ ।
జనక యాశ్రితపారిజాత మేలుకోవయ్య ॥

వరలక్ష్మి కుచచక్రవాకములొండొంటిరాయ ।
మెరయు దోషారహిత మేలుకోవయ్య ।
పొరశి నీవు నిత్యభోగములు భోగించ ।
నిరతి శ్రీవేంకటేశనెందు మేలుకోవయ్యా : ౪౦౩

## లలిత.

**పల్లవి**

ఆతుమ సంతసపెట్టుటది యెఱుకాతా ।
నేతెరువన్నోల్లకుండుటిదియే యెఱుకా ॥

**(చరణము)**

ముంచినబంధములలో మునుంగుడు వడక తా ।
సంచలవిడందన్నుటది యెఱుకా ।
చంచలపువిషయాల సగ్గుడు మగ్గుడుగాక ।
యెంచిహరిందలపోయుటిదియే యెఱుకా ॥

పాయనియర్థములకు బంట్లుబంటై తిరుగక ।
ఆయతమై మోసపోనిదది యెఱుకా ।
ప్రాయపుగామినులతో బలుమారుఁజేయుపొందు ।
హేయమని తలపోయుటిదియే యెఱుకా ॥

ధరమీదంగల ప్రాణితతులనొప్పించక ।
అరయంగ సముండగుటది యెఱుకా ।
గతిమల శ్రీవేంకటపతిదాసుండై ।
యిరవొంద సుఖించుటిదియే యెఱుకా ॥ ౨. ౨

## రామక్రియ.

**పల్లవి**

యిందిరానాయక యిదె వోమాపాటు ।
చెందె నీవే గతి చేకొనవయ్యా ॥

**(చరణము)**

తీసెంగోరికతిదివ్వులోకవంక ।
లాసె సంసారలంపటము ।
మూసెం గర్మములనుకొని పరచింత ।
నేనేదేమింక జెప్పేదేమి ॥

వంచినాసలు వలశినచోటికి ।
పొంచి దుర్గుణభోగములు ।
ముంచి యౌవనమోహాంధకారము ।
యెంచేదేమి సోదించేదేమి ॥

యెఱింగి చిత్తము యించుకించుకనిన్ను ।
మఱవని నీపై భక్తిమరినుండగా ।
నెఱి శ్రీవేంకటపతివి నీవెకాతువుగాక ।
వెఱచి నేజేసే విన్నపమేమి ॥ ౭౧౪

రామక్రియ.

పల్లవి

నారాయణాయ నమో నమో నానాత్మనే నమో నమో ।
యీరచనలనే యెవ్వరుదలంచిన యిహపరమంత్రములిందరికి ॥

(చరణము)

గోవిందాయ నమో నమో గోపాలాయ నమో నమో ।
భావజగురవే నమో నమో ప్రణవాత్మనే నమో నమో ।
దైవేశాయ నమో దివ్యగుణాయ నమో నమో యనుచు ।
యీవరుసలనే యెవ్వరుదలంచిన యిహపరమంత్రములిందరికి ॥

దామోదరాయ నమో నమో ధరణీశాయ నమో నమో ।
శ్రీమహిళాపతయే నమో శిష్టరక్షణే నమో నమో ।
వామనాయ తే నమో నమో వనజాక్షాయ నమో నమో ।
యీమేరలనె యెవ్వరుదలంచిన యిహపరమంత్రములిందరికి ॥

పరిపూర్ణాయ నమో నమో ప్రణవాగ్రాయ నమో నమో
చింతన శ్రీవేంకటనాయక శేషశాయినే నమో నమో ।
నరకధ్వంసాయ నమో నమో నరసింహాహ్వయ నమో నమో
యిరవుగ నీగతినెవ్వరుదలంచిన యిహపరమంత్రములిందరికి ॥

లలిత.

పల్లవి

అంతర్యామి అలసితి సొలసితి ।
యింతట నీశరణిదె చొచ్చితిని ॥

(చరణము)

కోరినకోర్కులు కోయనికట్లు ।
తీరవు నీవవి తెంచకా ।
భారపుబగ్గాలు పాపపుణ్యములు ।
నేరుపులబో నీవు నీవువద్దనకా ॥

జనులసంగములం జక్కరోగములు ।
విను విడువవు నీవు విడిపించకా ।
వినయపుదైన్యము విడువని కర్మము ।
చనదదె నీవిటుసంతపరచకా ॥

మదిలోచింతలు మయిలలు మణుంగులు ।
వదలవు నీవవివద్దనకా ।
యెదుటనె శ్రీవేంకటేశ్వర నీవదె ।
అదనంగాచితివి అట్టిట్టనకా ॥ ౪౦౭

ఆహిరి.

పల్లవి

దేవ నీమాయ తిమిరమెట్టిదో నా ।
భావము చూచిగొబ్బునంగావలె ॥

(చరణము)

వెడదుఃఖమపుడెల్ల వెసరుచుండుదుగాని ।
తడవి విరతింబొందితలంగలేను ।
అడియాసలందిరిగి అలయుచుండుదుగాని ।
మడిదోసకుల నివిమానలేను ॥

హేయము శ్రీసుఖమని యెఱుంగుచుండుదుగాని ।
పాయపుమదము చేతం బాయలేను ।
పాయని పాపాలుచూచి భయమందుచుండుంగాని ।
వోయయ్య యివిసేయకుండలేను ॥

కలకాలమిన్నియునుం గందు విందుంగాని మఱి ।
యెలమినొక్కటనైన యెచ్చరలేను ।
బలిమి శ్రీవేంకటేశబంధముక్తునింజేశి ।
తలంపులో నెలకొని దయంజూడవయ్యా ॥ ౨౦౮

పాడి.

పల్లవి

అభయమభయమో హరినీకు ।
విభుండవింతటికి వెరవింకనేది ॥

(చరణము)

జడిగొని మదిలో శాంతము నిలువదు ।
కడుంగడు దుస్సంగతివలన ।
యిడుమలేనిసుఖమించుకగానను ।
అడియాసల నాయలమటవలన ॥

తలంపులోన నీతత్త్వమునిలువదు ।
పలులంపటముల భ్రమవలన ।
కలిగిన విజ్ఞానగతియును దాగెను ।
వెలివిషయపు పెరివికులవలన ॥

ప్రక్కనం బాపపుబంధములాడెను ।
చిక్కక నినుం దలంచినవలన ।
చిక్కులువాసెను శ్రీవేంకటపతి ।
నిక్కమునాకిదె నీకృపవలన ॥ ౨౦౯

## భౌళి.

పల్లవి

కొందరికివి సమ్మతిమైతే కొందరికవిగావు ।
యిందరిలోపల నీవెడమాయలు యేగతిం దెలిసేనే నయ్యా ॥

(చరణము)

దూరము కర్మమునకు జ్ఞానముతోడనె వొండొకటికిని ।
దూరము పరమునకుం బ్రపంచము తొలుతవిరుద్ధంబు ।
దూరము విరతికి సంసారము తుదమొదలేలేదు ।
యీరీతుల నీవెడమాయలు యేగతిందెలిసెద నేనయ్యా ॥
కూడదు దేహమునకు వాత్మకు గోత్రవిరోధంబెన్నండును ।
కూడదు కోపమునకు శాంత్తము గుణావగుణములను ।
కూడదు బంధమునకు మోక్షము కోరికలేకట్లుగాన ।
యేడగోలందిగా శ్రీహరిమాయలు యేగతిందెలిసెద నేనయ్యా ॥
శ్రీవేంకటపతి నన్నిగతింజిక్కించితివి జగమునను ।
భావింపంగరాదు నీమహిమ బహుముఖముల యథార్థముగాన ।
యేవిధమును నేటికి నాకింక యెందెందని తగిలెదనేను ।
దైవికమగు నీదాసానదాస్యము దక్కీనదే నాకు ॥ ౪౧౦

## పాడి.

పల్లవి

అంతయు నీవె హరిపుండరీకాక్ష ।
చెంత నాకునీవె శ్రీరఘురామా ।

(చరణము)

కులమును నీవే గోవిందుండానా ।
కలిమియు నీవే కరుణానిధి ।
తలంపును నీవే ధరణీధరానా ।
నెలవును నీవే నీరజనాభా ॥

తనువును నీవే దామోదరా ।
మనికియు నీవే మధుసూదనా ।
వినికియు నీవే విఠలుండా నా ।
వెనకముందు నీవె విష్ణుదేవుండా ॥

పుట్టుగు నీవె పురుషోత్తమా కొన ।
నట్టనడుము నీవే నారాయణా ।
యిట్టె శ్రీవేంకటేశ్వరుండా నాకు ।
నెట్టయినగతి యింక నీవే నీవే ॥ ౪౧౧

శాళి.

పల్లవి

అన్నిట నీవంతర్యామివి అవుట ధర్మమే అంటినను ।
యెన్నంగ నీవొక్కండవే గతియని యెంచికొలుచుటే ప్రపన్నసుగతి ॥

(చరణములు)

యేకాంతంబుననుండినపతిని కొనిసతి రమించుటే సతిధర్మంబు ।
లోకము రచ్చలలోనుండిన పతిలోఁగొనిపై కొనిరానట్లు ।
యీకోలందులనే సర్వ దేవతలయిన్నిరూపులై నీవున్నప్పుడు ।
కైకొని నిను బహుముఖములం గొలుచుటగాదా పతివ్రతధర్మంబు ॥

పూనినబ్రాహ్మణులలోపల నే నినుంబూజించుట వేదోక్తధర్మము ।
శ్వానకుక్కుటాదులలోపల నిను సరిం బూజించంగరానట్లు ।
యీనియమములనే ప్రాకృతజనులను యీశ్వర నీశరణాగతిజనులను ।
కానక వొక్కట సరిగాఁజూచుటకాదం వివేకధర్మంబు ॥

శ్రీవేంకటపతి గురువను మతినేసేవే నాకును శిష్యధర్మము ।
ఆవలనీవల నితరమార్గములు యాత్మలోన రుచిగానట్లు ।
భావింపంగ సకలప్రపంచమును బ్రహ్మంసత్యజ్ఞానమనంతము ।
కైవశమై యిన్నిటా వెనుతగులుకాదా వివేకధర్మంబు ॥ ౪౧౨

ఆహిరి.

పల్లవి

కోరుమంచరో కోటారు।
ఆరసి మనసా అంతరాత్మకు॥

(చరణము)

కొండలపొడవులు కోరికకుప్పలు।
పండినపంటలు భవములివి।
నిండినరాసులు నిజకర్మంబులు।
అండనెయివి మాయారంభములు॥
వెలిధాన్యంబులు విషయపురాసులు।
పొలివారెటి పూరుపుగములు।
కలుషపుమదమున కాపుగప్పినవి।
అలవిమీరి మాయారంభములు॥
బడి నింద్రియముల బంతులునురిపె।
కడురతుల దండగట్టలతో।
యెడనెడ శ్రీవేంకటేశు మహిమలనే।
అడియాలపు మాయారంభములు॥ ४०३

ఆదిత: గీతానాం సంఖ్యా ४०३.

